భాగవత కథా గ్రంథమాల 60 వ పుష్పము

# శ్రీకృష్ణ తిరోధానము



గ్రంథకర్త :

శ్రీ శ్రీల ప్రభుదత్త బ్రహ్మచారిగారు

అనువాదకుడు :

శ్రీ రామ్‌శరణ్ కుందుర్తి వేంకట నరసయ్య

ప్రకాశకులు :

భాగవతకథా గ్రంథమాల,

బుద్దాం. P. O. (గుంటూరు జిల్లా)

బ్రాంచీలు: ఐందరు, తణుకు, లక్కవరం.

 1970 [వెల : 9-00

సోల్ డిస్ట్రిబ్యూటరుస్ :

నటరాజ పబ్లికేషన్స్

ఏలూరు రోడ్ * విజయవాడ-2

# విషయ సూచిక

# శ్రీ సీతారామచంద్రస్వామివారి విగ్రహములు

ఈ చిత్రములు శ్రీమంగెన సత్యనారాయణమూర్తి గారు, (లక్కవరం, రాజోలు తాలూకా) వారు స్వయముగ నిర్మించిన దేవాలయమున ప్రతిష్ఠించిన మూర్తులు. అవి చలవరాతివిగ్రహములు. కాశీనుండి తేబడినవి. వానికొరకై సుమారు రు 50,000లు వ్యయమొనర్చి దేవాలయమును నిర్మించి, అంతటను పింగాణీరాతిని బరిపించి, వెండి బంగారములతో మకరతోరణాదులను జేయించి నిత్యపూజాకైంకర్యాదులు జరుగునట్లేర్పాటును గావించిరి. సువర్ణయంత్రములు, సువర్ణకలశములు ప్రతిష్ఠింపబడినవి.

ఆ మూర్తులను గాంచిన మనస్సీవలకు రానేరాదు. అచ్చటనే హత్తుకొనిపోవును. శ్రీరామచంద్రుడు పుంసాం మోహనరూపుడు కదా! అట్టి శ్రీరామచంద్రు డాకుటుంబమునకు సకల సౌభాగ్యములను గలిగించుగాక!

శ్రీ రా మ శ ర ణ్.

# భాగవతకథ



# శ్రీకృష్ణతిరోధానము



## సాంఖ్యవిధి నిస్పృష్టి

శ్లో॥ అథ తే సంప్రవక్ష్యామి సాంఖ్యం పూర్వైర్వినిశ్చితమ్॥
యద్విజ్ఞాయ పుమాన్సద్యో జహ్యాద్వైకల్పికం భ్రమమ్॥

— శ్రీభాగ. ౧౧ స్కం. ౨౪ అ. ౧ శ్లో॥

వ. ఉద్ధవా! నేను నీకు పూర్వాచార్యులచే నిశ్చితమై వర్ణింపఁబడిన సాంఖ్యయోగమును గూర్చి చెప్పితిని. దీనినిఁ దెలిసికొనుటవలన మానవుఁడు వైకల్పిక భ్రమను వెంటనే వదలిపెట్టును.”

— శ్రీమదాంధ్రభాగవతము.

సమస్త బుద్ధిమంతులకీ ప్రపంచ మెట్లు ఉత్పన్నమైనదను నదియే ముఖ్యమగు ప్రశ్న. ఈ నానాయోనులే కాదు, పర్వత, వనోపవన యుక్తమగు నీ ప్రపంచ మెట్లుద్భవించినది. దీనిలో నెన్ని తత్వములు కలవు, వానిలోఁ ప్రధాన తత్వము లెన్ని కలవను విషయమున నందఱిది ఒక్కమతము

కాదు. మతములు భిన్నభిన్నములుగ నున్నవి. కొందఱు తత్త్వముల సంఖ్య ఒక విధముగఁ జెప్పిన, నింకొక రింకొక విధమునఁ జెప్పెదరు. సంఖ్య అనగా లెక్కగాఁ జెప్పుటచే నీ శాస్త్రమునకు సాంఖ్యమను పేరు వచ్చినది. సంఖ్య యనఁగా సృష్టిలోని తత్త్వము లన్నిటిని లెక్కించి, సంపూర్ణ ప్రపంచ జ్ఞానము కలిగియుండుట. కొంద ఱిరువదైదు తత్త్వము లనుచుందురు. సాంఖ్యములందును రెండు మతములు కలవు. సేశ్వరసాంఖ్యము, నిరీశ్వర సాంఖ్యము. యోగదర్శనికులు సంఖ్యను దత్త్వములుగ నెన్నెదరు.ఇది గాక వారొక పురుష విశేషమును నీశ్వరునిగ భావించెదరు. కావున వారి మతమున నిరువదియైదు తత్త్వములు కాక యిరువదిఆఱు తత్త్వములైనవి. సేశ్వరసాంఖ్యముయొక్క పూర్ణ వివేచనము శ్రీమద్భాగవతమునఁ గలదు.

సూతుఁ డిట్లనెను :–"మునులారా! ఉద్ధవుఁడు భగవానుని సంఖ్యను గూర్చి ప్రశ్నింపఁగా భగవానుఁ డుద్ధవునితో నిట్లనెను :– ఉద్ధవా! ప్రళయాంతమునను సృష్ట్యాదియందును కృతయుగము వచ్చును. అప్పుడొక అద్వయ, నిర్వికల్ప, నిరీహ, నిరంజన బ్రహ్మమే యుండెను. అప్పుడు ద్రష్టా, దృశ్య భేదములు లేవు. అదియే ద్రష్ట, అదియే దృశ్యము. దానికి జ్ఞానమను సంజ్ఞకలదు. దానికదియే ఉత్పన్నమైనది. ఒకని కొక కుమారుఁ డుండెను. ఎవఁడో వచ్చి" అయ్యా! నీ పెద్దకొడు కెవరని అడిగెను.

సమీపముననే కూర్చుండిన దన పెద్దకొడుకు వైపు నకుఁ జూపి "ఈతఁడే నా పెద్దకొడు కనెను."

అంత నాతఁ డిట్లడిగెను :- "చిన్నవాఁ డెచ్చట నున్నాఁడు."

అప్పుడును నాతఁ డాతని వైపునకే చూపించి యి ట్లనెను :- "ఈతఁడే నా చిన్నకొడుకు."

సారాంశ మేమనఁగా నున్న దొక్కఁడే యైనపుడు పెద్దవాఁడైనను నాతఁడే, మధ్యముఁడైనను నాతఁడే, చిన్న వాఁడైనను నాతఁడే. అదే విధముగ వివేక సంపన్నుఁ డగు పురుషుఁ డాదియందు బ్రహ్మ ఒక్కఁడే ఉన్నాఁడని చెప్పును. ఆతనిని ద్రష్ట యనును, దృశ్యమనును. అంతయునొక్కటే. తరువాత నవాఙ్మానస గోచరమును నిర్వికల్పమును సత్య స్వరూపమునగు బ్రహ్మ దృశ్య, ద్రష్టారూపమున రెండు విధములుగ నైనవి. దృశ్యమునకు మాయ యను పేరు వచ్చినది. ద్రష్టకు బ్రహ్మయను పేరు వచ్చినది. సాంఖ్య శబ్దములతో నా మాయనే ప్రకృతియందురు. రెండవ దగు ద్రష్టకు పురుషుఁ డను పేరువచ్చెను. ఇప్పు డొక్కటినుండిన నద్వయమును నిర్వికల్పమునైనది ప్రకృతి పురుషులను రెండు రూపము లయ్యెను. ఆ ప్రకృతి మరల రెండు రూపము లయ్యెను. కార్యరూపమగు ప్రకృతి, కారణరూపమగు ప్రకృతి. మూలప్రకృతి కారణరూపము. దాని వలనఁ గలిగిన

వికృతి కార్యరూపము. గుణముల యొక్క సామ్యావస్థను బ్రకృతియందురు. త్రిగుణములు సమానముగ నుండినం బ్రకృతిలో క్షోభముకలుగదు. అంతవఱకది సృష్టి యొనర్పం జాలదు. సృష్టి విషమతలోనే జరుగును. సమత్వమున సృష్టి లేదు. తల్లిదండ్రులయొక్క రజోవీర్యములు విషమమైనచో సంతానోత్పత్తి యగును. వీర్యమధికమైనచోఁ బుత్రుఁడు పుట్టును. రజస్సధికమైనచోఁ బుత్రిక పుట్టును. రెండును సమానమైనచో సంతతి కలుగదు. ఇదే విధముగ గుణములు సమముగ నుండినచోఁ బ్రకృతి వికృతినిఁ జెందనే చెందదు. సృష్టిని ఆరంభింపవలసి యుండెను. అందువలన నేనే ప్రకృతిలో క్షోభమును గలిగించితిని.''

ఉద్ధవుఁడిట్లడిగెను :—''స్వామీ! మీరు ప్రకృతి నేల క్షుబ్ధమొనర్చితిరి ?''

నవ్వి భగవానుఁడిట్లనెను :— ''పురుషునిఁ గాంచఁగనే ప్రకృతిక్షోభమును జెందితీరును. అది అట్లొనర్పఁబడినది. జననోన్ముఖ జీవుల అదృష్టానుసారముగ నా ప్రేరణచేఁ బ్రకృతియందు క్షోభము కలుగును. తల్లిదండ్రులు తిను నన్నమందును, నీటియందును జీవము లుండును. వానివలన స్త్రీ పురుషులకు రజోవీర్యము లేర్పడును. వారు పరస్పరము భోగింప వ్యగ్రులగుదురు. అందువలనఁ బురుషుని ప్రేరణచేఁ బ్రకృతియందు క్షోభము కలుగును. సంతానము కలుగును. అంత సృష్టివృద్ధియగును.''

ఉద్ధవుఁ డిట్లడిగెను:- "సృష్ట్యాదియందు జీవుఁడెచ్చటి నుండి వచ్చినాఁడు? ఆతఁడిప్పటికేమియును గర్మము నొనర్ప లేదుకదా! అట్టియెడ నాతఁడు కర్మఫలముల ననుభవింప వ్యగ్రుఁడెట్లైనాఁడు? ఆతని కదృష్ట మెట్లేర్పడినది?"

భగవానుఁ డిట్లనెను :- "ఉద్ధవా! ఈ సంసారము ప్రవాహరూపమున నిత్యమైనది. ఈ సృష్టి ఫలానిరోజున నారంభమైనదని చెప్పుటకు వీలులేదు. దీనికాదిలేదు. అనాది. పూర్వకల్పములందలి జీవులయదృష్టముండునుగదా! ప్రళయా నంతరమున సృష్ట్యారంభకాలము సమీపింపఁగనే జీవుఁడు భోగములను భోగించుటకు గాలమును బ్రతీక్షించుచుండును. కాలము సమీపింపఁగానే నాప్రేరణచేఁ బ్రకృతియందు వికృతి కలుగును. ఇంతవఱకును త్రిగుణములు గుణసామ్యమును జెందుటచేఁ నొక్కటియై యుండిన దానియందు విషమత కలుగును. అప్పుడు సత్వరజస్తమములు వేఱగును. నా యిచ్ఛాశక్తి ప్రకృతిలోఁజేరి, దానిలో వికృతినిఁగలిగించును. అనఁగా నా త్రిగుణములనుండి క్రియాశక్తి సంపన్నమగు సూత్ర ముత్పన్నమగును.

ఉద్ధవుఁ డిట్లడిగెను :- "సూత్రమని దేని నందురు స్వామీ!"

భగవానుఁడిట్లనెను:- "బంధించువాఁడు పుట్టించును. ఆ సూత్రముచే జ్ఞానశక్తి ప్రధానమగు నొక మహత్తత్వ ముత్పన్నమయ్యెను."

ఉద్ధవుఁడిట్లడిగెను :- "ఏమిస్వామీ ఇది మహత్తత్వమునకు వేఱైన సూత్రతత్వమా?"

భగవానుఁ డిట్లనెను :- "ఈ యిద్దరును నొక్కరే, జ్ఞానశక్తియును క్రియాశక్తియును గలిసి మహత్తత్వమనఁబడును. కావునఁబ్రకృతియొక్క ప్రథమవికృతిని మహత్తత్వమందురు. ఒకే దారములో పూసలన్నియును గ్రుచ్చఁబడునట్లు సూత్రాత్మ సమస్తతత్వములను నొక్కటిగఁ జేర్చును. అన్నిటికంటెను గొప్ప తత్వమగుటచే దానిని మహత్తత్వమందురు."

ఉద్ధవుఁడిట్లడిగెను:-"స్వామీ ప్రకృతియొక్క ప్రథమ వికృతి మహత్తత్వమేమి? ఈ వికార యుక్తమగు మహత్తత్వముచే నేమి యుత్పన్నమైనది?"

భగవానుఁ డిట్లనెను:-"దానిలోనుండి అహంకారము పుట్టెను."

ఉద్ధవుఁ డిట్లడిగెను :-"అహంకారముయొక్క పని యేమి?"

భగవానుఁ డిట్లనెను :- "అహంకారము యొక్క కార్యము జీవుని మోహమునఁ బడవైచుటయే. దేహాదులందహంభావము లేనంతవఱకు మోహముండఁజాలదు. అహంకారమే సమస్తభేదభావములకును జనకుఁడు. అది మూఁడు విధములయ్యెను. సాత్వికాహంకారము, రాజసాహంకా

రము, తామసాహంకారము ఈ మూఁటిచేతనే ఈతఁడు సృష్టి నొనర్చినాఁడు."

ఉద్ధవుఁడిట్లడిగెను:-:-"ఏ యహంకారముచే నేవస్తువు పుట్టినది?"

భగవానుఁడిట్లనెను:- సాత్త్వికాహంకారముచే దశేంద్రియములును, పదునొకండవదగు మనస్సును, పదునొకండధిష్ఠాతృదేవతలును బుట్టెను. వారిపేరులు వాయువు, సూర్యుఁడు, వరుణుఁడు, అశ్వినీ కుమారులు, ఇంద్రుఁడు, విష్ణువు, ప్రజాపతి, నైరృతి, అగ్ని, చంద్రులు, రాజసాహంకారముచే దశేంద్రియములును, తామసాహంకారముచేఁ బంచ తన్మాత్రలును, వానివలనఁ బంచ భూతములును బుట్టెను."

ఉద్ధవుఁడిట్లడిగెను:- "ఈ యహంకారము జడమా? చైతన్యమా?"

భగవానుఁడిట్లనెను:- "చైతన్యాభాస యుండుటచే దీనియందు చేతనతయును గలదు. ఇది జడమే. అందువలన దీనినిఁ జడచిత్తందురు. అనఁగా జడచేతనమందురు. కేవలము జడమునుగాదు, శుద్ధచైతన్యమును గాదు. అటునిటు కాకుండనున్నది."

ఉద్ధవుఁడిట్లడిగెను:- ఇవన్నియును బుట్టి చేసిన దేమున్నది?"

భగవానుఁడిట్లనెను :-"ఇవన్నియును వేఱు వేఱుగ నున్నవి. సూత్రములు వేఱు వేఱుగ నున్నంతవఱకు అవేమియును జేయఁజాలవు. మేఁక దానినిఁ గొఱికి వేయఁగలదు. అనేక సూత్రములు చేరిన దానిని మత్తగజమైనను మఱేమియును జేయఁజాలదు. దానిని గట్టవచ్చును. వానికి మహత్తరమగు శక్తివచ్చును; కాని వానినిఁ జేనుటకు శక్తిశాలియగు వాఁడు కావలయును. కావున నాచేఁ బ్రేరేపింపఁబడి యుద్భవించిన జగత్కారణ తత్వము లన్నియును గలిసి నాకాశ్రయరూపమగు నొక అండమును నిర్మించెను. ఈ యండము జీవన రూపమగు జలములో నుండఁగా నే నీ యండమున నుంటిని. నేనీ జగత్తుయొక్క సమిష్టిరూపమగు నండమందు బ్రవేశింపఁగానే నా నాభి నుండి ఒక కమలముత్పన్నమయ్యెను. కమలమననేమి? అది సమస్త చరాచర విశ్వమే. ఆ కమలమున నాలుగు ముఖములు గల దేవత కూర్చుండి యుండెను. ఆతఁడు తనకుఁ దానే పుట్టెను. అందువలన నాతనికి 'స్వయంభూ' అను పేరు వచ్చెను. జన్మింపలేదు కావున అజుఁడనఁబడెను. విశ్వవ్యాప్తుడగుటచే బ్రహ్మయను పేరుకూడ వచ్చెను."

ఉద్ధవుఁడిట్లడిగెను :-"స్వామీ! ఆ చతుర్ముఖ బ్రహ్మ యేమి చేసినాఁడు?"

భగవానుఁడిట్లనెను :-"ఆతడు నా ప్రేరణచేఁ దప మొనరించెను. అంత నాయనుగ్రహముచే రజోగుణము ద్వారా లోకపాలురతో గూడ యీ త్రిభువనములను రచించెను. వానిని భూః, భువః, స్వః అనఁగా భూమి అంతరిక్షము, స్వర్గమందురు. ఆ యండము మధ్యకు రెండయ్యెను. క్రింద భాగముచేఁ బృథివీయయ్యెను. దానిలోఁ పైభాగముచే స్వర్గాది లోకములయ్యెను. మధ్యలో నవకాశముమిగిలెను. దానివలన భువర్లోక మేర్పడెను. పృథివిపై మానవులు నివసించు చుండిరి. భువర్లోకమునందు వాయువునే ఆధారముగఁ గల భూత, ప్రేత, పిశాచాదులు నివసించు చుందురు. స్వర్గమందు దేవతాగణమును, స్వర్గమునకు పైన మహర్లోకమునందు సిద్ధ మహర్షి గణమును, జనలోకమునందు ఊర్ధ్వరేతస్కులగు బ్రహ్మచారి గణమును, తపోలోకమందు తపస్వులును, వానప్రస్థులును, సత్యలోకమునందు మహాపుణ్యాత్ములును, జ్ఞానులును నివసించు చుందురు. పృథివికి క్రింద నతల, వితల, సుతలాది వివరములందు నాగ, అసురాదులు నివసించు చుందురు. స్వర్గాదిలోకములకు శుభకర్మ లొనర్చు మహాపురుషులు పోవుదురు. త్రివర్గాదులను సవిధిగ ననుష్టించినవారు స్వర్గలోకమునకుఁ బోవుదురు. గార్హస్థ్యధర్మమును సవిధిగ నాచరించువారు మహర్షిగణమును, అవసరము ప్రాప్తించినపుడు ఇంద్రుడు మనువు

మొదలగు నధికారులు మహర్లోకమునకుఁ బోవుదురు. యోగసాధన మొనర్చు భగవంతుని జనులును, ఊర్ధ్వరేత స్కులగు బ్రహ్మచారులును, జనలోకమునకుఁబోయి యోగా భ్యాస మొనర్చెదరు. నిరంతరము తపోనిరతులగు వనవాసు లును, వానప్రస్థులును దపోలోకమునకుఁబోయి తమ తప స్సును బూర్తిచేసికొందురు. సన్న్యాస్య ధర్మాచరణ మొనర్చు జ్ఞానులు సత్యలోకమునకు అనఁగా బ్రహ్మలోకమునకుఁ బోవుదురు.''

ఉద్ధవుఁడిట్లడిగెను :-''స్వామీ! ధర్మానుష్ఠానము, కర్మయోగము, అష్టాంగయోగము, తపస్సు, సన్న్యాసముచే లభించు లోకములను మీరు వర్ణించితిరి. కాని ఒక్కమిమ్మే అనన్యభావముతో నుపాసించు నీ భక్తులేప్రగతినిఁ బొందె దరు? వారికేలోకము ప్రాప్తించును?''

భగవానుఁడిట్లనెను :-''ఉద్ధవా! ఇదియును నడుగ వలసిన విషయమేనా? లోకములయొక్క ప్రాప్తి వారివారి భావనాను సారముగ లభించును. తపమునందు జిత్తమును లగ్నమొనర్చినవారు తపోలోకమునకు బోవుదురు. ఎవరు సన్న్యాసరూపమగు సత్యమునే అనుష్ఠించెదరో, వారికి సత్య లోకము ప్రాప్తించెదరు. అనన్యభావముతో నాయుపాసన మొనర్చుచు భక్తియోగముద్వారా నన్నారాధించు చుండు

వారు నాపరమధామమును బొందెదరు. నా భక్తులు నన్నే పొందెదరు.''

ఉద్ధవుఁడిట్లడిగెను :-''స్వామీ! ఈ ప్రాణులు నీ చరణార విందములును బరిత్యజించి, యీ అసార సంసార సాగరమందటు నిటు వ్యర్థముగ నేల గొట్టుకొనుచుందురు?''

భగవానుఁడు నవ్వుచు నిట్లనెను :- ''ఉద్ధవా! ఇదంతయును నాప్రేరణ చేతనే జరుగుచున్నది. కాలమును నాయొక్క-స్వరూపమే. 'కాలయతీతి కాలః' అనఁగా నన్నిటిని లెక్కించునది కాలము. కాలరూపమున నేనే జగత్తును గర్మములందు బ్రవృత్తి కలుగఁజేయుచుందును. కర్మ కలాపములందు బడియుండు ప్రాణి సత్వ, రజ, స్తమములను నీ త్రిగుణ ప్రవాహమందొక్కొ-క్కప్పుడు మునుఁగుచుఁదేలుచుండును. అనఁగా నొక్కొక్క-ప్పుడొక యోనియందును ఇంకొకపుడింకొక యోనిలోనికినిఁబోవును. శుభ కర్మలొనర్చినచో దేవతాది యోనులకును, పాపకర్మలొనర్చినచోఁ బశు, పక్షి, కీట, పతంగ, నారకీయ యోనుల లోనికిని బోవును. ఇదే విధముగ నీ గుణ ప్రవాహము కాలాత్ముఁడనగు నా ప్రేరణముచే నడుచుచునే యుండును. ఈ జగత్తంతయును బ్రకృతి పురుష సంయోగముచే నేర్పడినది. అతి సూక్ష్మ పదార్థములగు బరమాణువులును, అత్యంత గొప్పదగు మహత్తత్వమును, అతి సన్నని పదార్థ

మగు నాకాశమును, అతి స్థూల పదార్థమగు బృథివియును, పర్వతాది సమస్త ప్రకృతియును బ్రకృతిపురుష సంయోగము చేతనే యేర్పడినవి. ఈ రెండును గలియక యేదియును బుట్టుట సంభవింపదు. కాని నీవు చూచు నీ ప్రపంచమంత యును సత్యము కాదు.''

ఉద్ధవుఁడిట్లడిగెను:- ''అయితే సత్యమేది స్వామీ?''

భగవానుఁ డిట్లనెను :- ''ఈ అన్నిటిలో సత్యము కేవలము శుద్ధ బ్రహ్మరూపుఁడనగు నేనే.''

ఉద్ధవుఁ డిట్లడిగెను:-''స్వామీ! కాలరూపమున నేను బ్రేరేపించుచున్నాననియుఁ బ్రకృతి పురుష సంయోగము చే నిదియంతయును జరుగుచున్నదనియు మీరు చెప్పుచున్నారు. మీరు పురుషుఁడైనపుడు కాలమును బ్రకృతియును సత్యము కావలయును.''

భగవానుఁడు గంభీరముగ నిట్లనెను :- ''ఈ విషయ మును గూర్చి నీవు బాగుగా విచారింపుము. ఒక సిద్ధాం తము కలదు. అదేదనఁగా నే పదార్థ మాద్యంతములలోను నుండునో అదియే సత్యము. మధ్యలోను నదియే యుండును. అట్లుకాక నానా నామరూపములతో మధ్యలోఁ బ్రసిద్ధమైన దంతయును మిథ్యయే. పంచదార యేనుఁగు, ఒంటె, గుఱ్ఱము మొదలగు నాటవస్తువులైనవి. మరల వానిని నలుగఁగొట్టి చక్కెరగ నొనర్పుము. ఇప్పుడు విచారించి

నచో మొదటను జక్కెర యే కలదు. చివరకును జక్కెరయే మిగిలినది. మధ్యలో వచ్చిన నేనుఁగు గుఱ్ఱము మొదలగు భిన్నభిన్న ఆకృతు లేర్పడినవి. వానికి భిన్నభిన్న నామములును నేర్పడినవి. నామరూపము లేర్పడినపుడును జక్కెర యెచ్చటకును బోలేదు. చక్కెరయొక్క సత్తా అప్పుడును గలదు. మధ్యలో వచ్చిన నామరూపములన్నియును మిథ్యలు. ఒక్క చక్కెరమాత్రము సత్యము. ఇదేవిధముగ నన్నిటి లోను విచారించుము. ఆది యందు సువర్ణముకలదు. దానిచేఁ గటక కంకణాది ఆభరణము లేర్పడినవి. ఇప్పుడు దాని నందఱును సువర్ణమని పిలువక కంటె, గాజు, గొలుసు, వడ్డాణము, వంకె, కుండలమని పిలుచుచున్నారు. వాని నన్నిటినిఁ గరిగించినచోఁ గేవలము సువర్ణము మాత్రము మిగులును. అవి యున్నపుడును సువర్ణముయొక్క సత్తా లేకపోలేదు. అప్పుడును గలదు. దీనినిఁబట్టి త్రికాలములందును నుండు సువర్ణము సత్యము. దాని వలన నేర్పడిన కంకణ కుండలాది నామరూపములు మిథ్యలు. మూఁడవ ఉదాహరణమును గైకొనుము.

ప్రథమమున మృత్తికయే కలదు. దానిచేఁ గుండ, చట్టి, మూఁకుడు మొదలగు మట్టి పాత్ర లేర్పడినవి. పాత్రలు పగిలిపోయిన మృత్తికయే మిగిలెను. కుండ, చట్టి, మూఁకుడు మొదలైన లేర్పడినపుడు మృత్తిక యెచ్చటికినిఁ బోలేదు

మృత్తిక యథాప్రకారముగనే యున్నది. మృత్తిక త్రికాల ములయందును విద్యమానమైయున్నది. దీనివలన నొక్క మృత్తికయే సత్యమని ఋజువైనది. దాని వికారము లన్నియును మిథ్యలే. అవి కేవలము వ్యవహార నిమిత్తమై యున్నది. వాని యొక్క సత్తా క్షణికమును, వ్యావహారికమునై యున్నది. నాటక పాత్రవలెనే యున్నది. నాటక మాడుటకు ముందును నాతఁడు దేవదత్తుఁడే. నాటకము పూర్తి అయిన తరువాతను నాతఁడు దేవదత్తుఁడుగనే యుండెను. మధ్యలో నేర్పడిన రాణి, దాసిగా నేర్పడినది. వ్యవహారముకొఱకే ఆ సమయమునను నాతఁడు దేవదత్తుఁడు కాకపోలేదు. కాని నాటకమునందు దమయంతి, తిలోత్తమాది పేర్లతో నుండెను. ఆ నామములతో నాతఁడు పిలువఁబడుచుండినను ఆతని ఆ నామరూపములు మిథ్యలే. నాటకమును జరుపుటకు వ్యవహరింపఁబడెను. అప్పుడును బాగుగాఁ దెలిసినవారు ఆతఁడు దేవదత్తుఁడేనని తెలిసికొందురు.

ఉద్ధవుఁడిట్లడిగెను :-"స్వామీ! మధ్యలో వచ్చిన నామరూపములును గలవు. వానిని మనము సత్యములని యేల భావింపఁగూడదు?"

భగవానుఁడిట్లనెను :-"ఇట్టి దానిని నీవెట్లు సత్యమనఁగలవు. సత్యముయొక్క పరిభాషయిది-త్రికాలము

లందును నేకరసమున నుండవలయును. నీమట్టి మట్టిగుంటలో నుండి త్రవ్వుకొని వచ్చెదరు. దానిని ముద్దగఁ జేయుదురు. సారెమీఁదఁ బెట్టెదరు. కఱ్ఱతో దానిని త్రిప్పెదరు. కుండను జేయుదురు. కుండ దానికార్యము. సారె, దారము, కఱ్ఱలు నిమిత్తకారణములు. మృత్తిక ఉపాధాన కారణము. కుండ కాఁగానే కుండయును సారెకు వేఱయ్యెను. కఱ్ఱయును వేఱయ్యెను. దారమును వేఱయ్యెను. నీరును నాటిపోయెను. కాని కుండకు ఉపాదానకారణమగు మృత్తిక కుండగానై యున్న తరువాతనైనను మృత్తికగనే యున్నది. కుండ పగిలి పోయెను. కుండయను పేరును నశించెను. ఇప్పుడు దాని నెవరును గుండయని యనరు. కాని మృత్తిక వదలిపెట్టలేదు. చివరకు దానిలో మృత్తికయే మిగిలినది. మృత్తిక మరల మృత్తిక యగువఱకును ననేక నామరూపములను ధరించెను. కాని దాని మృత్తికత్వమును వదలలేదు. కావున మృత్తికయే సత్యము. మిగిలిన వన్నియును మిథ్యలే. ఏలననఁగా—పరమోపాదానాశ్రయముచే నేదైన గార్యరూప భావమును మొదటి ఉపాదానకారణ ముత్పన్న మొనర్చినచో, ఏది ఆద్యంతములలో నుండునో, దానిని సత్యమందురు. మిగిలిన వన్నియును మిథ్యము.''

ఉద్ధవుఁడిట్లడిగెను:-''ఈ కార్యరూపమగుసంసారమున కుపాదాన కారణమేది ?''

భగవానుఁడిట్లనెను :-"ఈదృశ్య ప్రపంచమున కుపాదాన కారణము ప్రకృతి. కుండయొక్క ఉపాదాన కారణము మట్టిముద్ద. ఆముద్దకు పరమకారణము మట్టిగొయ్యి. అచ్చట నుండియే కదా మృత్తికను దెచ్చినది. ఇదే విధముగనే ప్రకృతికిని నధిష్ఠానము పరమాత్మయే. మట్టిముద్దలోనికి కుండ నెచ్చటి నుండియును దెచ్చిపెట్టలేదు. దీనినిఁ గుంభాకారుఁడు ప్రకట మొనర్చెను. ఇదే విధముగఁ బ్రకృతిలో నీప్రపంచము మొదటినుండియును యుండనే యుండినది. దానిని నాయంశరూపమగు గాలము ప్రకట మొనర్చెను. కాలమీ జగత్తునకు గర్త కాదు, కేవలమభివ్యంజకమైనదే. ప్రకృతి పురుష, కాలములే జగత్కారణమైనవి. ఈమూఁడింటికిని ఉపాదానకారణము శుద్ధ బ్రహ్మస్వరూపుఁడనగు నేనే. కావున జగత్తు మిథ్య. శుద్ధ బ్రహ్మనగు నేను మాత్రమే సత్యము."

ఉద్ధవుఁడిట్లడిగెను :-'స్వామీ! ఈదృశ్య జగత్తంతయును మిథ్యయైనపుడిది అనాదియని యేల అనుచున్నారు?'

భగవానుఁడిట్లనెను:-'ప్రవాహరూపమున నిది అనాది ఉత్పన్నమైన సంసారమున్నంత వఱకును, ఇది ప్రళయము కానంతవఱకును, దీనివైపు పరమాత్మ చూచుచున్నంత వఱకును నిది నిరంతరమును జరుగుచునే యుండును. తండ్రి కుమారునిఁ బుట్టించెను. అతఁడొక పుత్రునిగనెను. ఇప్పుడా

డాతఁడు తండ్రియయ్యెను. అంత నాతని పుత్రుఁడును దండ్రియయ్యెను. పరంపరగా నిది అనంతకాలము నుండి యును వచ్చుచున్నది. అనంతకాలము వఱకును జరుగును.'

ఉద్ధవుఁడిట్లడిగెను :–' ఇట్లు తండ్రి కొడుకుల యొక్క వంశపరంపర యెట్లు జరుగఁగలదు.'

భగవానుఁడిట్లనెను :–'జీవుఁడు చేసిన కర్మములను భోగించుటకే యీ పరంపర కర్మలు నడుచుచున్నవి. కాలము రాఁగానే ప్రళయము వచ్చును. తత్వములన్ని యును దమకారణమున విలీనము లగును. ఈ సప్తలోకముల యొక్క నామరూపము లేమియు నుండవు. జగత్తునందలి పంచభూతములు తమ తమ జనకులలోఁ గలసిపోవును.'

ఉద్ధవుఁ డిట్లడిగెను :– "స్వామీ! మీరు ఉత్పత్తి క్రమమును గూర్చి చెప్పితిరి. ఇప్పుడు దయతోఁ బ్రళయ మును గూర్చి చెప్పవలయును. ప్రళయ మే విధముగ నగును. తత్వము లన్నియును దమ తమ కారణములలో నెట్లు విలీ నము లగును ? చివర కేమి మిగులును ?"

ఇది విని భగవానుఁ డిట్లనెను :– "ఉద్ధవా! ఆద్యం తములలో నేది యుండునో అది మధ్యలోనుండుననియు, నదియే సత్యమనియు నే నిదివఱలోఁ జెప్పియుంటిని. ఆదిలో నే నొక్కఁడనే యుంటిని. నావలననే ప్రకృతి పురుషు లుద్భవించిరి. ప్రళయమునం దన్నియును వచ్చి నాలోనే

విలీనమగును. ఈ విలీన మెట్లు జరుగునో దానిని నీకు నేను జెప్పెదను.”

సూతుఁ డిట్లనెను :- “మునులారా! ఇప్పుడు భగవానుఁ డుద్ధవునితోఁ బ్రళయక్రమమునుగూర్చి చెప్పెనో ఆప్రసంగమును నేను రాఁబోవు అధ్యాయమునఁ జెప్పెదను.”

---

## సాంఖ్య విధిని ప్రలయము.

శ్లో॥ ఏష సాంఖ్య విధిః ప్రోక్తః సంశయ గ్రంథి భేదనః।
ప్రతిలోమాను లోమాభ్యాం పరావర దృశా మయా॥

—శ్రీభాగ. ౧౧ స్కం. ౨౪ అ. ౨౮ శ్లో॥

వ. “ఉద్ధవా! నేను నీకు అనులోమ, ప్రతిలోమ క్రమమున సాంఖ్య విధిని గూర్చి చెప్పితిని. అది సంశయ రూప హృదయ గ్రంధిని విడదీయును. నేను స్వయం కార్యకారణములకు సాక్షిని.”

—శ్రీమదాంధ్ర భాగవతము.

ప్రకృతి నియమ మేమనఁగా నేది దేనిలోనుండి ఉత్పన్నమగునో, చివరకది దానిలోనే లీనమగును. కుండ మట్టితోఁ జేయఁబడును, చివరకు మట్టిలోనే కలిసిపోవును. దేహము పంచభూతములచే నుత్పన్నమగును. చివరకు పంచభూతములోనే కలిసిపోవును. వృక్షము బీజమునుండి

ఉత్పన్నమగును. చివరకు బీజమే మిగులును. ఆభరణములు సువర్ణముచే నేర్పడును. చివరకు దానిలోనే లీనమగును. దేని కేది కారణమగునో కార్యమును దానిలోనికే చేరును. తాను దేనికిని గారణము కాక, అన్నిటికిని నదియే కారణ మగునో, చివర కన్నియును దానిలోనికిఁ జేరిపోవును. అందు వలన భగవంతుని 'అభిన్ననిమిత్తో'పాదానకారణమందురు. తన్ను దీసికొని కార్య మొనర్చు దానికి ఉపాదానకారణ మందురు. ఆ కార్యమునకు సహాయ మొనర్చుదానికి నిమిత్త కారణమందురు. ఘటమున కుపాదానకారణము మృత్తిక. మృత్తికచేతనే కుండ యేర్పడును. మట్టిలోఁ గుండ వ్యాపించి యున్నది. కాని స్వయముగ మృత్తిక కుండగా నేర్పడదు. అది అట్లగుటకు ఉపకరణము కావల యును. దానినిఁ జేయు కుమ్మరి కావలయును. చక్రము కావలెను. దారము కావలెను. దండము కావలెను. ఇంక ననేక వస్తువులు కావలయును. ఇవన్నియును నిమిత్తకారణ ములు. మట్టి లేకుండిన నివి యన్నియునున్నను గుండఁ గాఁజాలదు. మట్టి యెంతయుండినను దానిని జేయువాఁడును, చేయు సామగ్రియు లేకుండిన నంత వఱకు కుండ కాఁజాలదు. కావున నుపాదాన కారణమును, నిమిత్త కారణమును ఈ రెండును నుండవలయును. కాని భగవానుని కొఱకు ఇట్లవసరము లేదు. ఈ ప్రపంచమున కాతఁడే ఉపాదాన

కారణము. ఆతఁడే నిమిత్తకారణమును. ఆతఁడు బాహ్యోపకరణము లేమియును లేకుండినను నీజగత్తును నిర్మింపఁగలఁడు. ఆతఁడే ఎవరి సహాయము లేకయే ఉపసంహరింపఁ గలఁడు, రక్షింపఁగలఁడు. పల్లెవానికి వల నల్లుటకు దారము, త్రాడు మొదలగు నుపకరణము లవసరములగును. ఇవి లేక ఆతఁడు వల నల్లఁజాలఁడు. సాలీఁడుకొఱకు వల నల్లుటకు బాహ్యోపకరణము లేవియును నవసరముండదు. అది తనకుదానే నోటనుండి దారమునుదీసి, ఆదారమునుండి వల నల్లును. ఎంతకాలమువఱకు దానికిష్టముండునో, అది అంతకాలము దానిలో విహరించును. ఎప్పుడు దానినుపసంహరింపఁ దలఁచునో, అది తనపొట్టలోనికి లాగుకొని ముసుఁగు కప్పుకొని పరుండియుండును. అచ్చట నా వల ఉపదానకారణమును, నిమిత్తకారణమును నై యున్నది. ఇదేవిధముగ నీ జగత్తంతయును హరిచే నుత్పన్నమైనది. హరియే జగత్తు, జగత్తే హరి. ఆతనికిచ్ఛకలికినపుడు తానే బ్రహ్మయై సృష్టిచేయును, విష్ణువై తానే తానుజేసిన సృష్టినిఁ బాలించును. చివరకు రుద్రుఁడై సంహారమొనర్చి పరుండి నిద్రించును. సృష్టి ప్రలయముకొఱకే. ప్రళయము సృష్టికొఱకే. సూర్యుఁడుదయించుట అస్తమించుటకే. అస్తమించుట ఉదయించుటకే. ఎవనికి సృష్టి,స్థితి, లయములయొక్క యిట్టి జ్ఞానముండునో, ఆతఁడెట్టి ఘటనమువలనను మోహమును జెందఁడు.'

సూతుఁడిట్లనెను:- "మునులారా! ఉద్ధవుఁడు భగవానుని ప్రళయమునకు సంబంధించిన ప్రశ్న నడుగగా భగవానుఁడిట్లనెను:- "ఉద్ధవా! ఈ ప్రపంచము ఉత్పత్తి స్థితి, లయశీలమైనది. మాటిమాటికిని ఉద్భవించును. మాటి మాటికిని విలీనమగును. పుట్టినది గిట్టితీరును. నాశనమైనది పుట్టితీరును. ఈ దృశ్య ప్రపంచము విరాడ్రూపమున నున్నది. ఇది యెట్లు ఉత్పత్తియగునో, అట్లే యిదివశించును. స్థూల వస్తువు సూక్ష్మమున విలీనమగుచుండును."

ఉద్ధవుఁడిట్లడిగెను:-'స్వామీ ఈ ప్రపంచమున నన్నిటి కంటె స్థూలవస్తువేది?'

భగవానుఁడిట్లనెను:- 'అన్నిటి కంటె స్థూలవస్తువు దేహము. అన్నిటికంటె సూక్ష్మమును సర్వవ్యాపకము నగు వస్తువు ఆత్మ. ఆత్మవలననే యిది యంతయును నుత్పన్న మైనది. ఆత్మలోనే యీ సమస్తమును నుపసంహారము జరుగును.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'దేహమని దేని నందురు స్వామీ?'

భగవానుఁడిట్లనెను:- దేనియందు దేహియుండునో, అదియే దేహము. పర్వత దేహము, వృక్ష దేహము, ఏనుఁగు యొక్క దేహము, మానవ దేహము, చీమ మొదలగు వాని దేహములు. దేహములన్నియును నన్నము చేతనే ఉత్పన్న మగును.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- స్వామీ! అన్నమన నేమి?'

భగవానుఁడిట్లనెను:- 'అత్తతి అన్న' ఏదితినఁబడునో అదియే అన్నము. ప్రపంచమునఁ దినఁబడని వస్తువేదియును లేదు. ఎవరికైనను నాహారము కానిదేదియును లేదు. అన్నమనఁగా ఓషధియుగూడ అగును. కావున వైద్యశాస్త్రజ్ఞు లిట్లందురు :- 'ప్రపంచమున నోషధికాని వస్తువేదియును లేదు. గోవునకన్నము గడ్డి. కూకర, సూకరములకు అన్నము విష్ఠ. పెద్దచేపల కన్నము చిన్న చేపలు. అన్నము వలన దేహములుపుట్టును. దేహము కార్యము. అన్నము కారణము. ప్రళయకాలమున దేహరూపమగు కార్యము తనకు గారణమగు నన్నమున విలీనమును జెందును. ప్రళయకాలమున వర్షము కుఱియుటచే దేహముండదు. కేవల మన్న శేషముండును.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'స్వామీ! అన్నము దేనివలనఁ బుట్టును?'

భగవానుఁడిట్లనెను:-'అన్నము బీజముచే నుత్పన్నము కాఁగలదు. బీజము లేకుండిన నన్నముత్పన్నము కాదు.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'అన్నమునకును బీజమునకును నేమిభేదముకలదు. మేము అన్నమునే బీజముగ భావించుచున్నాము. గోధుమ, యవాదులవలె నన్నము బీజములే, గింజలే. వానిని నాటుటచే వేఱుబీజము లుత్పన్న మగును

అన్నమే బీజమగుచో బియ్యమును నాటినచో నంకుర మేల పుట్టదు. దానిపై పొట్టును వేఱుచేసిన దానిలో నన్న ముండును. దానియొక్క బీజత్వము నశించును. గోధుమ, శనగలు మొదలగునవి దంపినచో నన్నము మిగులును. కాని దానియొక్క బీజత్వము నిర్బలమగును. కావున బీజమునకు దేహమన్నము, అన్నములో బీజముండును.''

ఉద్ధవుండిట్లడిగెను:- ''బీజము దేనిచేఁ బుట్టును?''

భగవానుండిట్లనెను:- ''బీజము భూమిచేఁ బుట్టును. భూమి లేకుండినచో బీజోత్పత్తియే యుండదు, భూమి సమస్త బీజముల నుత్పన్న మొనర్చును.సమయము రాఁగానే సమస్త బీజములను దనలో దాచుకొనును. పృథుమహారాజు పృథివినిఁ గసరి తనలో దాచుకొనిన బీజములను బయటకు లాగెను. ఏలననఁగా నప్పుడు ప్రళయము కాదు. ప్రళయ సమయమైనపుడు భూమి తన గంధగుణమున విలీనమగును. గంధము జలముచే బుట్టును. గంధమునుండి పృథివి ఉత్పన్న మగును. పృథివియొక్క తన్మాత్ర గంధము. అందువలనఁ బృథివిని గంధవతియనియందురు. పృథివి గుణవతి. గంధము దాని గుణము. పృథివి గంధమును వదలి వేసినచో నది గంధములోఁ గలిసిపోవును. పృథివి లేక గంధముండదు. అది తనకు గారణమగు జలమున విలీనమగును.

ఉద్ధవుండిట్లడిగెను:- ''జలముయొక్క గుణమేది?''

భగవానుఁడిట్లనెను:- "జలము యొక్క గుణము రసము. జలము రసములో లీనమైనపుడు, జలము లేక రసముండనేయుండదు. సూర్యుఁడు లేక ప్రభ యెట్లుండదో, రసము దానికి కారణమగు తేజమునందు గలిసిపోవును. తేజమును దనకు గారణమగు రూపమునఁ గలిసిపోవును. తేజము లేకుండిన రూపమెక్కడిది? చీఁకటిలో నేమియును రూపము కనఁబడదు. రూపము తేజము లేక యుండదు. కావున నది తన తండ్రియగు వాయువునందు దాగును. వాయువుయొక్క గుణము స్పర్శ. వాయువు స్పర్శలో విలీనమగును. వాయువు లేక స్పర్శయుండనే యుండదు. కావున స్పర్శ ఆకాశమందు విలీనమగును. శబ్దము దేహి. ఆకాశము దేహము. మొట్టమొదట శబ్దము పుట్టెను. దానినుండి ఆకాశముద్భవించెను. శబ్దము ఆకాశము లేక యెట్లుండఁ గలదు? ఆకాశము తనకు దన్మాత్రయగు శబ్దమందు విలీనము కాఁగా శబ్ద తన్మాత్ర పంచభూతములయొక్క జనకుఁడగు దామసాహంకారమున లీనమగును."

ఉద్ధవుఁడిట్లడిగెను:- "స్వామీ! ఇంద్రియము లేవైనవి?"

నవ్వి భగవానుఁడిట్లనెను:- 'ఇంద్రియములకు వాయు జలాన్నములు లేకుండినఁ బ్రాణములకేగతి పట్టునో ఆ గతి పట్టెను. ఇంద్రియములకు విషయములు ప్రాప్తించకుండినచో

నవి యేమి చేయఁగలవు? మీనమునకు నివసించుటకు జలము లేకుండినచో నది చచ్చిపోవును. ఇంద్రియములకు విషయము లగు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు నశించినఁ బంచ భూతములుండవు. అప్పుడింద్రియములు తమకు గారణభూత మగు రాజసాహంకారమున లీనమగును.'

ఉద్ధవుఁడిట్లడిగెను:– 'అప్పుడింద్రియముల కధిష్ఠాన మగు దేవతలును, మనస్సును నెచ్చట నుండును?'

భగవానుఁడిట్లనెను:– 'ఓయీ! గృహము నశించిన నెచ్చట నుండఁగలఁడు? ఇంద్రియములు లేకుండిన వాని కధిష్ఠాతృ దేవతలును, వానికి ప్రేరకమగు మనస్సును తన పితయగు సాత్వికాహంకారమున లీనమగును. ఇప్పుడు మిగిలినవి త్రివిధాహంకారములు. అన్నియును దమ తమ జనకుల అంకమున లీనముకాఁగా నేనొంటరిగానుండి చేయున దేమున్నదనుకొనెను. ఇట్లాలోచించి సమస్త జగత్తును మోహింపఁజేయు నహంకారము తనకుఁ గారణమగు మహా త్తత్వమునందు లీనమయ్యెను. మహాత్తత్వమునందు జ్ఞాన శక్తియును, క్రియాశక్తియును గలిసియుండెను. క్రియాశక్తి ప్రధాన సూత్రాత్మ, జ్ఞానశక్తి ప్రధానమగు మహాత్తు, తన జ్ఞాన, క్రియా శక్తులతోఁగూడుకొనిన నామహాత్తత్వము తనకు కారణభూతమగు త్రిగుణములందు లీనమయ్యెను. త్రిగుణములు తమకు మాతయగు ప్రకృతివడిలో సమాన

రూపమున నుండెను. కాలముఁ రాఁగానె ప్రకృతి తన అవ్యయ కాలమునందు విలీనమయ్యెను. దానిలో క్షోభము కలుగఁగానే అది ప్రసవోన్ముఖి యయ్యెను.

ఉద్ధవుఁ డిట్లడిగెను :- 'స్వామీ! కాలము యొక్క పర్యవసాన మెవరిలోనైనది?'

భగవానుఁ డిట్లనెను :- 'కాలము జీవునిలో లీనమయ్యెను. జీవుఁ డాత్మలో లీనమయ్యెను.'

ఉద్ధవుఁ డిట్లడిగెను :- 'జీవునకును నాత్మకును భేదమే మున్నది?'

భగవానుఁ డిట్లనెను :- 'అంతర మేమున్నది. అంశాంశీ భేదమే కలదు. పరమాత్మ అంశి, జీవాత్మ అంశ. పరమాత్మ మాయారహితుఁడు. జీవుఁడు మాయామయుఁడు. జీవుఁడు గుణసంసర్గముచే బద్ధుఁడైనట్లున్నాఁడు. పరమాత్మ అజ, అవ్యయ, ఏకరస స్వరూపుఁడు. జీవునకు బరమాత్మ ఆశ్రయుఁడు. పరమాత్మకే ఆశ్రయమును లేదు. జీవుఁ డాత్మలో లీనమగును. పరమాత్మకి యెవరిలోను లయ ముండదు. ఆతఁడు సంసారము యొక్క సృష్టి స్థితి లయముల కధిష్ఠానము. ఆతనికి మించిన జ్యేష్ఠుఁడుగాని, శ్రేష్ఠుఁడు గాని లేఁడు. ఆతనికి సమానుఁడును లేఁడు. ఆతఁడే పరాకాష్ఠ. ఆతఁడే పరాగతి. ఆతఁడే అన్నిటి కైకైక అంతిమ అవధి. ఆ పరమాత్మను నేనే. నావలననే అన్నియును బుట్టి

నవి. నాయందే సమస్తమును బర్యవసించినవి. జగత్తులో సర్వత్ర నేనే వ్యాపించియున్నాను. నేను గాక అన్యపదార్థ మేమియును లేదు.'

ఉద్ధవుఁ డిట్లడిగెను :- 'స్వామీ ! ఈ నానారూపముల భాసించు సంసారమును గాంచిన భ్రమ యేల కలుగుచున్నది ?'

భగవానుఁ డిట్లనెను :- 'భ్రమ అజ్ఞానముచేఁ గలుగును. జీవుఁ డసత్తును సత్తుగా భావించినపుడు, అనిత్యమందు నిత్యత్వ బుద్ధినిఁ బెట్టినపు డాతఁడు మాయామోహితుఁడై భ్రమలోఁబడిపోవును. జ్ఞానమునుమరచి దుఃఖములను గొని తెచ్చుకొనును. ఎవనికి గురు కృపచేతను,సత్సంగముచేతను, నీ జ్ఞానము కలిగినపుడు ప్రపంచమునం దెచ్చటనైనను బరమాత్మనగు నేనే సత్తుఁడనని తెలిసిన నీ మిథ్యాప్రపంచమున భ్రమ యెట్లు కలుగఁ గలదు ?'

ఉద్ధవుఁ డిట్లడిగెను :- 'స్వామీ! ఈ సంసారము వలన గొప్ప గొప్ప జ్ఞానులకును మోహము కలుగును.'

భగవానుఁ డిట్లనెను :-''నాయనా ! జ్ఞానుల కెన్నటికిని మోహము కలుగదు. నామోహినీమాయయొక్క ప్రాబల్యమువలన నొక్కొక్కప్పుడు జ్ఞానులకును నీ సంసారస్ఫూర్తి కలుగును గాని అది చిరకాలము వఱకు నిలువదు. శంకరునకును నామోహినీరూపమును జూడగానే కొంతసేపు

మోహము కలిగెను. కాని వారికి స్మృతి కలిగినపుడు వారు వెంటనే తమ నిష్ఠలోనికిఁ బోవుదురు. సూర్యు డెట్లప్పు డప్పుడు మేఘములచేఁ గప్పఁబడి, అవి తొలఁగఁగానే మరలఁ బ్రకాశించినట్లు, సూర్యుని ప్రకాశము వచ్చిన తరువాత నింక అంధకార మెట్లుండఁగలదు ?''

భగవానుఁ డిట్లనెను :- 'ఉద్ధవా! నీకు నేను సృష్టిని గూర్చియుఁ బ్రళయ వృత్తాంతమును జెప్పితిని. కార్యకార ణముల కేకైక సాక్షిని నేనే. నా వలననే యీ ప్రపంచ సృష్టికలుగుచున్నది, నాయందే యిది విలీనమగుచున్నది. ఈ సృష్టి, లయములయొక్క క్రమమును శ్రద్ధగా విని, చెప్పుచుందురో వారి అజ్ఞానము దూరమగును. వారి హృదయ గ్రంథి విడిపోవును. సమస్త సంశయములును నశించును. వారు కర్మబంధనములనుండి విముక్తు లయ్యెదరు. నేను సాంఖ్యవిధిచే సృష్టి ప్రళయములను గూర్చి వర్ణించి తిని. ఇప్పుడు నీవేమి వినఁగోరుచున్నావు ?'

ఉద్ధవుఁడిట్లనెను :-'స్వామీ! మానవు లందఱును నొకే విధముగ విచారమేల యొనర్పరో తెలిసికొనఁ గోరు చున్నాను. వీరిలో నింతటి భిన్నత యేల కలుగుచున్నది ?'

భగవానుఁడిట్లనెను :-'సత్వ, రజ, స్తమ గుణముల వలన భిన్నత కలుగును. భిన్న భిన్న ప్రవృత్తులు గుణకార ణముననే కలుగుచున్నవి.'

ఉద్ధవుఁడిట్లడిగెను :—'నాకు గుణప్రవృత్తి విషయమునఁ జెప్పవలయును. ఏ గుణమున కే ప్రవృత్తి కలుగును?'

భగవానుఁడిట్లనెను:—'ఇప్పుడు నేను త్రిగుణముల యొక్క ప్రవృత్తిని గూర్చి చెప్పెదను.'

సూతుఁడిట్లనెను :—'మునులారా! ఇప్పుడు భగవానుఁ డేవిధముగ గుణప్రవృత్తి యొక్క విషయమును గూర్చి చెప్పెనో దానిని గూర్చి నేను మీకుఁ జెప్పెదను.'

---

## త్రిగుణముల వృత్తి

శ్లో॥ గుణానా సమ మిశ్రాణాం పుమాన్యేన యథాభవేత్
తన్మే పురుష వర్యేద ముపధారయ శంసతః॥

—శ్రీభాగ. ౧౧స్కం. ౨౫అ. ౧ శ్లో.

వ. ఉద్ధవా! నీవు పురుషులలోఁ బరమ శ్రేష్ఠుఁడవు. వేఱు వేఱు గుణములలో మానవుఁ డే గుణము కారణమున నెట్టి ప్రకృతి కలుగునో దానిని నేను నీకుఁ జెప్పెదను. నీవు దానిని విని ధారణ యొనర్చుకొనుము.'

—శ్రీ మంద్దార్థ భాగవతము.

సమస్త ప్రాణులును గుణముల కధీనులై కార్యములొనర్చుచుందురు. పిపీలికాది బ్రహ్మపర్యంతము సమస్త జీవులును త్రిగుణములకు వశీభూతులై యుందురు. కొందఱు

సత్వగుణ ప్రధానులు, కొందఱు రజోగుణ ప్రధానులు. సత్వ, రజ, స్తమోగుణ ప్రభావ మందఱమీఁదను బడు చునే యుండును. శుద్ధ సత్వగుణ ప్రధానులైనను నొక్కొక్కప్పుడు రజస్తమో గుణములఁగొట్టును. దీనికి విపరీత ముగ ఘోర రజోగుణ తమోగుణుల జీవనము నందును సత్వ గుణోదయము కలుగును. గుణములందు వర్తించుచు, గుణాధీనులైన వారికి ఆవాగమనము వదలదు. కాని గుణా తీతులైనవారును, దేహాత్మలయొక్క రహస్య తత్వమును బాగుగాఁ దెలిసికొనినవారు మరల సంసార చక్రమునఁ బడరు. వారి ఆవాగమనములు నశించును.

సూతుఁడిట్లనెను :–'మునులారా! ఉద్ధవుఁడు త్రిగుణముల వృత్తిని గూర్చి అడుగఁగా భగవానుఁడిట్లనెను–'ఉద్ధవా సత్వ, రజ, స్తమో గుణములలో నెప్పుడే గుణముయొక్క ప్రాబల్యముండునో, అప్పుడు దానికి సంబంధించిన కార్యములు జరుగుచుండును. సాత్త్విక ప్రాబల్య ముండినచో సాత్త్విక భావము లుత్పన్నములగును. రజోగుణ ప్రాబల్యము కలిగినచో రజోగుణమునకు సంబంధించిన వృత్తులు కలుగును. తమోగుణాధిక్యమునఁ దమోగుణ వృత్తులేర్పడును.'

ఉద్ధవుఁడిట్లడిగెను :–'సత్వగుణ ప్రాబల్యము కలిగినచో సాత్త్విక వృత్తులుత్పన్నమగునని చెప్పితిరి. సాత్త్విక వృత్తులేవి ?'

భగవాఁడిట్లనెను :-'సత్వగుణము యొక్క వర్ణము తెలుపు. సత్వగుణము వృద్ధియైనచో శుభ విచారములు కలుగును. సత్వము వలన జ్ఞానము కలుగును. కావున జ్ఞానమునకు సహాయమొనర్చు వృత్తులుద్భవించును. అనఁగా శమ దమములు కలిగి, మనస్సును, ఇంద్రియములను వశ మందుంచుకొనుట కిచ్ఛ జనించును. సుఖ దుఃఖములయందు సమభావ ముంచుటయును, ద్వంద్వములను సహించుటయును జరుగును. ఇది సత్తు, ఇది అసత్తు అను వివేకము కల్గును. తపస్సునందు మనస్సును లగ్నమొనర్చుటయును, సదా చరణ మొనర్చుటయును. నోట నెల్లప్పుడును సత్యమునే పలుకుటయును, వ్యవహారము నందు సత్యమునే అనుస రించుటయును, మనస్సుతో సత్యమునే ఆలోచించుటయును, ప్రాణులయందు దయాభావము కలిగియుండుటయును, దీన దుఃఖులయొక్క దుఃఖములను గాంచి ద్రవించుటయును, ఏ కార్యమునైనను దొందఱపడి చేయకుండుటయును, ఏదైన కార్యము నొనర్చునపుడు ఈ కార్యము నొనర్చిన శుభమా? అశుభమా ? దీని పరిణామమేమి కలుగునని విచారించును. యదృచ్ఛా లాభ సంతుష్టినిఁ జెందియుండుటయును, నిరంత రము యోగక్షేమముల యొక్క చింతలోఁ బడకుండుట యును,మనస్సులో ధన సంగ్రహేచ్ఛ లేకుండుటయును నిరంత రము యోగమందే చిత్తమును లగ్నమొనర్చుటయును,

తనవద్దనే వస్తువుండినను దానివలన నితరులకు మేలు కలిగినచో దానిని వారలకు వెంటనే యొసంగుటయును, విషయములం దుదాసీనత కలిగియుండుటయును, విషయము లెదుట నుండినను వానిని సేవింప కుండుటయును, సత్కార్యము లందును, సజ్జనులందును సత్సంగమందును, ప్రతి శుభకార్య మందునను శ్రద్ధవహింప వలయును. పెద్దలవద్ద సంకోచ పూర్వకముగ మాటలాడుటయును, చెడ్డ సంకల్పములు మనస్సులోనికి వచ్చినను లజ్జించుటయును, తన లజ్జను శక్తికొలది రక్షించు కొనుటయును, యథాశక్తిగ దాన మొసంగుటయును, దుఃఖితులగు ప్రాణులను గాంచి యథాశక్తిగ వారిని రక్షించుటయును, ఏ దుష్టులైనను నెవరికైనను బాధలను గలిగించు చుండిన వారిని దుష్టత్వము నుండి తప్పించుటయును, సుఖముకొఱకు బాహ్యోపకరణముల నాశ్రయింప కుండుటయును, తనలోఁదాను దృప్తినిఁ జెంది యుండుటయును, ఆత్మక్రీడయును, ఆత్మరతి ననుభవించుటయును మొదలగున వన్నియును సత్వగుణముయొక్క ప్రవృత్తులు. ఏ హృదయమందిట్టి వృత్తులు నిరంతరము ప్రవర్తిల్లుచుండునో, వారు సత్వగుణ ప్రధానులని తెలియవలెను.

ఉద్ధవుఁడిట్లడిగెను :-'స్వామీ ! రజోగుణ వృత్తు లెట్లుండును ?'

భగవానుఁడిట్లనెను :—'రజోగుణము రక్తవర్ణముగ నుండును. కర్మలయందు బ్రవృత్తినిఁ గలిగి యుండుటయే రజోగుణముయొక్క కార్యము అది చేయుదును. ఇది చేయుదును. అచ్చటికిఁ బోవుటచే నాకు సమ్మానము కలుగును ఫలాని కర్మ మొనర్చుటచే నాకు బ్రసిద్ధి కలుగును. అను నిట్టి కోరికలు రజోగుణము చేతనే కలుగును. రజోగుణము లేక కర్మ ప్రవృత్తి కలుగఁజాలదు, మనస్సులోనికి ఒకానొక యిచ్ఛకలిగెనా దానిని వెంట నేఆరంభించును. ఫలాని చోటుననుండి ధనమును బ్రోవుచేయవలయును, అచ్చట మనుష్యులను బ్రోవుచేయవలయును, ఫలాని వారితోఁగలిసి ఫలాని విషయమై చర్చింప వలయును, త్వరగాబోవు వాహనము మీఁద నచ్చటికి బరుగెత్తుకొని పోవలయును. ఈ విధముగ ననేక ప్రయత్నములు రజోగుణముద్వారానే నెఱవేరును. రజోగుణమునఁ బ్రథమ ప్రవృత్తి అభిమానము, గర్వమును. అభిమానవంతుఁ డెల్లపుడును మీసములను మెలివేయుచుండును. ధీమాతో నడుచుచుండును. రోషముతో నటునిటుఁ జూచుచుండును. ఫలానివాఁడు నన్ను గౌరవింపలేదు. అతఁడు నన్నేమి లెక్క చేసినాఁడు! వానిపని పట్టెదను అని యిట్లు అభిమాన పూరితములగు వాక్యములను బలుకుచుండును. మనస్సులో విషయతృష్ణ యుండును. భోగ్యపదార్థ ప్రాప్తికొఱకు నిరంతరమును

జింతించుచుండును. ఎంతగా భోగించినను దృప్తియుండదు. తానే అందఱికంటె గొప్పవాడనియు, మిగిలిన వారందఱును దేనికిని బనికిరాని వారనియుఁ దలఁచి వారితో మాటలాడకుండుటయును, వారితో గర్వోక్తులతోఁ బలుకుటయును, ధనచింత కలిగియుండుటయును యశముకొఱకు పరోపకార కార్యము లొనర్చుటయును అట్టివానికొఱకు ఇతరుల నుండి దానరూపమున ధనమును గ్రహించుటయును, దేవతాపూజ లొనర్చి ధనమును యాచించుటయును, సకామానుష్ఠానము లొనర్చి, వానిద్వారా ధనమును భోగములను నభిలషించుటయును, కొందఱు పెద్ద లనియును, గొందఱు చిన్న లనియును సదా భేదభావ మెంచుటయును, కొందఱు తనకడకు రావచ్చు ననియు, కొందఱు రాఁగూడదనియు, ఫలానివాఁడు నాప్రక్కన యేల కూర్చుండవలసి వచ్చినది, నాకే అందఱికంటెను నుచ్చాసనము వేయవలయు ననియుఁ దాను సర్వసాధారణులతోఁ గూర్చుండఁజాలననియు ఫలానివారితో వ్యవహార మొనర్చుట తన పద ప్రతిష్ఠలకుఁ బ్రతికూల మనియును, ప్రతివిషయమునందును, ప్రతి వ్యవహార మందును, ప్రతిస్థాన మందును భేదబుద్ధినిఁ గలిగి యుండుటయును, విషయసుఖము కొఱకు సదా సముత్సుకుఁడై యుండుటయును, నిరంతరము విషయచింతన మొనర్చుటయును, రజోగుణ కార్యములం దుత్సాహమును గలిగి

యుండుటయును, ఒకనినిఁ గొట్టి లేక చంపి గుణ్ణమునెక్కి పాటిపోవుటయును, ఒకనితో బోట్లాడుటయును, ఇంకొకని నవమానించుటయును, ఇంకొకనికి విరుద్ధముగ వ్యర్థములగు నపవాదులను బెట్టుటయును, ఒక్కొక్కనిపై వ్యాజ్యములను వేయుటయును, ఒకనిని జనుల సమ్ముఖమున హేయముగఁ జూపుటయును, ఇట్టి మదజనితకార్యములం దత్యంతస్ఫూర్తి కలుగుటయును, నేపని యొనర్చినను దన ప్రశంస కొఱకే యొనర్చుటయును, అచ్చటచ్చట ధనమును బ్రోవుచేసి సార్వ జనిక భవనమును గట్టించుటయును, కాని దాని ద్వారము ప్రక్క తన నామములను జెక్కించుకొనుటయును, ఎవ రైనను ముఖముముందు ప్రశంసించినవారిని సమ్మానించుట యును, యథాశక్తిగ వారికి సహాయ మొనర్చుటయును, తన కార్యములను బ్రసిద్ధికిఁ దెచ్చినవారినెంతో పొగడుట యును, పదవులకును బ్రతిష్ఠలకును బ్రయత్నశీలుఁ డగుట యును, సారాంశ మేమనఁగా నేకార్యములం దాతని ప్రశంస యుండునో ప్రశంసను జేయుదురో వారినిఁ బ్రేమించుటయును రాజసప్రకృతి కలవాని స్వభావము.

హాస్యగసము నాశ్రయించుటయును, హాస్యరస విష యము లందును బ్రేమ కలిగియుండుటయును, నిరంతరమును సాంసారిక కార్యములలో మునిగి యుండుటయును, ఆయా కార్యములలోఁ దన గొప్పదనమును బ్రదర్శించుటయును,

బలవంతముగ నుద్యమాదులను నిర్వహించుటయును మొదలైన వన్నియును రజోగుణ ప్రవృత్తులు. రజోగుణము లేక సాంసారిక కార్యములం దింతటి ఉత్సాహమును ఇంతటి చంచలతయును, ఇంతటి తత్పరతయును, ఇంతటి యేకాగ్రతయు నుండదు.'

ఉద్ధవుఁడిట్లడిగెను :- 'స్వామీ! తమోగుణ వృత్తులెట్లుండును ?'

భగవానుఁ డిట్లనెను :-' ఉద్ధవా! క్రోధము తమోగుణము లేక రాదు. కామము రజోగుణ కార్యము. కాని కామము క్రోధరూపమునఁ బరిణమించినచో నప్పుడు తమోగుణము తన అధికారమును చలాయించును. క్రోధమున హింసజరుగుట అనివార్యము. కావున నెవనినైనను క్రోధమును జెంది కొట్టుట తమోగుణ కార్యము.'

ఉద్ధవుఁడిట్లడిగెను :- 'స్వామీ! క్షత్రియుఁడును యుద్ధమునఁ గ్రోధమును వహించి శత్రువులను జంపుట జరుగుచున్నదికదా! ప్రజలను హింసించు చుందురు. ఇదియును దమోగుణ కార్యమేనా ?'

భగవానుఁడిట్లనెను :- 'కాదు, ఇది క్షత్రియ ధర్మము. ఇది కర్తవ్యపాలనము. దీనిని హింసఅనరు. వీరత్వమందురు. ఆతఁడు శత్రువును గర్వించి, ఆతనితో వీరతాపూర్వకముగ యుద్ధ మొనర్చును. యుద్ధమున సమ్ముఖ

మునఁ బ్రాణమును వదలినచో సరిగా స్వర్గమునకుఁబోవును. పోవుచుండినవానిని వెనుకనుండిపోయి పొడిచి చంపినచో దానిని హింసయని యందురు. అజాగ్రత్తగానున్న సమయమునఁ గ్రోధమున వానినిఁ గొట్టుటయును హింసయే. మానవుఁడు క్రోధముచేఁ దన్ను దాను దెలిసికొనకుండినచో నాతఁడు తమోగుణముచే నిండినాడఁని తెలియవలయును. ఆ సమయమున నాతఁడు శూరవీరుఁడుగ నెన్నఁబడక ఆతతాయి కాఁగలఁడు. ఆతతాయినిఁ జంపినను దోషముండదు.'

ఉద్ధవుఁ డిట్లడిగెను :- 'స్వామీ! హింసా, వీరత్వముల భేదమును నేను దెలిసికొంటిని. ఇప్పుడు మీరు నాయందు గృపయుంచి అన్య తమోగుణ వృత్తులను గూర్చి చెప్పవలయును.'

భగవానుఁ డిట్లనెను :- 'ఉద్ధవా! లోభమును గలిగియుండుటయును దమోగుణమే. లోభములోఁ దన బంగారు, వెండి, ఇతర ధనము నష్టము కారాదు. ఇంకను బెరుగవలయునని యుండును. తమోగుణము యొక్క ప్రాధాన్యత జడపదార్థములందభినివేశము కలుగుట. జడపదార్థములందభినివేశము కలుగఁగానే మానవుఁడు మిథ్యాభాషణమొనర్పఁ దొడంగును. లోభవశముననే మానవుఁ డసత్యమును బలుకును. కావున లోభాసత్యములు రెండును దమో

గుణ కార్యములు. ఎవరినైనను యాచించుటయును, ఇత రులు యాచింప వచ్చినచో లేదని చెప్పించుటయును, దంభ పాషండముల నాశ్రయించుటయును, నత్యధిక శారీరక పరి శ్రమ మొనర్చుటయును, పరస్పరము కలహించు కొనుట యును, మాటిమాటికిని నందఱతోడను గలహించుటయును, మనస్సులో శోక మోహములును, విషాదమును జెందుట యును, ఇతరులను బాధించుటయును, ఇతరు లెవరైనఁ దన్ను బాధించెదరనుకొనుటయును, ఎల్లప్పుడును నిద్రించుట యును, ఆశ లేనిచోట నాశించుటయును, మనస్సులో నిత రుఁ ను భయపెట్టఁ దలచుటయును, ఏ పనినిఁ జేయుటకును నిచ్చగింపకుండుటయును నిరుద్యోగమున నుండి ఆలస్యము, తంద్రలను సహాయముగఁ దీసికొనుటయును, ఇవన్నియును దమోగుణవృత్తులు.'

ఉద్ధవుఁడిట్లడిగెను.– 'స్వామీ సత్వ, రజ, స్తమో గుణములయొక్క వృత్తులను వేలు వేలుగఁ జెప్పితిరి. ఇది పప్పు, బియ్యము గోధుమలువలె వేలు వేలు వస్తువులుగఁ గనఁబడుచున్నవి. గుణములును గలియవచ్చును. పులగములో గలిసినట్లు కలియవచ్చును.

అంత భగవానుఁడిట్లనెను:– 'ఉద్ధవా! కలియక అన్ని టికిని ఉండును. మూఁడు గుణములును గలియుచుండును. కలిసియే యుండును గాని కొన్ని విషయములు మూఁటి

యందును నొకే విధముగనుండును. కొన్ని కలిసి వర్ణసంకర మొనర్చును. ఒకే పురుషునియందొకొక్కప్పుడు సత్వ గుణమును, ఒకొక్కప్పుడు రజోగుణమును, ఒక్కొక్కప్పుడు తమోగుణమును గనఁబడుచుండును. ఈ మూఁడు గుణ ములును గుణాతీతుఁడైనఁగాని కనఁబడకుండఁ జాలవు. వీనియొక్క అత్యంతాభావము చాల కష్టము.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'స్వామీ! ఇప్పుడీ మూఁడు గుణములును గలిసిన వృత్తులను గూర్చి చెప్పుఁడు. ఏ గుణము వృద్ధిచెందిన నేవృత్తియుండునో చెప్పవలెను. ఇప్పుడు సత్వగుణము వృద్ధిచెందినదా? లేక రజోగుణమా? తమోగుణమా? దీనినిఁ దెలిసికొనుటెట్లు?'

భగవానుఁడిట్లనెను:- 'మంచిది, నేనిప్పుడు త్రిగుణ ములు కలిసిన వృత్తులకు సంబంధించిన విషయమును గూర్చి చెప్పెదను. గుణములను గనుఁగొను విధానమును గూర్చి యును జెప్పెదను.'

సూతుఁడిట్లనెను:- 'మునులారా! ఇప్పుడు భగవా నుఁడు ఉద్ధవునకెట్లు త్రిగుణములు కలిసినప్పుడు వాని వృత్తు లనుగూర్చియు, త్రిగుణముల కార్య సంబంధమును గూర్చి చెప్పెనో ఆ విషయమును జెప్పెదను. మీరీ సూక్ష్మాతి సూక్ష్మ విషయమును సావధానపూర్వకముగ శ్రవణ మొనర్పుఁడు.'

# గుణసన్నిపాతము - వాని స్వరూపము.

శ్లో॥ ధర్మే చార్థే చ కామే చ యదాసౌ పరినిష్ఠితః।
గుణానాం సన్నికర్షోఽయం శ్రద్ధారతి ధనావహః॥
—శ్రీభాగ. ౧౧ స్కం. ౨౫ అ. ౭ శ్లో॥

వ. ఉద్ధవా! మానవుఁడు ధర్మమునందును, అర్థమునందును, కామమునందును ప్రవృత్తుఁడైనపుడును త్రిగుణముల కలియిక కలదు. ఈ కలియికయొక్క పరిణామ స్వరూపమున నాతనికి శ్రద్ధా, ధన, రతులు ప్రాప్తించును.
—శ్రీమదాంధ్ర భాగవతము.

త్యాగ, సంతోష, తప, శమ, దమ, దయా, తితిక్షాదులు సత్వగుణమువలనను, తృష్ణా, అభిమాన, ఇచ్ఛా, ప్రయత్నాదులు రజోగుణమువలనను, నిద్రాలస్య, ప్రమాద, క్రోధాదులు తమోగుణము వలనను గలుగును. త్రిగుణముల చేతను గలుగు కర్మలును గలవు. సాత్త్వికభోజనము చక్కఁగ నుండును శ్రద్ధతోఁ జేయఁబడినదే. స్నిగ్ధమైనదే. దానిలో నన్నియును సాత్త్విక గుణములే. కాని పరిణామమున నధిక ముగఁ దినినచో నది నిద్రాలస్య ప్రమాదములను గలిగించును. సాత్త్వికమైనను బరిణామమున నది తామసమగును. హింస తామసకార్యము. కాని యెవఁడైన బలాత్కారమొనర్చినను, ఆతతాయిత్వమును గలిగియుండినను వానినిఁ జంపుట శుద్ధసాత్త్విక కార్యము. అహంకారమును

దీసికొనుఁడు-అది రాజసకార్యము. కాని త్యాగులకును,విరాగులకును నహంకారముండును. భక్తుఁడు మిక్కిలి గర్వముతో నిట్లనును :- 'నేను భగవద్దాసుఁడను, ప్రాణిమాత్రులకుఁ గింకరుఁడను. నే నిప్పుడు శాంతించితిని' ఇది అహంకారమైనను సాత్వికాహంకారము. 'నేను బలవంతుఁడను, దుర్జయుఁడను, నన్నెవరు జయింపఁగలరు ?' అనుట రాజసాహంకారము. 'నే నిచ్చట సోమరి తనమునఁబడియున్నాను. నాకు మోహ, విషాదములు కలుగుచున్నవి.' అని పలుకులు తామసాహంకారము. ఇదే విధముగఁ గొన్ని కార్యములలో మూఁడును గలిసియుండును. దీనిని సన్నిపాతమందురు.

సూతుఁడిట్లనెను :- 'మునులారా ! ఉద్ధవుఁడుగఁగా భగవానుఁడు గుణసన్నిపాతమును గూర్చి చెప్పుచు నిట్లనెను :- ''ఉద్ధవా ! నేనున్నాను, ఇది నాది యను నీ విషయమునందు మూఁడు గుణములయొక్క సమావేశముండును. నేను భక్తుఁడను, నేను బలిని, నేను క్రోధిని, భగవానుఁడు నావాఁడు, ఈ రాజ్యము నాది. ఈ పాసీన యన్నము నాకాహారము.' అని యీ విధముగఁ ద్రిగుణములయందు నేను నాది యను వ్యవహారముండును. ప్రాణము, ఇంద్రియములు, ఇంద్రియ విషయములు, మనస్సు వీని సంయోగముచే నేకార్యములు జరుగునో వానిలోను ద్రిగుణముల యొక్క సమావేశముండును. ఇవన్నియును గలియుటచే

సాత్త్విక వ్యవహారము నుండును. రాజసతామస వ్యవహారము లును నుండును. త్రివర్గ ప్రాప్తియందును త్రిగుణముల సన్నిపాతముండును.''

ఉద్ధవుఁడిట్లడిగెను :- ''త్రివర్గములలోఁ ద్రిగుణ సన్నిపాత మెట్లుండఁ గలదు?'

భగవానుఁ డిట్లనెను :- ధర్మార్థకామములకుఁ ద్రివర్గములని పేరు. ధర్మము సాత్త్విక వృత్తి. అర్థము రాజస వృత్తి. కామసుఖము తామసవృత్తి. ఈ మూఁడింటియొక్క పరిణామమును వేఱు వేఱుగ నుండును. ధర్మము వలన శ్రద్ధ ఉత్పన్నమగును. ధార్మిక కార్యములు సత్త్వగుణముచేఁ జేయఁబడును. వానినిఁ జేయుచుండిన శ్రద్ధవృద్ధియగును. అర్థమును జింతించుటచే ధనప్రాప్తి కలుగును. కామముచే రతిసుఖము కలుగును. మూఁడునుగలిసి యొక్కటే అయినను మూఁడింటికినిఁ ద్రివర్గ సంజ్ఞ వచ్చినది. కాని గుణానుసారముగఁ బ్రవృత్తులు వేఱువేఱుగనుండును. వీని పరిణామములందును భేదము కలదు. ఒక్కొక్కప్పుడు నిత్యనైమిత్తిక కర్మలు వదలుటకు వీలుండదు. వానిలో ధర్మ భీరుత్వమునను, స్వభావానుసారమునను వానియందులగ్నమైయుండును. దీనికిఁ దోడుగా సకామ కర్మానుష్ఠానమందును ప్రేమయుండును. ఇంటిని వదలకుండును. దానియందును బూర్ణాసక్తియుండును. ఇట్టి స్థితియున్నపుడు మూఁడు గుణములును గలిసియున్నవని

తెలియవలయును. అనఁగాఁ త్రిగుణ సన్నిపాతము కలిగినది. ఇ దేవిధముగ గుణసాంకర్యము కలుగుటచే వృత్తులయందును, గార్యములందును సంకరత కలుగుచుండును మానవుని యందు మూఁడు గుణములు నుండును. ఎవరిలోసత్వగుణము ప్రధానముగ నుండునో వారిని సత్వగుణ ప్రధాను లందురు. ఎవరియందు రజోగుణము ప్రధానముగ నుండునో సత్వ, తమస్సులు చాల తక్కువగ నుండును. వారిని రజోగుణు లందురు. తమోగుణము ప్రధానమగుటచే నందఱునువారినిఁ దమోగుణు లందురు.

ఉద్ధవుఁడిట్లడిగెను:-'స్వామీ! వీరిని గుర్తించుటెట్లు? వీరు సత్వగుణ ప్రధానులు, వీరు రజోగుణ ప్రధాను లని గుర్తించుటెట్లు?'

భగవానుఁడిట్లనెను :-'శాంత స్వభావము గలిగి, ఊరకవాగక, దైవవశమున సుఖ దుఃఖములేవి కలుగునో, వానిని దైవవశమని భావించుచు సహించువాఁడును, సత్వ వ్యవహార మొనర్చువాఁడును, ఇతరులను మనస్సులోనైన బాధపెట్టుటకు దలఁపని వాఁడును, చెడ్డపనులను జేయని వాఁడును, ఎల్లప్పుడును ముఖమునుండి శాంతముట్టి పడు చుండువాఁడు సాత్వికస్వభావము కలవాఁడు.

ముఖమున నెక్కువగఁ గోపము కలవాఁడును, నిరంతరము కామభోగములను గాంక్షించువాఁడును,సదా విషయ

ముల ననుభవింపఁ బ్రయత్న మొనర్చువాఁడును, ఉప్పు, కారము, పులుసు పదార్థములందు మిక్కిలి ప్రీతికలవాఁడును, తన్ను బొగడుకొను వాఁడును, పొగడ్తయందు ప్రీతికల వాఁడును, గర్వాభిమానములచేతను మదాదులచే వ్యాపించు వాఁడును ఇంక నిట్టి విషయములను గాంచి ఆతఁడు రజోగుణ వృత్తి కలవాఁడని తెలియవలెను.

ఎక్కువగ సోమరితనము, నిద్ర, క్రోధము, శౌచా శౌచ వివేచనము లేకుండుట, అసత్యములాడుట, హింస నొనర్చుట, కలహమాడుటయందు ప్రీతి, అపవిత్రమును, బాసినట్టియు, గ్రుళ్లినట్టియు, నెంగిలివియు, దినుటయందు సంకోచము లేకుండుట మొదలగు తమోగుణ కార్యము లెవనియం దెక్కువగ నుండునో ఆతఁడు తమోగుణుఁడని తెలియవలెను.'

ఉద్ధవుఁడిట్లడిగెను:–'స్వామీ! మీ భజనమును సత్వగుణ ప్రధానులే చేయుచుందురు. రజోగుణులును, దమోగుణు లును నీభజనమేల చేయుదురు? సత్వగుణ ప్రధానులు మిమ్ముఁబొందఁ గోరుదురు కావున మిమ్ము భజించెదరు. రజోగుణులును తమోగుణులును సంసారమును గోరుదురు. వారు మిమ్మేల కోరుకొందురు?'

భగవానుఁడిట్లనెను :–ఉద్ధవా! సంసారమును నా రూపమే. నేను గుణానుసారముగ నగుచుందును. దేవ

రూపములు నాసాత్త్వికములు. యక్షరాక్షసులు నారాజస రూపములు. భూతపిశాచములును, శాకినీ, ఢాకినీ యివన్ని యును నా తామసరూపములు. ఈ రూపము లన్నిటియం దును ఫలమును నేనే యిచ్చెదను. స్మశానమున శవము మీఁదఁ గూర్చుండి శవసాధన మొనర్చిన నాతని యారా ధన నా శవమేమి ఫలింపఁ జేయఁగలదు? శవము చచ్చి నది. జడమైనది. సాధకునియొక్క భావనాను సారముగ భూత, ప్రేత పిశాచ, ఛాయా పురుషాది రూపమున నేనే వారి కోరికలను దీర్చుచుందును. ఎవరు నన్నేవిధముగ భజిం చెదరో, నేను వారికదే రూపమును జూపించుచు, వాని భావనానుసారముగ వారి కోరికలను బూర్తిచేయుచుందును.

ఉద్ధవుఁడిట్లడిగెను :-'ఈపూజ చేయువాఁడు సత్వ గుణుఁడని తెలియుటెట్లు? లేక రజోగుణుఁడు, తమోగుణుఁ డని తెలియుటెట్లు?'

భగవానుఁడిట్లనెను :-'స్త్రీగాని, పురుషుఁడు గాని స్వధర్మపాలన మొనర్చుచు, సాంసారిక వాంఛలకు లోను గాక నిత్య నైమిత్తిక కర్మలద్వారా నాభజన మొనరించు చుండినను, కృష్ణజయంతి, ఏకాదశి, ప్రదోషము, రామ నవమీ మొదలగు వ్రతోపవాసములను గోరికతో గాక తన కర్తవ్యమని భావించుచుఁ జేయుచుండినను, నిష్కామ ముగ భగవత్సేవ నొనర్చినను, నిరంతరము నాభజన పూజ

నములందు లగ్నమై యుండినను, వారు నాసాత్విక భక్తులని తెలియవలెను. వారు భజనమును భజనము కొఱకే చేయుదురు. భజనమునకు లక్ష్యమును నేనే. వారు భజించు వారిలో నుత్తములు.'

ఉద్ధవుఁడిట్లడిగెను :–'రజోగుణ భజన చేయువారికి గుర్తులేవి?'

భగవానుఁడిట్లనెను:– 'పూజనువిధిగానే చేయుదురు. విపులధనమును వ్యయమొనర్చెదరు. కాని వారుచేయు భజనము ధనము కొఱకో లేక విషయవాంఛలకొఱకో అయి యుండును. నాకు మంచిభార్య లభింపవలయును, పుత్రుఁడు పుట్టవలయును, సాంసారిక సంబంధములగు వస్తువులు లభింపవలయునని కోరుకొనువారు రజోగుణమునుగలిగిన భక్తులు.'

ఉద్ధవుఁడిట్లడిగెను :– 'తమోగుణము గల భక్తుల గుర్తులేవి?'

భగవానుఁడిట్లనెను:– 'తమ భజన పూజనమువలనఁ దన శత్రువు చావవలయుననియు, ఫలానివారు తమకువశము కావలెననియు, ఫలానివాని మనస్సు ఉచ్చాటనమును జెందవలయునను హింసాభావనతో భజన చేయువారు తామస భక్తులు.'

ఉద్ధవుఁడిట్లడిగెను :– 'ప్రభూ! త్రిగుణములు వృద్ధి పొందిన లక్షణము లెట్లుండును. కృపతో నాకు వేఱువేఱు గుణముల లక్షణములనుగూర్చి చెప్పవలయును.'

భగవానుఁడిట్లనెను :- "ఉద్ధవా! సత్వగుణము ప్రకాశమయమని నేనిదివఱలోనే చెప్పితిని. స్వచ్ఛ, శాంత స్వభావులుగ నుందురు. సత్వసంశుద్ధికొఱకే సాంసారికులతోఁ గలియుట యుండదు. ఇంతటి శుద్ధతగను, బవిత్రతగ నుండి నప్పటికిని వీనికి దన శరీరమం దేవగింపుఁ గును. అట్టియెడ మలమూత్రయుక్తములగు నన్యస్త్రీ పురుషుల సంసర్గమేల చేయును. సత్వగుణము పెరిగిన కొలఁది రజస్తమోగుణ ములు తగ్గిపోవు చుండును. చివరకాతఁడు శుద్ధ సత్వమయుఁ డగును."

ఉద్ధవుఁడిట్లడిగెను :-'సత్వగుణము పెరిగిన నేమి జరు గును? అట్టిసత్వగుణ ప్రధానులగు పురుషులస్థితియెట్లుండును?'

భగవానుఁడిట్లనెను:- 'సత్వగుణము వృద్ధి పొందఁ గనే సమస్త దిక్కులనుండి జ్ఞానమువచ్చి తనలో జేరినట్లుం డును. ఆతనికొక విలక్షణమగు సుఖముండును. తాను జ్ఞాన విజ్ఞాన సంపన్నుఁడనను జ్ఞానము కలుగును. తానానంద సాగరమున మునుగుచున్నట్లుండును. ఆంతరంగిక సుఖము కలుగును.

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'రజోగుణ మెట్లుండును?'

భగవానుఁడిట్లనెను:- 'ఉద్దవా! రజోగుణముయొక్క కార్యము హృదయమును రాగరంజిత మొనర్చుటయే. రజోగుణము వృద్ధిపొందినచోఁ గర్మలందును, శబ్దాది విష

యము లందును స్వాభావికమగు నాసక్తి కలుగును. ఇష్టము లేకుండినను భేదబుద్ధికలుగును. చిన్న పెద్ద, ధనికుఁడు పేద యనుజ్ఞానము హృదయమందు హత్తుకొనును. స్వభావమునఁ గర్మప్రవృత్తి కలుగుట రజోగుణము యొక్క ధర్మము. కావున రజోగుణ వృద్ధిలోఁ గర్మలయెడల నత్యంతాసక్తి పెరుగును.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'దీనికి పరిణామ మేమి?'

భగవానుఁడిట్లనెను:- 'రజోగుణము పెరిగిన కొలఁది సత్వగుణమును, తమోగుణమును తగ్గిపోవుచుండును. సమస్త కర్మలయొక్క ఆరంభమును దోషయుక్తమే. అగ్ని నెచ్చటికి దీసికొనిపోయినను బొగ వెనువెంటనే వచ్చు చుండును. కావున రజోగుణప్రవృత్తియం దహంకారమువృద్ధిపొందును. హృదయమున నొక విధమగు నశాంతి కలుగు చుండును. భగవంతుని సేవాకర్మకాక పరిణామమున దుఃఖము కాని కర్మలేదు. అందువలన రజోగుణము కలవాఁడు లోపల దుఃఖమును, అశాంతిని ననుభవించుచుండును. రజోగుణులు సాధారణముగ ధనికులుగ నుందురు. వారికి సాంసారిక సంతృప్తికి గొదువ లేకుండినను దుఃఖులుగనే యుందురు. ధనము రాఁగానే రజోగుణము వృద్ధినిఁబొందును. కావున శ్రేయస్సును గోరువాఁడు ధనసంగ్రహ మొనర్పరాదు.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'తమోగుణముయొక్క స్వరూప మేమి?'

భగవానుఁడిట్లనెను :- 'తమస్సుయొక్క స్వరూప మజ్ఞానము. బుద్ధిపై నవిద్య ఆవరించును. ఆ సమయమునఁ జెడ్డవిషయము మంచిదిగను, అధర్మము ధర్మముగను గోచరించును సత్వరజస్సులనణఁచి తమోగుణమువృద్ధిపొందును. తమోగుణముయొక్క స్వభావము జడత్వము. కావున నట్టివాని బుద్ధియును జడమైపోవును.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'దాని పరిణామ మేమి?'

భగవానుఁడిట్లనెను:- 'దాని పరిణామము శోక మోహములు, చిత్తమందు ఖిన్నత్వము కలుగును. హింసా కర్మలందు స్వాభావిక రుచియుండును. నిద్రాలస్య ప్రమాదములకు వశీభూతుఁడై పడియుండుట కిచ్ఛ చేయును. ఆశ యుండును. ఎవ్వరి మీఁదను విశ్వాసముండదు.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'స్వామీ! ఈ గుణములు వృద్ధి చెందినచోఁ జిత్తస్థితి యెట్లుండును?'

భగవానుఁడిట్లనెను:- 'నాయనా! తన స్థితి చేత నే గుణము లెట్టివో తెలియఁగలవు. చిత్తమునకు స్వాభావిక ప్రసన్నత యుండినచో నింద్రియములన్నిటికిని స్వతః శాంతి కలుగును. ఎవ్వని వలనను నే విషయమునను భయముండదు. మనస్సులో నేవిధముగను, నేవస్తువునందును నాసక్తి

యుండదు. సమస్త గుణములలో శ్రేష్ఠుఁడగువానికి సత్వ గుణము వృద్ధియైనదని తెలియవలయును. ఆతఁడు నన్ను బొందును. ఇట్టివాఁడు సత్వ ప్రధానుఁడై యుండును.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'రజోగుణ వృత్తిని గుర్తించు టెట్లు?'

భగవానుఁడిట్లనెను:- 'కర్మలయందు బ్రవృత్తి యుండును. కాని క్రియ వికృతి యగును. చిత్తము చంచలమగును. బుద్ధి వికృతివలె నగును. ఇంద్రియము లశాంతములగును. ఇంద్రియ లోలుపత పెరుగును. భోగవాసన ప్రబలమగును. విషయవాసనాకారమున మనస్సును, మిథ్యాహారవిహారము వలన శరీరమును నస్వస్థమగును. ఈ లక్షణములను బట్టి రజోగుణము వృద్ధినిఁజెందినదని భావింపవలయును.

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'తమోగుణవృత్తినెట్లు గుర్తింపవలయును?'

భగవానుఁడిట్లనెను:- 'జ్ఞానేంద్రియములు తమ వాస్తవిక కార్యములను జేయఁజాలనపుడును, చెల్లెలిని, కూఁతురుని నితరులవలెఁ జూచునపుడును, అధర్మమును ధర్మముగ భావించునపుడును, స్వాదు పదార్థముల నస్వాదువులుగను, అస్వాదు పదార్థములను స్వాదువులుగను భావించువాఁడును, జ్ఞానేంద్రియములు తమ తమ విషయ

ములను గ్రహింపఁజాలక, అజ్ఞానమునఁజిత్తమందు లీనమగు నపుడును, కూర్కు వచ్చినట్లుండుటయు, శరీరము తూలి పోవుటయును, మనస్సులోనికి జడత్వము వచ్చినపుడును, శూన్యత గోచరించినపుడును, అజ్ఞాన, గ్లానులు వృద్ధిచెంది నపుడును, ఇట్టి లక్షణములచేఁ దమోగుణము తన రంగును జూపించుచున్నదని భావింపవలయును. అది అప్పుడు సత్వ రజస్సుల నణఁగఁ ద్రొక్కి న ది . అది పెరిగిపోయినది. ఉద్ధవా! నేను నీకెంతని చెప్పఁగలను? ప్రపంచమున గుణముల కధీనుఁడు కానివాఁడొక్కఁడును లేడు. అందఱును గుణప్రేరితులై సమస్త వ్యవహారములను జేయుచున్నారు. ఒక గుణము వృద్ధినిఁబొందిన నొక వర్గమును, నింకొక గుణము ప్రవృద్ధిపొందిన నింకొక వర్గమును వృద్ధినిఁ బొందును.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'స్వామీ! ఏగుణము వృద్ధినిఁ బొందుటచే నేవర్గము వృద్ధియగును?'

భగవానుఁడిట్లనెను :- 'సత్వగుణము వృద్ధినిఁ బొందుటచే దేవతల వృద్ధియగును. కావున సత్వప్రధాన పురుషులందు దైవీగుణములధికముగ సంచార మొనరించును. వారియందు దేవతలావేశించుచుందురు. వారి శరీరములను నిమిత్తముగ దీసికొని దేవతలాదేశించుచుందురు. రజో గుణము వృద్ధినిఁ బొందిన నసురుల బలము వృద్ధియగును. వారికాసురీవృత్తి కలుగును. అసురులభావములు కలుగుటచే

నాసురీభావ సంపన్నులగుదురు. తమోగుణము వృద్ధి పొందినచో రాక్షస, భూత, ప్రేత పిశాచాదులకు బలము వృద్ధియగును. ఉద్ధవా! ప్రపంచమునఁగల త్రికమంతయును నీ త్రిగుణములయొక్క ప్రతీకములే. వాత, పిత్త, శ్లేష్మాది త్రిదోషములును త్రిగుణములకు సంబంధించినవే. కఫము సత్వప్రధానము, పిత్తము రజోగుణము, వాతము తమోగుణ ప్రధానము. త్రిదేవులలో విష్ణువు సత్వప్రధానుడు, బ్రహ్మ రజోగుణ ప్రధానుఁడు. రుద్రుఁడు తమోగుణ ప్రధానుఁడు. త్రిలోకములలో స్వర్గము సత్వగుణప్రధానము, పృథివి రజోగుణప్రధానము, పాతాళము తమఃప్రధానము. అవస్థలలో జాగ్రదవస్థ సత్వప్రధానము, స్వప్నావస్థ రజోగుణప్రధానము. సుషుప్తి తమోగుణ ప్రధానము. ఈ మూఁటికినిఁ బరముగనుండిన దురీయావస్థ సర్వ వ్యాపకమగు నాత్మకువలె నుండుటచే నవస్థాత్రయమందునను గలదు.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'స్వామీ! త్రిగుణములయొక్క జ్ఞాన మత్యంతావశ్యకము. కృపతో నాకు త్రిగుణముల యొక్క కార్యములను గూర్చి యెక్కువగఁ జెప్పుఁడు'

భగవానుఁడిట్లనెను:- ఉద్ధవా! నేను నీకెంతని చెప్పఁగలను? ప్రపంచమున నంతటను నీ త్రిగుణములు వ్యాపించి యున్నవి. అయినను నేను నీకు కొంచెము సంక్షేపముగఁ జెప్పెదను.'

సూతుఁడిట్లనెను :- 'మునులారా! భగవానుఁడు త్రిగుణముల కార్యములను గూర్చి యెట్లు చెప్పెనో దానిని గూర్చి నేను ముందు వర్ణించెదను.'



## త్రిగుణాత్మక జగత్తును దరించు నుపాయము

శ్లో॥ ద్రవ్యం దేశః ఫలం కాలో జ్ఞానం కర్మ చ కారకః।
శ్రద్ధావస్థా కృతిర్నిష్ఠా త్రైగుణ్యాః సర్వ ఏవ హి॥

—శ్రీ భాగ. ౧౧ స్కం. ౨౫ అ. 30 శ్లో॥

వ॥ ఉద్ధవా! ద్రవ్య, దేశ, ఫల, కాల, జ్ఞాన, కర్మ, కారక, శ్రద్ధ, అవస్థ, క్రియా, నిష్ఠా మొదలగునవన్నియును త్రిగుణాత్మకము లే.

—శ్రీ మదాంధ్రభాగవతము.

వల యెట్లు దారములతో నల్లఁబడినదో అట్లే యీ ప్రపంచమంతయును గుణములచే నేర్పడినది. వస్త్రమున నెచ్చటఁ జూచినను పడుగు పేకలలో దారమే కలదు. ప్రపంచమున నెచ్చటనైనను జూడుము గుణములకే ప్రాధాన్యత కనఁబడుచున్నది. త్రిగుణములనే ప్రపంచ మందురు. త్రిగుణములు సమస్థితినిఁబొందినచోఁ ప్రళయము కలుగును. గుణములలో విషమత సంభవించినచో సంసార

చక్రము తిరుగుచుండును. కావున సంసారమున నెచ్చట వెదికినను విషమతతప్ప సమము కనఁబడదు. ఒకేస్థానమున నొకే వ్యక్తి కానిండు, ఒకే స్థానమున నొకే సాధనము ద్వారా నిర్మింపఁబడిన లక్షలు, కోట్లు వస్తువులందును జాగ్రత్తగాఁ జూచినచో నేదియో న్యూనాధిక్యము కనఁబడి తీరును. ఇదంతయును గుణములయొక్క విషమతా ప్రభావమే.

సూతుఁడిట్లనెను:- 'మునులారా! ఉద్ధవుఁడు త్రిగుణ కార్యములను గూర్చి విశేష జిజ్ఞాస చేయఁగా భగవానుఁ డిట్లనెను:- 'ఉద్ధవా! త్రిగుణముల ననుసరించి గతియును త్రివిధములుగ నుండును.

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'స్వామీ! ఏ గుణము ద్వారా యే గతి ప్రాప్తించును?'

భగవానుఁడిట్లనెను:- 'సత్వగుణ ప్రధాన మైనచో నిరంతరమును వేదాధ్యయన మొనర్చు బ్రాహ్మణ గణము ఉత్తరోత్తర పైలోకములకు బోవుదురు. ఎంతగా సత్వమధిక ముగ నుండిన నంతంతగాఁ బైపై లోకములకుఁ బోవుదురు. భూర్భువఃసువః మహఃజన, తప, సత్యలోకములు సత్వగుణ ప్రధానులైనవారికి లభించును. తమోగుణ ప్రధానులైన వారికి నీచలోకములగు నరకాదులు సంభవించును. ఒకవేళ నట్టివారు భూమిమీఁదఁ బుట్టినచోఁ బంది, కుక్క, సర్ప,

వృశ్చిక, వృక్షలతాది జన్మలు ప్రాప్తించును, ఈ మూఁడు గుణములకును దూరముగ నుండువారికి స్వర్గనరకములుగాని, పృథివిపై జన్మించుటగాని యుండదు. నా ఉపాసకు లైనవారు నన్నే పొందుదురు. ఈవిధముగ నే కర్మయును త్రివిధము.

ఉద్ధవుఁడిట్లడిగెను :- 'కర్మ త్రివిధ మెట్లు? ఏ కర్మలు సాత్వికములు, ఏవి రాజసములు, ఏవి తామసములు?'

భగవానుఁడిట్లనెను:- 'కర్మలను గర్తవ్య బుద్ధిచేఁ జేయుచు, సమస్త ఫలములను నాకే అర్పించుచుఁ గర్తృత్వాభిమానమును జెందక చేయు నిష్కామకర్మ సాత్వికమైనది. సంకల్పపూర్వకముగఁ ద్రివర్గ ఫలప్రాప్తి హేతువుచేఁ జేయునది రాజసము. హింసాదంభములతోఁ గూడుకొనిన, ఇతరులను జంపుటయుఁ గొట్టుటయును, గష్టపెట్టుటయును, ఇట్టి కర్మలన్నియును దామసములు. కర్మమువలెనే జ్ఞానమును మూఁడు విధములుగ నుండును.'

ఉద్ధవుఁ డిట్లడిగెను :- 'జ్ఞానము మూఁడువిధము లెట్లు స్వామీ!'

భగవానుఁ డిట్లనెను :- 'ఆత్మ అసంగము. దానికిని నీ దృశ్యప్రపంచమునకును సంబంధము లేదు. దేహము వేఱు. దీనిలో నివసించు దేహి వేఱుగ నున్నాఁడు, ఈ విధమగు జ్ఞానము సాత్వికము. ఆత్మ ద్వారానే సమస్త కార్యములును జరుగుచుండును. ఆత్మయే కర్త, ఆత్మయే భోక్త.

అనఁగా నీ శరీరమునే సమస్తమని భావించుచుఁ బంచ భూతాత్మకములగువానికే రాత్రింబవళ్ళు చింతించుటయును, వాని సంయోగముచే వివిధములగు ఘాతుకములగు నస్త్ర శస్త్ర నిర్మాణ మొనర్చుటయును, శరీరమునకు సుఖము నొసంగునట్టియు, శత్రువులను బరాజితుల నొనరించునట్టి వస్తువులను నిర్మించుజ్ఞానము రాజసజ్ఞానము. ఘటపటాదుల యొక్క సాధారణ జ్ఞానమును, మూఁగవారికిని, బుద్ధిహీను లకు జ్ఞానము వచ్చినట్లు వచ్చుజ్ఞానము తామస జ్ఞానము. గుణాతీతుఁడను బరమాత్మయు నగు నాకు సంబంధించిన జ్ఞానము అది నిర్గుణము. ఏలననఁగా నేను నిర్గుణుఁడను. ఈ విధముగ నివాసమును మూఁడు విధములుగ నుండును.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'నివాసము మూఁడు విధములెట్లు స్వామీ!'

భగవానుఁడిట్లనెను :- 'ఏకాంతమున శాంతముగ వనమందు వాసమొనర్చుట సాత్వికవాసము. సాత్విక ప్రకృతి లేనివారు వనమునందు స్థిరముగ నుండఁజాలరు. అచ్చట నుండినను విషయభోగములనే సమకూర్చుకొందురు. వన వాసమనఁగా వనములోనుండి ప్రకృతితో ఖేలన మొనర్చుట. కందమూల ఫలాదులచేతనే బ్రదుకుచు నిరంతరము నన్నే చింతించుట. చోరులు, జూదరులును వనములో దాగి యుందురుకదా! కాని వారి వాసము సాత్వికము కాదు.

తామసము. ఏలననఁగా వారచ్చట భజన మొనర్పక జూద మును వ్యభిచారమును నొనర్చెదరు. లతా వృక్షాదు లందు ప్రేమను జూపుచుఁ బ్రభుచింతనమునఁ గాలమును గడుపుట సాత్త్విక వనవాసము. గ్రామ, నగర నివాసము రాజసనివాసము. ముఖ్యముగ గొప్పగొప్ప నగర నివాసమట్టిది. అచ్చట జీవన మత్యంత మశాంతముగ నుండును. ఎచ్చట గాంచినను రాజసవైభవమే కనఁబడును. వివిధములగు రాజసభోజనము లమ్మఁబడుచుండును. నృత్య, గీత, నాటకాభినయ, విహా రాదులన్నియును రాజసములే. అందఱు నశాంతులుగను, వ్యగ్రులుగను నుందురు. వేగవంతములగు వాహనము లటు నిటు నిరంతరము పరువిడు చుండును. రాజ్యాధికారులు వచ్చుచుఁ బోవుచుందురు. వారికి రాజోచితస్వాగతసత్కార ములు జరుగుచుండును. ఈవిధముగ బ్రతిపనిలోను రజో గుణ ముండుటచే దాని ప్రభావ మందఱిమీఁదను బడుచుం డును. ఎంతటిసాత్త్వికుఁడైనను నాతఁడు గొప్పగొప్పనగరము లందు నివసించుచుండినచోఁ వానిలోఁ గొంచెముగనో గొప్ప గనో రజోగుణము వచ్చితీరును. కావున గ్రామములును, నగరములును రాజస నివాసములు. కలహ, వ్యభిచార, ద్యూతాది కుకర్మలు జరుగు చోటులు తామస నివాసములు. ఇదేవిధముగ సురాపాన, వేశ్యాగమనము, ఇతర భీభత్స కృత్యము లెచ్చట జరుగునో, అవన్నియును దమోగుణ

నివాసములే. శ్రేయస్సునుగోరు స్త్రీ పురుషులిట్టి స్థానములం దడుగైనను బెట్టరాదు. ఏలననఁగా నట్లుచేసినఁ గొలఁదిగనో గొప్పగనో ఆప్రభావము పడును. సాధుమహాత్ములును, శాంతులును నేకాంతమున దట్టమైన వృక్షముల నీడలఁ గూర్చుండి జపతపములు చేసికొనుచుందురు. అచ్చటికిఁ బోయినచోఁ దత్కాలమున నొకవిధమగు శాంతిలభించును. దీనికి విపరీతముగ నేస్థానమున దొంగలు, దొంగతనము, దోచుకొనుట, వ్యభిచారము, దురాచారము, సురాపానము, ద్యూతాదికుకర్మలు జరుగుట యిప్పుడేకాదు, నేఁటికి వేల కొలఁది సంవత్సరముల క్రిందటజరిగినను నచ్చటికిఁ బోయిన నెంతటి మంచివారికైనను చెడ్డసంకల్పము లుద్భవింపఁగలవు.

అంత శౌనకుఁడిట్లడిగెను:–'కుకర్మల ప్రభావ మిన్ని దినముల వఱకుండునా ?'

సూతుఁడిట్లనెను :–'స్వామీ! కుకర్మ సుకర్మలయొక్క ప్రభావము స్థానములందు చాల దినముల వఱకుండును. సుకర్మలయొక్క ప్రభావము చిరకాలము వఱకుండ కుండినఁ దీర్థముల కింతటి మహాత్మ్యమెట్లు చెప్పఁబడినది. తీర్థములలో నేమున్నది. ఫలాని స్థానమున ఫలాని ఋషి తపస్సుచేసి నాఁడు. అది పరమైనది. బ్రహ్మ ఫలానిచోట యజ్ఞమొనర్చి నాఁడు. అదివఱకు పావనమైనది. ఫలాని స్థానమును ఫలాని దేవత నిర్మించినాఁడు అది తీర్థమైనది. గంగను సర్వతీర్థ

మయి యని యేల చెప్పినారు ? అది భగవానుని పాదపద్మ ములనుండి వెలువడినది. దాని తీరమున ననేకులగు మహ ర్షులు ఘోరతపస్సును జేసినారు. తపస్సును వారెప్పుడు చేసిరో కాని దాని ప్రభావమిప్పటికిని గలదు. గంగాతట మున నేకాంత స్థానమునకుఁ బోయి చూడుము. అచ్చట స్వాభావికమగు ప్రశాంతి అనుభవము గోచరమగును. చెడ్డ కర్మల విషయముననుఁ నింతే. నే నిదివఱలో శ్రీరామచం ద్రుని కథను జెప్పితిని. ఒక్క స్థాన మహిమమును బట్టి లక్ష్మ ణుఁడు భగవానునకు విరుద్ధుఁడయ్యెను. అనరాని మాట లనెను. ఇట్టివి ఒకటి రెండు కాదు. అనేకోదాహరణములు కలవు.

ఒక వ్యక్తి ఒక యింటిని గొనెను. అతఁడాయింటిలో నున్నంతసేపు తాను మేఁకలను జంపవలెనని తలచును. ఆతఁడు సాత్త్విక ప్రకృతి కలవాఁడు. ఆతఁడు మదిరా మాంసములును స్పర్శింపనైన స్పర్శింపలేదు. ఆ యింటిలో నున్నప్పుడిట్టి యాలోచనలు తట్టును. బయటకు వచ్చిన శాంతుఁడగును. ఇట్లు నిరంతర మట్టి భావనలు వచ్చుచుండగా నాతఁడు పండితులను బిలిచి అడిగెను. పండితులిట్లనిరి :- 'మహానుభావా! ఇది స్థానముయొక్క ప్రభావము. ఇది వఱలో నిచ్చట హింస జరిగి యుండవలెను.'

ఇది విని ఆతఁడు బాగుగా విచారించెను. విచారిం పఁగా నూఱు సంవత్సరముల క్రిందట అది వధశాలయని తెలిసెను. అచ్చట మేఁకలే చంపఁబడు చుండెడివఁట. ఇప్పటికిని నాపరమాణువు లిచ్చట వ్యాపించి యున్నవి.'

ఈ విషయమును బట్టి నివాసస్థానమును బట్టియు దాని ప్రభావముండును. కావున వీలైనంతవఱకు పుణ్య క్షేత్రమునను, తీర్థస్థానమునను నివసింపవలయును. త్యాగు లును, విరాగులును, సాధువులును నిట్టి గృహములందుండ రాదు. గృహస్థధర్మ నిరతులగు వారి యిండ్లలో నుండినచో దప్పక వారి మనస్సు దూషితమగును. మనమేది మాటలాడి నను, నేది విచారించినను, వానియొక్క సూక్ష్మ పరమాణు వులు మనకు నలువైపులను వ్యాపించును. నిర్బల విచారము కలవారచ్చటికిఁ బోయినచో నా విచారముల ప్రభావము వారిపైఁబడును. కాని ఆ ప్రభావము కొన్నిదినములకు గాని కనఁబడదు.'

శౌనకుఁడిట్లడిగెను :-'సూతా! ఇప్పుడు మాకు దెలిసి నది. అవశ్యము స్థానప్రభావము తప్పకపడును. అందులకే భగవానుఁడు మమ్ముల నిచ్చట నైమిశారణ్యమునకుఁ బంపి నాఁడు. ఇచ్చట ఇదివఱకును ఋషులును మునులును దప స్సును జేసియుందురు.'

సూతుఁడిట్లనెను:–'స్వామీ! ఇది తపస్థలమే. తపస్థానమునఁ దపస్వులే నిలుఁవగలరు. కలియుగమున దీనికి విపర్యయమును గలుగఁగలదు. కాని సాధారణముగ స్థానమునకు ముక్కలి ప్రభావముండును. పూర్వము రాజర్షులు రాజ్యమును వదలి వనమునకుఁ బోవునపు డెచ్చటనైనఁ గుటీరములను వేసికొని యుండెడువారు కారు. ప్రాచీనమునులు తపస్సును జేసిన స్థానములకుఁబోయిరి. విశ్వామిత్రుఁడును, రాజర్షియగు భరతుఁడును నట్లే చేసిరి.'

శౌనకుఁ డిట్లనెను :– ''నిజమును జెప్పితివి సూతా! స్థానము యొక్క ప్రభావమును మేము స్వయముగఁ బ్రత్యక్షముగ ననుభవించు చున్నాము. సరే, అంత నుద్ధవుఁడు భగవాను నేమి అడిగెను ?'

సూతుఁ డిట్లనెను :– 'స్వామీ ? భగవానుఁడు త్రివిధ నివాసములనుగూర్చి వర్ణింపఁగా నుద్ధవుఁడిట్లడిగెను:– 'స్వామీ! త్రిగుణాతీత నివాసమును గలదా ?'

భగవానుఁ డిట్లనెను :– 'నామందిరములలో నివసించుట నిర్గుణ నివాసము. ఏలననఁగా నేను స్వయముగ గుణాతీతుఁడను. నా అర్చా విగ్రహమును స్థాపించుకొని, యే విధమగు సాంసారిక విషయములను జింతింపక, నిరంతరము నాచింతలోనే నిమగ్నుఁడైనచో నాతఁడు నిర్గుణ స్థానమున నున్నట్లే. కొందఱు ద్రవ్యమును సంపాదించుటకై

మందిరములను స్థాపించి చాలమంది దేవాలయములలో నివ
సించు చుందురు. ఆవాసము తమోగుణావాసము. నామంది
రము నాకొఱకే ఉండవలయును. దానిలో నాచింతనము నే
యొనర్పవలయును. అట్టివాఁడు చివరకు నిశ్చింతగ నాలోక
మును బొందును. ఇదే విధముగఁ గర్తలలోను మూఁడు
భేదములు కలవు.'

ఉద్ధవుఁడిట్లడిగెను :- 'కర్తలలో మూఁడు భేదము
లేమి స్వామి!'

భగవానుఁ డిట్లనెను :- 'ఏ కర్త అనాసక్త భావ
ముతోఁ గర్మలొనర్చుచు, ఫలములను గోరకుండువాఁడు
సాత్వికకర్త. రాగయుక్తుఁడై ఆసక్తితోఁ గూడుకొని సమస్త
కర్మల నెవఁడొనరించుచుండునో ఆతఁడు రాజసకర్త. గుడ్డిగాఁ
గర్మ లొనర్చుచు బూర్వాపరములు చూడనివాఁడు తామస
కర్త. కాని కర్తృత్వాభిమానము లేక కర్మ లొనర్చుచుండి
నను నిర్లిప్తుఁడై యెవఁడుండునో, నన్నొక్కనినే ఆశ్రయించి
కర్మలొనర్చుచుఁ గేవలము నాయనుగ్రహ ప్రాప్తి కొఱకే
యెవఁడు కర్మలొనర్చునో, అట్టి కర్త నా స్వరూపుఁడే. నే
నెట్లు నిర్గుణుఁడనో, ఆ కర్తయును గుణరహితుఁడే. అట్లే
శ్రద్ధయును మూఁడు విధములు.'

ఉద్ధవుఁడిట్లడిగెను: :-'స్వామీ! శ్రద్ధలో నెన్ని భేద
ములు కలవు '

భగవానుడిట్లనెను :- 'ఉద్ధవా ? ఆత్మ జ్ఞానము మీఁద గల శ్రద్ధ సాత్త్వికశ్రద్ధ. వారి కాధారమేమియును లేదు, కేవల మాత్మయే దానికి వస్తువు. అనఁగా నాత్మ జ్ఞానులయందు భక్తి కలిగియుండుటయును, అందఱిలో నుండిన నాత్మ ఒక్కటియేనని ప్రాణులందఱకును బ్రణామ మొనరించుటయును, ఇదంతయును నాత్మ సంబంధమున నుత్పన్నమైనదనుటకు సాత్త్విక శ్రద్ధయందురు. కర్మద్వారా ఉత్పన్నమగు శ్రద్ధ రాజసశ్రద్ధ. ఫలానివాడు కర్మయోగి, ఆతఁడు పాఠశాలలను నిర్మించినాఁడు, ఇన్ని గోశాలలను నిర్మించినాఁడు, ఆతఁడు చక్కఁగ నుపన్యసింపఁ గలఁడు, ఆతఁడు చక్కని లేఖకుఁడు, చిత్రకారుఁడు, కథావాచకుఁడు, వక్త కళాకారుఁడు, ఎన్నో కర్మలయందు నిష్ణాతుఁడు: కావున నాతని యందు శ్రద్ధయుంచవలయు ననుకొనును. ఇది చిరకాలముండునను నమ్మకముండదు. ఏ కారణమున నాతనియందు శ్రద్ధకలిగినదో, అది లేకుండినను, అదితొలఁగి పోయినను నింక శ్రద్ధయుండదు. కర్మలొనర్చుచుండవలయు నను దృఢ శ్రద్ధను వ్యక్తమొనర్చినను, కేవలము కర్మ లందే శ్రద్ధ కలిగియుండిన రాజసశ్రద్ధ. అధర్మమందు శ్రద్ధ యుంచుట తామసశ్రద్ధ. చాలమంది పరంపరా గురువులును, నాచార్యులును నధర్ములు. చాలమంది సాధువేషధారులు వ్యభిచారులును, దురాచారులునైయున్నారు; కాని వారి

యందును శ్రద్ధ కలిగియుండవలయును. వారి అధర్మకార్య ములను యుక్తిపూర్వకముగ సమర్థించుటయును, వారిశ్రద్ధకు వశభూతులై సహాయ మొనర్చుటయును, వారి అధర్మ కార్యములందు శ్రద్ధయుంచుటయును, ఒక దేవత యిచ్చుట కోడిని గోసిన నీకు పుత్రుఁడై పుట్టునని చెప్పిన దానిని విచా రింపక శ్రద్ధాపూర్వకముగ నొనర్చుటయును నిట్టిశ్రద్ధ తామస శ్రద్ధ కాఁగలదు. కేవలము నా సేవయందును, నా పర్వోత్స వాదులందును గలుగు శ్రద్ధ నిర్గుణమైనది. ఏలననఁగా నా శ్రద్ధకేకమాత్రసంబంధము నాతోడనే కలదు. నాతో నేకార్యములచే నైనను సంబంధము కలిగినచో, నవియన్ని యును నిర్గుణములే. ఈ విధముగ నాహారమును మూఁడు విధములుగ నుండును.'

ఉద్ధవుఁడిట్లడిగెను:-'ఆహారము మూఁడు విధములుగ నెట్లుండును స్వామీ?'

భగవానుఁడిట్లనెను:-'స్వచ్ఛముగ నుండునదియు, శుద్ధ భావనతోఁ జేసినదియు, రసయుక్తమైనదియు, మెత్తనిదియుఁ బుష్టినిఁగలిగించునదియు, హృదయమునకు సుఖమునుగలిగించు నదియు, మధురమును, బథ్యమైనదియు, అధిక పరిశ్రమ మొనర్పక అనాయాసముగఁ బ్రాప్తించినదియునగు నాహా రము సాత్వికము. మిక్కిలి చేదు, మిక్కిలి కారము; మిక్కిలి వేడి, ఎక్కువగ నుప్పుకలిగి, తినఁగానే లేక చూడఁగానే

యింద్రియములు చలించునో, ఎంతగాదిన్నను దృప్తికాని దియు, దాహము కలుగఁ జేయునదియు రాజసము. పాసినది యును, నీరసమైనదియును, చదివియు, దుర్గంధము వెలువడు నదియును, ఎంగిలిదియు, అపవిత్రమైనదియును, బరిణామ మున దుఃఖము నొసంగు నదియు నట్టి ఆహారము తామ సాహారము. నా నైవేద్యము నిర్గుణాహారము. ఏలననఁగా దానిని నిర్గుణుఁడనగు నేను భక్షించితిని. ఇదే విధముగ సుఖమును మూఁడు విధములు.'

ఉద్ధవుఁడిట్లడిగెను:-'స్వామీ! సుఖములోగల మూఁడు విధములను గూడ నాకుఁ జెప్పవలయును.'

భగవానుఁడిట్లనెను:-'ఆత్మవలనఁ బ్రాప్తించుసుఖము సాత్వికసుఖము. దానికి బాహ్యవస్తు వేదియును అక్కఱ లేదు. ఏకాంతమునఁ గూర్చుండి ఆత్మచింతన మొనర్చు చుండిన నశ్రువులు రాలుచుండ, కంఠము గద్గదికముకాఁగా నప్పుడు కలిగిన సుఖము సాత్వికసుఖము. సుందర నృత్యమును గాంచినను, సుఖకరమగు నాటకమును గాంచినను, సుందర స్త్రీ పురుషులను, బాలకులను, ఇంకేవైన బాహ్యవస్తువులను గాంచినను గలుగు సుఖము రాజససుఖము. వ్యభిచార పురుషులను, వ్యభిచారిణీ స్త్రీలను, పుత్రాదులును, బంధు వులనుగాంచి మోహములోఁ బడిపోయినను, ఎవరికడ నైనను దీనతతో యాచించినపుడు వారేదైన నొసంగిన

గల్గు సుఖమును, దీనత్వమును బ్రదర్శించి కార్యసిద్ధినిఁ గలుగఁజేసికొనిన సుఖమును దామససుఖము. ఇట్లీవిధముగ ద్రవ్యమును మూఁడు విధములుగ నుండును.'

ఉద్ధవుఁడిట్లడిగెను :-'ద్రవ్యము మూఁడు విధములుగ నెట్లుండును?'

భగవానుఁడిట్లనెను :-'సత్వగుణము నుత్పన్న మొనర్చునది. సత్వగుణ ద్రవ్యము, రజోగుణము నుత్పన్న మొనర్చునది రాజసము. తమోగుణము నుత్పన్నము గావించునది తామసము. అనాయాసముగ, నేవిధమగు యాచన మొనర్పక సరళముగ, శుద్ధముగ ధర్మపూర్వకముగ లభించినది సాత్వికము. యాచింపఁగా నత్యంత ప్రయాసమున ననేక యుక్తులతో నితరులకు హానికలిగించి సంపాదించినది రాజసము. ఛల, కపటములచేతను, బలవంతమునను, నానా విధములగు ననుచితోపాయముల చేతను, ఇతరులతోఁ బోట్లాడి సంపాదించినది తామసము. ఉద్ధవా! ఇంకెంతని చెప్పఁగలను? దేశ, కాల, ఫల, స్వభావ, కర్తా, కరణ, క్రియా, నిష్ఠా, వ్యవహారములన్నియును త్రివిధములే. అన్నిటికిని సాత్విక, రాజస, తామస భేదములు కలవు. వీని నన్నిటిని లెక్కించుట చాల కష్టము. ప్రకృతి అధిష్ఠానమునఁ గనఁబడు నవియు, వినఁబడు నవియు, నూహింపఁబడునవియు, సూక్ష్మాతి సూక్ష్మబుద్ధి ద్వారా తెలియఁబడు పదార్థము లన్నియును త్రిగుణమయములు.'

ఉద్ధవుఁడిట్లడిగెను :-'స్వామీ ! ఈ త్రిగుణమయ సంసార బంధనము జీవునకేల ప్రాప్తించుచున్నది?'

భగవానుఁడిట్లనెను :-'ఉద్ధవా! ప్రపంచములోనికర్మలన్నియును త్రిగుణాత్మకములే. ప్రాపంచిక కర్మలన్నియును నవశ్యము సంసారమును ప్రాప్తింపఁజేయును. బ్రహ్మలోకము కానిండు, స్వర్గము కానిండు, నరకము కానిండు, మర్త్యలోకము కానిండు, అందఱును గర్మకు వశీభూతులై సంసారములోనికివచ్చినానా యోనులలోఁ దిరుగుచుందురు.'

ఉద్ధవుఁడిట్లడిగెను :-'అయితే స్వామీ! జీవునకే సంసార చక్ర మెన్నటికిని విడివడదు. ఏలననఁగా నే ప్రాణియును గర్మచేయక ఒక్క క్షణమైనను నుండఁజాలడు'.

భగవానుఁడిట్లనెను:- 'ఏల వదలదు? ఈ గుణములను జయించినచో జీవుఁడీ సంసారమును వెంటనే జయింపఁగలఁడు. బంధమును వీడి ముక్తినిఁబొందగలఁడు.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'స్వామీ! ఈ గుణము లెట్లు జయింపఁబడును?'

భగవానుఁడిట్లనెను:- 'భక్తియోగము ద్వారా యీ గుణములు జయింప వీలగును. జీవి సమస్త ఆశలను వదలి సచ్చిదానంద ఘనుఁడనగు నాయందు మాత్రమే సమస్త వృత్తులనుంచునో, నాకొఱకే సమస్త కార్యముల నొనర్చునో నాయందనన్య నిష్ఠనుంచు నా భక్తుఁడు నా స్వరూపమును

బొందును. కావునఁ దీవ్ర ప్రయత్నముతో నీగుణములను జయించుము.'

ఉద్ధవుడిట్లడిగెను:- 'స్వామీ! తీవ్ర ప్రయత్నమన నేమి?'

భగవానుఁడిట్లనెను:- 'ఈ గుణసంగ రూపమగు సాంసారిక సుఖములకుఁ దిలాంజలులొసంగి, అహర్నిశము నన్నుఁ జింతించుచు, నా భజనమొనర్చుచు, నా నామ గుణములను గీర్తింపవలయును. ఎంతని చెప్పఁగలను. ఏదిచేసినను నన్నుద్దేశించి చేయవలయును. ఏలననఁగా జ్ఞాన విజ్ఞాన ప్రాప్తి సాధనమగు నీ మానవశరీరమున కిదియే శ్రేష్ఠమగు పరమ పురుషార్థము. దీని ద్వారానే భగవానుని యొక్క సాక్షాత్కారమును బొందనగును.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'అయితే స్వామీ! అప్పటి కప్పుడు గుణాతీతుఁడెట్లు కాఁగలఁడు? మనము గుణముల లోనే పుట్టితిమి గుణములలో వర్తించుచున్నాము. ఒక్కసారిగా గుణాతీతుఁడగుట యనఁ గల్పనాతీతమే కాఁగలదు. ఊహింపనైన నూహింపరాదు.'

భగవానుఁడిట్లనెను :- 'ఒక్కసారిగా గుణాతీతుఁడగునని యెవఁడన్నాఁడు. విచారశీలుఁడగు బుద్ధిమంతుఁడగు వివేకి ముందుగా రజోగుణముద్వారా తమోగుణమును జయించి, అంతసత్వగుణము ద్వారా రజస్సును, దమస్సును

జయింపవలయును. సత్త్వము వృద్ధియైనకొలఁది క్రమక్రమముగా నింద్రియములను వశమొనర్చుకొని, వానిని సంయమనమొనర్చుకొని, ప్రమాదవశమున విషయముల వైపునకు మనస్సు పోయినచో, విషయాసక్తినుండి మనస్సు నీవలకు లాగివేయవలయును. చిత్తమును విషయములనుండి తొలఁగించిన కొలఁది, వానియందలి ఆసక్తి తగ్గిపోవుచుండును. మనస్సాధారము లేక నిలువఁజాలదు. దీనికేదో ఆధారముండి తీరవలయును. కావున నన్నే ఆధారముగఁ బెట్టుకొనవలయును. నాయందే మనస్సునుంచవలయును. నిరంతరము నా భజన ధ్యానముల నొనర్చుచుండవలయును. ఈవిధముగఁ బూర్ణ సత్త్వగుణ మేర్పడినచో దానియందును నాసక్తినిఁ దీసివైచి శాంతచిత్తము, నిరపేక్షభావముతో శాస్త్రములోఁ జెప్పఁబడిన నానాయుక్తులద్వారా సత్త్వగుణముపైనను విజయమును బొందవలయును.

ఉద్ధవుడిట్లడిగెను:–'స్వామీ! సత్త్వగుణమునుజయించు యుక్తి యేది?'

భగవానుఁడిట్లనెను:– 'ఎవఁడు దేనిని ధ్యానించుచుండునో అతఁడదియే యగును. నేను గుణరహితుఁడను. నిరంతరమునన్ను ధ్యానించినచో జీవుఁడు తన జీవత్వమును వదలి నన్నే పొందును. ఇంతవఱకు జీవుఁడు తానపూర్ణుఁడననుకొనుచుండెడివాఁడు. ఏలననఁగా నాతఁడు లింగశరీర

రూపమగు ఉపాధితోఁ గూడుకొనియున్నాఁడు. ఆతఁడతః కరణముతోఁగూడ యీ యుపాధినిఁ బరిత్యజించినచోఁ దన యొక్క అపూర్ణతను ద్యజించి, పరిపూర్ణబ్రహ్మనగు నన్నుఁ బొందును అప్పుడాతఁడు బాహ్యవిషయములను గాని ఆంతరంగిక విషయములనుగాని చింతింపఁడు. విషయ రహితుఁడును, గుణాతీతుఁడును, శుద్ధ పరిపూర్ణుఁడును గాఁగలఁడు. నే నత్యంత సంక్షేపమున నీకు గుణములయొక్క కార్యములను గూర్చి చెప్పితిని. గుణాతీతుఁడగుటకు యుక్తిని గూడ చెప్పితిని. ఇప్పుడు నీవేమి వినఁదలఁచుచున్నావు?'

ఉద్ధవుఁడిట్లడిగెను :– 'స్వామీ! ప్రతిదినమును భోగించుచుండినను నీ సాంసారిక విషయములందు వైరాగ్యము కలుగుట లేదు. ఒక్కసారిభోగించిన నింకను భోగింపవలయు ననియే కోరిక కలుగుచుండును. ఇంతేకాదు, ఎంతగా ననుభ వించుచుండిన నంతగా నిచ్ఛ పెరుగుచుండును. దానికేమి చేయవలయును?'

భగవానుఁడిట్లనెను :–'దీనికొక్క ఉపాయము కలదు. దుస్సంగమునుండి చిత్తమును దొలఁగించి సత్సంగమునందు మనస్సునులగ్న మొనర్పవలయును. ఈవిధముగ సత్సంగ ప్రభావముచే, చిత్తము విషయములనుండి తొలఁగును. విషయ వైరాగ్యము కలిగినచో, మనస్సు నాయందు స్వతః లగ్నము కాఁగలదు.'

ఉద్ధవుఁడిట్లడిగెను :- 'స్వామీ! విషయ వైరాగ్య మెట్లు కలుగును? దయతో నీ యుపాయమును నాకు జెప్ప వలయును. ఈవిషయమును స్పష్టముగ విస్తారముగ జెప్ప వలయును.'

భగవానుఁ డిట్లనెను :- 'మంచిది. ఇప్పుడు నేను నీకు సంసార వైరాగ్యమార్గమునుగూర్చి జెప్పెదను. ఈ విష యమున ఐలమహారాజు గాథ కలదు దానిని నీవు వినుము.

సూతుఁ డిట్లనెను :- 'మునులారా! ఇప్పుడు నీవు భగవానుఁడు చెప్పిన వైరాగ్యోపాయమునకు సంబంధించిన ఐల గీతను వినుఁడు.'

---

## ఐల గీత

శ్లో॥ ఐలః సమ్రాడిమాం గాథా మగాయత బృహచ్ఛ్రవా।
ఉర్వశీ విరహాన్ముహ్య న్నిర్విణ్ణః శోక సంయమే॥
— శ్రీభాగ. ౧౧ స్కం. ౨౬ అ. ౪ శ్లో॥

వ. 'ఉద్ధవా! అత్యంత కీర్తిశాలియగు ఇలా పుత్రుఁడగు ఐలమహారాజు ఊర్వశీ విరహమునకు విమోహితుఁడై ఆ శోకమంతము కాఁగానే పశ్చాత్తాపముతో నీ గాథను గానమొనర్చినాఁడు.'

— శ్రీ మహాంధ్రభాగవతము.

వాస్తవమున జీవునకు బంధనమేమియును లేదు. విషయసంగముచే నజ్ఞానమునకు వశీభూతుఁడై ఆ గుణములను దనయం దారోపించుకొని, సుఖదుఃఖములను బొందుచున్నాఁడు. ఈ విషయములతో నాకు సంబంధము లేనే లేదని నిశ్చయ మొనర్చుకొనినచో సుఖదుఃఖములుండవు. సర్వత్ర ఆనందమే యుండును. మాయాస్వరూపమును దెలిసికొనక దాని వలలోఁబడినాఁడు. దాని స్వరూపము తెలిసినా లజ్జావతియగు మాయ మరల నా వైపునకు గూడ రాదు. ఈ సంబంధమున నొక కథ కలదు.

ఒక గొప్ప శుద్ధ సదాచారుఁడగు బ్రాహ్మణ యువకుఁడు కలఁడు. ఆతని సమీపమున నొక స్త్రీ నివసించుచుండెడిది. పైకి చూచుట కామె మిక్కిలి సుందరి, సుశీల, లజ్జావతి, గుణవతి, సదాచారిణిగాఁ గనబడుచుండెను. కాని వాస్తవమున నామె వ్యభిచారిణి. ఎవఁడైన సరళుఁడును, నమాయకుఁడును గనఁబడినా ఆతని వలలో వైచుకొనెడిది. ఆమె సర్వసాధారణముగ వేశ్యవలె నుండినచో, మంచివారామె సమీపమునకుఁ బోకుండెడువారు. కాని ఆమె తన వాస్తవిక విషయమును దాచినది. ఆమె లజ్జావదనయై కనఁబడుచుండుటచే నందఱామెనుసదాచారిణిగ భావించుచుండెడివారు. మంచి మంచివా రామె రూపజాలమునఁ బడియు, నామె పులిబుచ్చికపు మాటలకు వశపడి ఆమె వలలోఁబడు

చుండిరి. ఆమె యెవనితో సంబంధమును బెట్టుకొనునో, వానితో మాత్రమే తాను సంబంధమును బెట్టుకొంటినని యెట్టుకొని ప్రమాణములు చేయుచుండెడిది. ప్రపంచమున నీవే నాకు గతియనును. ఆమె తన మాయాజాలము నా సదాచారియగు యువకునిమీదను వైచెను. ఆమె తీపితీపిమాటల కాతఁడు మాయలోఁ బడిపోయెను. ఆమె మోహన రూపమాతని మోహపెట్టెను. ఆతఁడామెను దన ప్రాణములకంటె నధికముగఁ బ్రేమించుచుండెను. నా సర్వస్వము నీవే యని ఆమె ఆతనితో శపథపూర్వకముగ ననుచుండెడిది.

ఒకదినమున నా బ్రాహ్మణకుమారుఁ డకస్మాత్తుగ నామె యింటికిఁ బోయెను. అచ్చట నామెతో నెవఁడో మాటలాడుచుండెను. ఈతఁడు చాటున మెదలక నిలుచుండి వినుచుండెను. లోపల ఒక యువకుఁడును నామెయును దనతో నిదివఱకెట్లు మాటలాడెనో సరిగా నట్లే మాటలాడుచుండెను. ఇప్పుడాతనికి జ్ఞానము కలిగెను. అతఁడిట్లనుకొనెను :–'నేను భ్రమలోఁ బడితిని. ఈ మాయావతి నన్నంధకారముననుంచి, నావద్ద కపటప్రేమనాటక మాడినది' హఠాత్తుగ నామె తలుపును దెఱచిచూడఁగా నాయువకుఁడచ్చటనిలుచుండెను. ఆతఁడు తనమాటలను వినినాఁడని ఆమె తెలిసికొనెను. స్వైరిణికదా, పైగా స్త్రీసులభమగు లజ్జ ఆమెకు గలదు. ఆమె మిక్కిలి లజ్జించెను. తనయథార్థస్వరూపము నా యువ

కుఁడు గ్రహించినాఁడని తెలిసికొనెను. యువకుని మోహము నశించెను. ఆతనికి దన సదాచారముయొక్క పూర్వస్మృతి జాగృతినిఁ జెందెను. ఆతఁడు స్వస్థుఁడయ్యెను. ఇదివఱలో నాతఁడు వచ్చుచుండిన నామెకెంతో సంతోషముగనుండెడిది. ఇప్పుడా యథార్థస్వరూపమును దెలిసికొను నప్పటికి ఆమె కాతఁడు నగణ్యవస్తువయ్యెను. తన సంగతిని దెలిసికొని నాఁడని ఆమె తెలిసికొనఁగానే యింక నాతని కడకామె రానేలేదు. ఇది దృష్టాంతము. ఇఁక దార్ష్టాంతమును వినుఁడు. ఈ మాయయే స్వైరిణియగు స్త్రీ. జీవుఁడే సదాచారియగు యువకుఁడు. ఈమాయా స్వరూపమును దెలిసికొనఁ జాల నంతవఱకు మాటిమాటికిని జన్మించుట తప్పదు. మాయా తత్త్వము తెలిసెనా మాయ యెచ్చటికిని బారిపోదు కాని, అది మన సమ్ముఖమునకు వచ్చుటకు లజ్జించును. అది వెంటఁ బడుట మానివేయును. జీవుఁడీసంసారమున నుండినను వాని నీ సంసారమేమియును జేయఁజాలదు. జీవన్ముక్తుఁడై బ్రహ్మ సుఖము ననుభవించును. మాయనుండి మనస్సుతొలఁగఁగానే సచ్చిదానంద స్వరూపుఁడగు మాయాపతియందు మనస్సు లగ్నమగును.'

సూతుఁడిట్లనెను:- 'మునులారా! ఉద్ధవుఁడు వైరాగ్య మును గూర్చి ప్రశ్నింపఁగా భగవానుఁడిట్లను :- ఉద్ధవా! దరిద్రుఁనకుఁ బరిశ్రమ మొనర్పకయే విపులధనము లభించెనా,

ఆ ధనమునకు మూల్యముండదు. సహజముగఁ బుత్రుఁడు లభించిన నా పుత్రునియొక్క మహత్త్వము అనుభవమునకు రాదు. ఎన్నాళ్ళకును బుత్రుఁడు కలుగక వృద్ధావస్థయందెన్నో నోములు వ్రతములొనర్చి శ్రమపడఁగాఁ గలిగిన పుత్రునిమీద అతి ప్రేమయుండును. అట్లే సహజముగ నా స్వరూప జ్ఞానసాధన రూపమగు మానవశరీరము ప్రాప్తింపఁగా నతఁడు దానిమహత్త్వమును దెలిసికొనఁజాలకున్నాఁడు. అందువలననే అమూల్యమగు నీ మానవదేహమును దుచ్ఛములును నశ్వరములునగు విషయభోగము లనుభవించుటకు వినియోగించుచున్నాఁడు. ఈ మానవ శరీరముయొక్క మహత్త్వము తెలిసెనా, ఆతఁడు మరల నీ క్షణికసుఖములకై తన కాలమును వృథాచేయఁడు. ఆతఁడు సదా సర్వదా భాగవత సేవ, పూజ, ఉపాసన, కథాకీర్తనాది భాగవతధర్మములందే కాలమును గడుపును. ఈవిధముగ నిరంతరము నాపరిచర్యయందేయుండువాఁడు మరల నీసంసారమునకు రాఁడు. ఆతఁడు తన అంతఃకరణమందే నిలిచి సచ్చిదానంద స్వరూపుండ నగు నన్నుఁబొందును.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'అయితే స్వామీ! నీ జ్ఞానము కలుగఁగానే నశ్వరమగు నీశరీరమును వదలునా?'

భగవంతుఁడిట్లనెను :- 'కాదు. శరీరములు వదలిపోవలసిన అవసరమేమున్నది? ఈ శరీరములో నుండియును నా బ్రహ్మానందసుఖము ననుభవింపవచ్చును.'

ఉద్ధవుఁడిట్లడిగెను :-'అప్పుడీ మాయయొక్క త్రిగుణము లాతని బాధింపవా ?'

భగవానుఁడిట్లనెను :- 'గుణవతియగు మాయాజాలమున్నంతవఱకే జీవునకు జీవత్వము. జ్ఞాన నిష్ఠద్వారా ఆతనికి త్రిగుణాతీతుఁడనగు నాయొక్క యథార్థజ్ఞానము కలుగఁగా నీ మాయాగుణము లన్నియును నవాస్తవికములుగఁదోఁచును. ఇంక నాతఁడు వీనివలన నాకర్షింపఁ బడఁడు. పూర్వము రాణుల రక్షణకొఱకు ఉంచఁబడువారు చూచుటకు బురుషులవలెనే (ఖోజాలు) ఉందురు. కాని వారి పురుషత్వము నశింపఁ జేయఁబడినది. వారుండుట వలననే యభ్యంతర ముండఁజాలదు. వేయించిన గింజలు చూచుటకు మంచివి వలెనే యుండును, గాని అవి మొలవవు. అదే విధముగ గుణములయొక్క అవాస్తవికత తెలియఁగానే మాయామాత్రములగు గుణములలో నుండినను మానవుఁడు వానిలోఁబడఁడు. ఆతఁడు నిర్లిప్తుఁడై యుండును.'

ఉద్ధవుఁడిట్లడిగెను :-'స్వామీ! మానవుఁడే సులభ, సరళ సాధనద్వారా మాయాచక్రమునఁ బడకుండును ?'

భగవానుఁడిట్లనెను :-'ఉద్ధవా! నేనీ ప్రశ్నకు సమాధానము ననేకసార్లొసంగియున్నాను. మరల నొసంగెదను. నీవు నిరంతరము విషయ సంగమమున నుండినచో విషయములలోఁబడి పోయెదవు. నిశ్చయముగఁ బడెదవు.

కావున విషయదాసులై, పొట్టను నింపుకొనుటయును, గామ
వాసనను దృప్తిపఱచుటయును, బరమ పురుషార్థముగ
భావించు శిశ్నోదర పరాయణుల స్నేహమును బొరపాటున
నైనను జేయరాదు. త్యాగులును, సదాచారులును, జితేం
ద్రియులును, సత్పురుషులు నగువారి సంగమును జేయవల
యును. ఉద్ధవా! నీవు విచారించుము. నీకేమియును మార్గ
మును దెలియక, కన్నులతోఁ జూడఁజాలకుండిన మంచి
దృష్టి కలిగి వారి ననుసరించి, వారివెంటఁ బోయినచో
నవశ్యము గంతవ్య స్థానమును జేరుకొనఁగలవు. అట్లుగాక
అంధుని వెంటఁబడి పోయినచో నాతఁడును గూపమునఁ
బడును. వెంటనే నీవును బడిపోఁగలవు. విషయములకు
దాసుఁడైన వానివెంటఁబడి పోయినచో నీవును విషయా
సక్తుఁడవై పోయెదవు. వారు పరదారా పరధనముల వెంటఁ
బడి తిరుగుచుందురు. తనవంటి వారిని వెంటఁబెట్టుకొని
అమాయకులైన వారిని మోసగించి, వారిని శిష్యులుగఁ
జేసికొని తామును నరకమునఁ బడెదరు. తమవెంటతమశిష్యు
లను నరకమునఁ బడవైచెదరు. కావునయథార్థమగుబరమార్థ
లాభమునుబొందగోరువారువిషయలోలుపులును,లోభులును
గాముకులునగు వారివెంట నెన్నటికినిఁబోరాదు. ప్రపంచము
నందు యథార్థమగు వైరాగ్యము కలుగనంత వఱకు, తల
లను బోడులొనర్చుకొన్నను, జడలను బెంచినను, గుడ్డలకు

రంగునై చుకొని యెన్నిమాలలు త్రిప్పుచుండినను మనస్సు విషయముల వైపునకుఁ బరువిడుచునే యుండును. భగవత్కృపచే విషయ వైరాగ్యము కలిగినచో నీ విషయము లన్నియును విషమువలెఁ దోఁచును. పురూరవునకు విషయ వైరాగ్యము కలుగఁగానే, ఆతనికి క్షణమైనను విడిచియుండని ఆ యూర్వసియే తుచ్ఛముగను, ఘృణితయగు గామినిగను దోఁచెను.'

ఉద్ధవుఁడిట్లడిగెను :-'స్వామీ ! పురూరవ చక్రవర్తికి ఊర్వశియందు ప్రేమ యెట్లు కలిగినది ? ఆతని కామె కారణమున వైరాగ్యమెట్లు కలిగినది ?'

భగవానుఁడిట్లనెను:-'పురూరవ చక్రవర్తి ఇలా తనయుఁడు. ఆతఁడు మిక్కిలి సుందరుఁడు. ఒక దినమున స్వర్గసుందరియగు నూర్వశి ఆతని రూపమును గాంచి మోహితయైనది. ఆతఁడును నామె రూపమునుగాంచి మోహితుఁడయ్యెను. ఊర్వశి శాపవశమున రాజునకు భార్యయైనది. రాజామెను దన ప్రాణములకంటె నెక్కుడుగఁ బ్రేమించుచుండెను. నియమము పూర్తికాక మునుపే ఊర్వశి రాజును వదలి వెడలిపోయెను. రాజున కాభోజులు మంచివి కావు. రాజు యశస్వి. సప్తద్వీపవతియగు వసుంధర కేకైక చక్రవర్తి. గొప్ప గొప్ప మహారాజులు తమ సువర్ణ మండిత మణిమయ కిరీటములచే నాతని చరణములకుఁ బ్రణామ

మొనరించు చుండురు. అయినను నాతఁడు స్వర్గ సుందరి యగు నామెయందు విమోహితుఁడై, ఆమె వెంట విహ్వలుఁడై, ఉన్మత్తునివలె, దిగంబరుఁడై పరువిడుచు దీనుఁడై మాటి మాటికి నిట్లు పలుక నారంభించెను:–'ఓసీ! కఠోర హృదయా! కామినీ! కొంచెము సేపాగి నా రెండు మాటలను వినిపొమ్ము. నీవు లేక నేనెట్లు జీవింపఁగలను?' కాని యా స్వర్గసుందరి రాజు మాటలను వినిపించుకొనకపోయెను. రాజు మూర్ఛను జెందెను.

భగవానుఁ డిట్లనెను :- ఉద్ధవా! ఈ క్రూర కాముని పనినిఁ జూడుము. ఏయూర్వశితో మహారాజు వర్షములకొలది యుండెనో, దేనియం దాసక్తినిఁ జెందుటచే నెప్పుడు తెల్లవారినదో, యెప్పుడు ప్రొద్దుక్రుంకినదో ఆతనికిఁ దెలియదు. నిరంతర మామె అధరామృతపాన మొనర్చినను ఆతనికిఁ దృప్తి కలుగలేదు. ఆతఁ డామెతో నొక్క క్షణమైనను గలిసియుండినఁజాలునను వ్యగ్రతతో నుండెను. ఈ కామము యొక్క విడంబన మెట్టిది? ఆ అప్సరసయొక్క విరహము నందు జాలదినముల వఱకు విహ్వలుఁడై యుండెను. చివరకు రాజునకు శోకము నశించెను. ఆతనికి విషయవైరాగ్యము కలిగెను. ఏ యూర్వసియొక్క అంగములను గాంచి యింత వఱకును రాజు విహ్వలుఁడగు చుండెనో, యిప్పుడా యంగములే ఆతని కేవగింపుగా నుండెను. ఆ వైరాగ్య సమయ

మున రాజు తన్నుఁదాను దూషించుకొనుచు నిట్లు గీతమును గాన మొనర్చె.

**1**

గీ. అయ్యో! ఈ జీవనము వృథాయయ్యె నాకు
మోహమదిరను ద్రావి విమోహమునను
కామినీ వల జిక్కితి; ఘన నృపాల
వందిత పదారవిందుఁడ వనిత నన్ను
ఖగమృగాదులవలెను మర్కటమురీతి
నాటలాడించె; ఇప్పుడు నన్ను బాసి
ప్రేమ విడనాడి చనియెను; వికలముననను
వస్త్రభూషణముల వీడి పడతి వెంటఁ
జడితి సిగ్గును వీడి; నా పౌరుషంబు
ఓజబలము గుణమ్ములు తేజమెల్ల
వీడిపోయెను నా తెల్విఁ మాడిపోను
వందఁ జెందితి బుద్ధి ఆవంత లేదు.

**2**

మనస్సున స్త్రీ యొక్క అధరామృతపాన మొనర్పఁ దలఁచు వానియొక్క జపతపములును, దానధర్మాదులును, వేదశాస్త్రాధ్యయనమును, సకల సాధనమును వృథా. స్త్రీకి లొంగనంతవఱకే శీల. సంకోచ, సరళతా, జాతివర్ణకుల

ధర్మములు నడుచుట. కులటారూపమునకు వశపడిన జారునకు ధిక్కారము. స్త్రీ శరీరములో చర్మాస్థిమాంస, వసాదులేకదా ఉన్నది. దీని కంటె భగవంతుని భజించుట మంచిది.

## 3

ఓ మూఢమనస్సా! అతి అశుచియు, మూత్ర మల నిలయమునగు దానివలన నీవు సుఖమును గోరుచున్నావా? అమాయకపు పక్షులవలెఁ గామినీవలలలో జిక్కనేల? అమృత లతయని విషలతను దిని పశువెట్లు బాధపడునో అట్లే చంద్రవదన వదనమును గాంచి, కాముకుఁడవై తెలియకున్నావు. ఇది అధమ పశువుయొక్క లక్షణము.

## 4

ఓ మూఢమనమా! నీవు స్త్రీయొక్క దేహమును బరమ ప్రియముగ భావించుచున్నావు. అది మల, మూత్ర, రుధిర, మజ్జా, కఫాది దూషిత వస్తువులకు నిలయమైనది. వీనిని నీవు సుధానిలయమువలెఁ గాంచుచున్నావు. ఆమె ముఖమును, గన్నులను గాంచుచు నీవు నీరాణిగా భావించుచున్నావు. స్నేహమును దృణమువలెఁ ద్రెంపి క్షణములో విరాగివైతివి. పూలమాలయనుకొని సర్పమును భ్రమవశమునఁ గౌఁగిలించుకొంటివి. ఆమె యెప్పుడు వచ్చినదో,

యెప్పుడు పోయినదో కాని కథ మాత్రము మిగిలినది. ఇదంత యును మాయ ఆడించినది. ఇది పురాతనపు మోసకత్తెయే. ఓ మాయాపతీ! గిరిధరా! యదువరా! నన్ను రక్షింపుము.

# 5

జగద్విషయములు మిక్కిలి బలవత్తరములైనవి. కల్యాణమును గోరువాఁడు వీని విషయమున జాగ్రత్తగ నుండవలయును. విషయాసక్తులు విషయములను గూర్చియే చెప్పుచుండును. వాని గుణమును గూర్చి పొగడుచుండును. కావున విషయాసక్తుల సంగమును బూర్తిగా వదలి వేయ వలయును. మనస్సే మనకు గొప్ప శత్రువు. ఇది బలవత్తర మైనది. నీవీ బాధలనుండి బయటపడఁదలఁచినచో దీన బంధువగు భగవంతుని చరణములను గట్టిగా పట్టుకొనుము.

భగవానుఁడిట్లు చెప్పుచున్నాఁడు:- 'ఉద్ధవా! ఈ విధముగ నూర్వసియొక్క వియోగముచే మహారాజునకు మిక్కిలి ఆత్మగ్లాని కలుగఁగా నాతఁడు మాటిమాటికినిఁ దన్ను దూషించుకొనుచుండెను. ఆతనిపై నాకృప కలిగినది. అతనికి విషయభోగములయొక్క యథార్థజ్ఞానము కలిగినది. ఆతఁడు మాటిమాటికిని దీర్ఘ నిశ్శ్వాసములను విడుచుచు నిట్లనుచుండెను:- 'అయ్యో! నేను గొప్ప పండితుఁడ నను కొంటిని. కాని నేనతి మూర్ఖుఁడను. రాజరాజేశ్వరుఁడనయ్యు

పృథివిని శాసించువాఁడనైనను, రక్షకుఁడను, బాలకుఁడ
నైనను గామినీ క్రీడామృగమునైతిని. ఆమె సంకేతముల
నాడనారంభించితిని. నేను నా బుద్ధిని, విచారశక్తినిఁ
గోల్పోయితిని. నేను గుఱ్ఱము, గాడిదె, ఆఁబోతులవలె
నన్నిటిని మఱచి కామినీ వెంటఁబడితిని. నేను గోరినదేమి?
ఆమె ఒక్కసారి ననుఁగలిసిన జాలుననుకొంటిని. ఒక్కసారి
కలిసినదానితోఁ దృప్తిలేదు. కామవాసన యింకను వృద్ధి
పొందును. అగ్నిలో ఘృతాహుతమొంతవైచిన నంతగా నది
వృద్ధినిఁ జెందును. ఒక్కసారి ఆమె కలియుటచేఁ దృప్తి
కలిగినచో నాఁమె నాకడ నెన్నోవత్సరములున్నది. అయినను
నాకొక్కక్షణమైనను దృప్తి కలిగినదా? నా మనస్సును నా
కులటా కామిని దొంగిలించినది. ఇప్పుడు నే నెవరిని శరణు
జొచ్చిన శాంతి లభింపఁగలదు. అటువంటి సంబంధియును
సుహృదుడును నెవఁడున్నాడు ప్రపంచమందలివారందఱును
స్వార్థులే. వారి మైత్రి స్వార్థసాధన నిమిత్తమై యుండును.
సకల మునిజన హృదయారవింద నివాసుఁడును, భక్తజన
రక్షకుఁడునునగు సర్వేశ్వరుఁడు మాత్రమే నన్నిపుడు
రక్షింపఁగలఁడు. ఆతని శరణువేఁడినచో నిజమగు శాంతి
లభింపఁగలదు. అయ్యో! ఆ కామిని నాకుముందే స్పష్టముగ
చెప్పినది. తాను స్వైరిణియనియు, నెవనికిని బంధింపబడి
యుండదనియుఁ జెప్పినది. తాను నిత్యమును నూతన పతులను

గోరుకొందుననెను. నేను జాతి, కుల, విద్యా, ఐశ్వర్య, స్థానాస్థానములు, శుచి, అశుచి, సమయాసమయముల విచారమొనర్పనని మొదటనే చెప్పినది. ఎచ్చటనైనను, ఎవ్వరికడనైనను, నెప్పుడైనను దనకు గామసుఖములభించునో అచ్చటికిఁబోవుదుననెను. ఈ విధముగ నామె నిజమగు వచనములను బలికి, నన్ను సచేతునిఁగావించెను. కాని నా బుద్ధి బండబాఱిపోయినది. నేను గామాంధుఁడనై నా వివేక శక్తినిఁ గోల్పోయితిని. నాకామె శబ్దమమృతము వలెఁ దోచినది. దానివలన నా మోహము తగ్గుటకు బదులుగా వృద్ధియయ్యెను. ఆమె మాటిమాటికి ఇట్లనుచుండెడిది.

ఆమెను నేను దోషమెంచను. ఆమెను దోషమెన్నుట కేవిధమగుఁగారణమును లేదు. వంకరపడియుండిన త్రాటిని సర్పమనుకొనిన నాదోషము త్రాటిది కాదు కాని అట్లు భావించినవానిదే. నేను నాయింద్రియములను వశమందుంచు కొనినఁ జిత్తమును జంచలముగఁ జేసికొనకుండిన, నామె కవకాశమీయకుండిన, ఆమెను స్పర్శింపకుండిన నామె బల వంతము చేయదు. నేను తెలిసి తెలిసి సంతోషమున విష పాన మొనర్చితిని,

అయ్యో! నేను మోసపడితిని. నా సర్వస్వమును గోల్పోయితిని. నేను దేనికినిఁ బనికిరాకపోతిని. నామతి చెడిపోయినది. నే నంధుఁడనైతిని.సుఖమునైనను నే నపవిత్ర

వస్తువుమీఁద భావించితిని. ఏశరీరముయొక్క అంగప్రత్యంగ ములనుండి దుర్గంధము వెలువడుచుండునో దానిని నేను సుఖ సాగరముగ భావించితిని. దేనిని నే నధరామృతమని పాన మొనర్చితినో, చర్మముచేఁ గప్పఁబడిన నెత్తుని మాంసము ఎంగిలిచేఁ గూడుకొన్నది. వివేకియగువాఁడా అపవిత్రవస్తువు వైపునకు కన్నులనెత్తి చూడఁగలఁడా? కాని నేను దానిని నా సర్వస్వమనుకొంటిని. మూత్ర రక్తములతోఁ దడిసిన యంగములను బొంది నేను సంతోషించితిని. మలమునందలి, రక్తమందలి, చీమునందలి కీటకములు వానిలో నుండియే సుఖానుభవమును జెందుచుండును. ఆ మల, రక్త, చీముల యందుగల పురుగులకును నాకును భేదమేమి కలదు? నేను మాటిమాటికినిఁ ప్రేమ ప్రేమయని యఱచు చుందును. ప్రేమయే అఱచుచున్నట్లుండెను. ప్రేమశబ్దమునుగూడపాడు చేసితిని. అవమానించితిని. ప్రేమ నిత్యవస్తువు. భగవంతుని స్వరూపము. ప్రేమింప వలసినది ప్రభువును. అసత్తును, మలినమును, పరమఘృణితమగు నీ శరీర మెక్కడ? సత్య, శుద్ధ, సర్వశ్రేష్ఠమగు ప్రేమశబ్ద మెక్కడ? నే నమృతము నందు విషమును బోసితిని. హాలాహలమును సుధయని సంబో ధించితిని.'

ప్రేమ భగవానుని రూపము. కాని యీ శరీర మేమున్నది. దీనివిషయము తెలియదు. తల్లిదండ్రులు పుత్రుని

శరీరము తమ రజోవీర్యములచే నేర్పడినవి కావునఁ దమదని అనుచుందురు. మీరు కన్నను నేనగ్నిసాక్షిగాఁ బెండ్లాడితిని కావున నా ప్రాణనాథుఁడీతఁడని భార్య యనును. ఎవరివద్ద పనిచేయునో ఆతఁడు నే నీతిని ద్రవ్యమొసంగి క్రయ మొన ర్చితిని గావున నీ శరీరము మీఁద నా కధికార మున్నదని యజమాని యనును. నక్క, గ్రద్ద, కుక్క, అన్ని యిట్లం దురు – మాయిష్టము వచ్చినట్లు వాగుకొనుఁడు. ఎవ రేవస్తు వును దినెదరో అది వారిది. చివరకు దానిని మేము తినవలసి నదే. ఈవిధముగ నీ శరీరమునకు జాలమంది గ్రాహకులు కలరు. చివరకు మిగులున దేమియును లేదు. కాని పిడికెడు బూడిదె కాఁగలదు. ఈ యనిత్య శరీరమునకై స్త్రీ పురుషులు చచ్చుచున్నారు. నీవు నా జీవనము. నా సర్వస్వము. నా ప్రాణనాథుఁడవు పురుషుఁడిట్లను – 'నీవు చంద్రవదనవు – మృగనయనివి. విపుల జఘన కలదానవు. కమలనయనివి. నాకు ప్రాణప్రియవు నీ మందహాసము ముందు సర్వస్వమును త్యాగ మొనర్పఁగలను. కామునియొక్క క్రూరక్రీడ యెట్టిది? మాయయొక్క మమతా పూర్ణుఁడగు మోహాంధ పుత్రుఁ డెక్కడ? '

దీనికి ముఖ్యముగఁ జేయవలసిన పనిఒక్కటే. ఇంద్రి యములను విషయములమీఁదకు బోనీయక విరక్తుఁడు కావల యును. విషయములు, ఇంద్రియముల సంయోగము చేత నే

మనస్సునందు వికారము జనించుచున్నది. తాను విననట్టియు, జూడనట్టియు, అనుభవింపనట్టియు విషయముల మీఁద మనస్సు పోనేపోదు. కావున సాధ్యమైనంత వఱకు ఇంద్రియములకు విషయ సంయోగమును గలుగనీయరాదు. ఇట్లు చేయుటచేఁ గ్రమక్రమముగఁ జిత్తచంచలత నశించును. మనస్సు స్థిరముగను, శాంతముగను నగును. కావున సాధ్యమైనంతవఱకు కాముకులయొక్కయుఁ గామినులయొక్కయు సాంగత్యము జేయరాదు. పొరబాటున వీరిసంగ మొనర్చినచో నాతఁడు నిశ్చయముగఁ బతనమై పోవును. మనస్సు స్వాధీనమైనదని పొరబాటుననైన నమ్మఁగూడదు. గొప్ప గొప్పజ్ఞానులును, ధ్యానులును, వివేకులును దామ జయించినాముని అభిమానమును జెందఁగానే, వారినిఁ బతనము కావించి వారియభిమానమును నాశన మొనర్చును. కావున నేనా యప్సరసను జింతింపక నిరంతర మచ్యుతునిఁ జింతించెదను. ఆతని శరణు వేఁడెదను.'

భగవానుఁడగు శ్రీకృష్ణచంద్రుఁ డిట్లనెను:- 'ఉద్ధవా! ఈవిధముగఁ బురూరవుఁడు ఊర్వశీ లోకమును వదలిపెట్టి పోయి, తన యంతఃకరణమం దాత్మస్వరూపముగ నుండిన పరమాత్మనగు నన్నుఁగుర్తించి సుఖశాంతులను జెందెను. రాజున కింతటి మోహము సంగమము వలననే కలిగినది. కావునఁ బరమార్థేచ్ఛ కలవాఁడును గాముకులతో సంగ

మొనర్పరాదు. కామినుల యందుగల మనస్సును భగవద్భక్తులయం దుంచవలయును. సాధుసంగ మొనర్పవలయును. వారితో స్నేహమును ననురాగమును గలిగి యుండవలెను. నిరంతరము సాధువులకడకుఁ బోవుటచేఁ బరమార్థమునందు నీకు రుచికలుగును. సాధువులు భాగవతకథలను వినిపించుచుందురు. సదుపదేశములనొసంగుచుండెదరు. దీనివలన మనస్సునందలి విషయాసక్తి నశించిపోవును.'

ఉద్ధవుఁడిట్లడిగెను :- 'స్వామీ! మీరు దుస్సంగ పరిణామమును గూర్చి చెప్పితిరి. ఇప్పుడు సత్సంగమహిమమును గూర్చి చెప్పవలయును. సాధువు కడకు బోయినచో నేమి లాభము కలుగును?'

భగవానుఁ డిట్లనెను :- మంచిది ఉద్ధవా! ఇప్పుడు నేను నీకు సత్సంగమాహాత్మ్యమును గూర్చి చెప్పెదను.'

సూతుఁ డిట్లనెను :- 'మునులారా! భగవానుని మాటలలో మీరందఱును సత్సంగ మహిమమును శ్రవణ మొనర్చుఁడు.'

---

# సాధు సమాగమ మాహాత్మ్యము.

శ్లో॥ సంతోఽనపేక్షా మచ్చిత్తాః ప్రశాంతాః సమదర్శినః ।
నిర్మమా నిరహంకారా నిర్ద్వంద్వా నిష్పరిగ్రహాః॥

తేషు నిత్యం మహాభాగ ! మహాభాగేషు మత్కథాః।
సంభవంతి హితా నృణాం జుషతాం ప్రపునన్త్యఘమ్॥

—శ్రీభాగ. ౧౧ స్కం. ౨౬ అ, ౨౮ శ్లో॥

వ. ఉద్ధవా! సాధువులు, నిరపేక్షులు, నాయందు మనస్సునుంచువారు, ప్రశాంతులు, సమదర్శులు, నిర్మములు, నిరహంకారులు, నిర్ద్వంద్వులు, అపరిగ్రహులుగనుందురు. మహాభాగా! ఆ సాధుపురుషులకడ నిత్యమును నా భాగవత కథా ప్రవచనములు జరుగుచుండును. ఆ కథలు మానవులకు హితకారులగును. వానిని సేవించువారల సమస్త పాపములను నాశమొనర్చును.

—శ్రీమదాంధ్ర భాగవతము.

ఈ జగత్తు భావమయము. మానవుఁడే భావన చేయునో అట్లే అగును. శరీరము పరమాణు పుంజము. ఎట్టి పరమాణువులు దానిలో నేర్పడి యుండునో, అది అట్టి ప్రభావమును నలువైపులను స్థాపించును. ఒక వ్యాపారి యుండెను. అతఁడు వ్యాపార మొనర్పఁగా నాతని అణు పరమాణువులందు వ్యాపారమే ప్రవేశించెను. అతఁడెచ్చటఁ గూర్చుండినను వ్యాపారమును గూర్చియే చింతించుచుండును. ఇసుకలో గూర్చుండఁ బెట్టిన నిసుక వ్యాపార మొనర్ప యుక్తి నాలోచించును. అతనికడ నెవరినిఁ గూర్చుండబెట్టినను వ్యాపారసంకల్పమే కలుగును. భిక్షుకుని దగ్గఱ గూర్చుండిన

భిక్షమెత్తు నుపాయములు తోఁచును. ఎవనియొక్క ఆలోచన లెంత బలవత్తరములుగనుండునో, వాని యాలోచనలు బలవత్తరములై నిర్బల విచారములు కలవారిపై పడును. ఒకానొకఁడు దొంగతనము చేయుచుండును. వాని ఆలోచనములు దృఢములయ్యెను. ఇంకొకఁడు దొంగతనము చేయుట తప్పని భావించును. కాని జీవనమునకై వివశుఁడై, బలహీనపుటాలోచన కలిగి తానును దొంగతనము చేయవలయునని సంకల్పించెను. దైవవశమున నాతనికా దృఢ విచారముగల దొంగ లభించెను. ఆతఁ డీతనిపైఁ దనసహానుభూతినిఁ జూపించెను. ఇప్పు డాతని దృఢ విచారము లీతని నుత్తేజితము కావించెను. ఆతఁడును దొంగయయ్యెను. దొంగల ముఠా యీ విధముగనే యేర్పడుచుండును. వారిలో నందఱును దొంగలుగ నుండరు. దళపతి ప్రభావముచేఁ బ్రభావితులై వారికిట్టి భావములు కల్గును.

ఒకానొక ఋషి కొన్ని వేల సంవత్సరములు తపస్సుచేసి చివరకొక్క అప్సర వలలోఁ బడినాఁడని చదువుచుందుము, వినుచుందుము. ఇదియును నంతే. ప్రాణిమాత్రుని హృదయములోఁ గామము హృదయమందు స్వాభావికముగ నుండును. దాని నణఁగఁద్రొక్కి తపస్సును జేయును. కామవాసన ఉత్పన్నమైనపుడు దాని నాతఁడణఁచును. శుద్ధమగు నాచరణముగల స్త్రీ ఆతని కడకు బోయినచో నాతని

కేభావమును నుత్పన్నము కాదు. ఏలననఁగా నిద్దరి పరమాణువులును శుద్ధములు. అప్సరసలయొక్క స్వభావము కామము. వారు స్వర్గమందలి వారలకు కామసుఖమును గలిగించుటయే వారివృత్తి. స్వర్గమందలి పురుషుల సాంగత్య మొనర్చుటచేఁ గామ సంస్కారములు సుదృఢములగును. వారు వచ్చి తపస్వులు, ఋషులు, మునులకడ వినయమును జూపి, సేవా శుశ్రూషలొనర్చుచుందురు. ప్రేమయొక్క ఆకలి ప్రపంచమున ప్రాణిమాత్రులకుండును. విశేషించి స్త్రీలయందుండును. వారు తపస్వుల యెడలఁ బ్రేమను బ్రదర్శించినచో వారికాకర్షణము కలుగును. వారాతని సాంగత్యమునకుఁ బోఁగానే యింతవఱకునణఁగి యుండినఁ గామభావములు ప్రబల పరమాణువులను బొంది పెల్లుబుకును. సమ్ముఖమునఁ గామాహారము దొరకఁగనే అత్యధిక ఉత్తేజనా పూర్ణులగుదురు.

శుభ విచారముల స్థితియు నింతే. సంసారముయొక్క అనిత్యతనుగాంచిన నందఱకును గొలఁదిగనో గొప్పగనో అవశ్యము వైరాగ్యము కలుగును. అందఱును శాంతినిఁ గోరుకొందురు. కాని గృహస్థులకు సాంసారిక జంజాటములచే వైరాగ్యము నిలువదు. చిత్తమును శాంతినిఁ జెందదు. సాధు మహాత్ములు నిరంతరము సంసారము నశ్వరమైనదని వైరాగ్య విషయములను చింతించుచుందురు. వారు మనస్సు

నేకాగ్రముగను శాంతముగను నుంచుకొనుటకు సంతతము
ప్రయత్నమొనర్చుచుందురు. వారిసమ్ముఖమునకు సాంసారిక
ములగు దెబ్బలను దిని, అశాంత చిత్తముతో మానవుఁడు
వారికడకు బోయినచో, వారివైరాగ్యము యొక్క ప్రబల
పరమాణువులచే నాతనికి వైరాగ్యభావము పెల్లుబుక,
శాంతి ననుభవించును. అవి తొలఁగి పోఁగానే మరల
సాంసారికవిషయములు అట్టిఆలోచనములు వచ్చుచుండును.
ఆ వైరాగ్యభావము శాంతించును. మరల సంసారము జ్ఞాప
కమునకు వచ్చును. విరాగులవద్ద జీవనోపయోగకరములగు,
తమకుఁగావలసిన సౌకర్యములు లేకున్నను వైరాగ్యము
చల్లఁబడును.

ఇంతకుఁ జెప్పఁదలఁచిన దేమనఁగా నెవనికేవస్తువు
అవసరమగునో, ఆతఁడట్టి దృఢవిచారము గలవారి సంగ
మొనర్పవలయును. కామసుఖమును గోరువాఁడు కాముకుల
యొక్కయు, కామినుల యొక్కయు, సాంగత్య మొనర్ప
వలయును. భగవద్భక్తి కలవానికి భగవద్భక్తులగు సాధువుల
సాంగత్య మొనర్పవలయును. సత్సంగమునకు మించిన
సాధనమింకొకటి లేదు. సత్సంగముచేతనే పరమార్థవస్తువు
యొక్క యథార్థప్రాప్తి కలుగును.

సూతుఁడిట్లనెను :– 'మునులారా! ఉద్ధవుఁడు సత్సం
గమునుగూర్చి ఉత్సాహమును బ్రకటింపఁగనే ఆతనికి

జెప్పుచు శ్యామసుందరుఁడిట్లనెను:- 'ఉద్ధవా! ఈ సంసార సాగరమును దరింపవలయునను కోరిక కలవాఁడు సదా సర్వదా సత్పురుష సాంగత్యమొనర్పవలయును. పొరబాటున నైనను గామినీసాంగత్య మొనర్పరాదు. సజ్జనులతో నను రాగమును బెంచుకొనవలెను. ఎవరెవరితో సాంగత్యమొన ర్చునో వారు వారికి దమకుఁబ్రియమగు వస్తువునొసంగుదురు, సాధువులకడ నన్నిటికంటెను బ్రియమగు వస్తువేది? జ్ఞాన వైరాగ్య, భక్తులు. జ్ఞాన వైరాగ్యములు భక్తికి పుత్రులు. భక్తి కలుగఁగాఁనే యీ పిల్లలు తమకుదామే తల్లి వెను వెంటఁ దిరుగుచుందురు. కావున భక్తగణము తమ ఆశ్రితు లకు భగవద్భక్త్యుపదేశము నొసంగెదరు. వెంటనే యీ సంసార వైరాగ్యమును గలుగును. ప్రపంచమందలి సమస్త వస్తువులును నశ్వరములు, క్షణభంగురములు, అశాశ్వత ములు. కావున వీనియందు మోహమును జెందరాదు.' ఈవిధమగు నదుపదేశ మొసంగి, వారి మనస్సునందలి విషయా సక్తిని మూలమట్టముగఁ దుడిచివేయుదురు. సాధువులకడకు బోవువారి కెన్నడును నకల్యాణము కలుగదు.

ఉద్ధవుఁడిట్లడిగెను:-''స్వామీ! సాధువులనుగుర్తించు టెట్లు? వారిలో నేయే విశేషములుండును?'

భగవానుఁడిట్లనెను:- 'సాధువులు దాగి యుండరు. కస్తూరిని దాచిన దాగునా? దాని వాసన కొట్టి తీరును.

సాధువులయొక్క గుణముల లౌకికములుగనుండును. వానినిఁ జెప్పఁబడినఁ బ్రకటముకావు. సాధువులలో సమస్తకల్యాణ గుణము లుండును. వారుగుణనిలయములు. అయినను నీ గుణములు వారిలో విశేషముగనుండును. —

1. నిష్కామము:-

సాధువులు మనస్సులలో సాంసారిక కామనలుండవు. వారేకర్మచేసినను నిష్కామ భావముతోఁ బ్రభుప్రీత్యర్థమై చేయుదురు. ఎవరినైనఁ గలిసికొనిన నిస్వార్థులై పరమార్థ భావముతోఁ గలియుదురు. సమస్త కామనలకును నుద్గమ స్థానమును, గామపూరకుఁడగు శ్రీహరినిఁ బ్రాప్తించినవారికి గోరవలసిన దేమి యుండగలదు? అట్టివారు క్షణికములగు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధయుక్తములగు నీయల్ప సుఖ ముల నేల కోరెదరు?

2. మచ్చిత్తమద్గతప్రాణః-

సాధువులచిత్తము సదా నాయందేలగ్నమైయుండును. పైకి వారు వ్యావహారికవాక్యములను బలికెదరు. సాధార ణులవలెనే వారన్యకార్యముల నింద్రియములతోఁ జేయు దురు; కాని వారిచిత్తము నా మీఁదనే యుండును. వారి ప్రాణము శ్వాసశ్వాసయందును నానామోచ్చారణమొనర్చు చుందురు. వారి వ్యాపారము నాకొఱకే యుండును.

3. ప్రశాంతము :-

సాధుజనులెల్లప్పుడును నత్యంత శాంతులుగనుందురు. వారి ముఖమండలము నుండి శాంతి ఉట్టిపడు చుండును. వారత్యంత ఉత్తేజనా ఘటన చేతను నశాంతులుకారు. నిస్త రంగ సాగరమువలె శాంతముగను, గంభీరముగను నుందురు.

4. సమదర్శి:-

సాధువుల హృదయమున వీరు నావారు, వారు పరాయి వారు, వీరు నాజాతివారు, వారు పరాయి జాతివారను భేద ముండదు. వారిదృష్టిలోఁ బ్రాణులందఱును నాత్మ స్వరూ పులే. అయినను యోనిననుసరించి భేదవ్యవహారము చేయ వలసియే యుండును. ఒకఁడు రోగి, యింకొకఁడు స్వస్థుడై నపుడు భోజనమున భేదభావము చేయవలసి యుండును. ఒకఁడు మంచి ఆఁకలి కలవాఁడు, ఇంకొకఁడు బుద్ధిజీవి. మస్తిష్కముతోఁ బనిచేయును. ఇంకొకఁడు శారీరక పరిశ్రమ మొనర్చును. వీరి భోజనమువిషయమున విషమతను జూపింప వలయును. ఒకఁడు యజమాని, ఇంకొకఁడు పురోహితుఁడు, ఇంకొకఁడు పరిచారకుఁడు. కావున స్థానమునందును భేద భావ మొనర్పవలయును. బయటకివియన్నియును భేదము కలిగి యుండినను మానసికముగ నన్నిటియందును నొకే యాత్మ కలదని అందఱను సమభావముతోఁ గాంచును. ఎవనిదృష్టిలోఁ

బ్రాహ్మణులందఱొక్కటియే యనుభావ ముండునో, అతఁడే సాధువు.

5. మమతాశూన్యత:-

సాంసారికులు మమత్వములో మునిఁగియుందురు. ఇది నాయిల్లు, యిది నాధనము, వీరు నాపిల్లలు, ఇది నాకుటుంబ పరివారమే, వీరిని నేను బోషింప వలయును అని యిట్లు మమకారము కలిగియుండుటచే సాంసారికులు దుఃఖులుగను, జింతితులుగను నున్నారు. సాధువు తనవాఁడొక్క శ్రీహరియే నని భావించును. నన్నే తన సర్వస్వముగ భావించును. ప్రపంచముమీఁదగల మమకారము నంతను నామీఁదనే యుంచును. ఏదిచేసినను నాసేవయను భావముతోఁ జేయును. వారెవరినిఁ దమకన్యముగ భావింపరు. తమ దంతయును నాస్వరూపముగ భావించెదరు. వారు నన్నువీడి యింకెవరి మీఁదను మమకారమును బెట్టుకొనరు.

6. అహంకార రాహిత్యము :-

తాను జ్యేష్ఠుఁడననియు, శ్రేష్ఠుఁడననియు సాధువన కుండదు. అందఱును నన్నుఁ బూజింపుఁడు, నాప్రతిష్ఠను నిలుపుఁడని యనఁడు. నన్నెవరాదరింపరో వారు నా శత్రు వులు, ద్వేషులనఁడు. సమస్త కలహములును, కొట్లాటలును నహంకారము వలననే వచ్చుచుండును.

7. నిర్ద్వంద్వము :-

సుఖదుఃఖములును, పాపపుణ్యములును, మంచి చె లును, ఉచ్చ నీచలును, చిన్న పెద్దలును, హాని లాభమ లును, జీవన్మరణములును, కీర్త్యపకీర్తులును నీ ద్వంద్వము సాధువులలో నుండవు. ఏలననఁగా భగవానుని యంద ద్వంద్వములుండవు. ఇంక భక్తులలో నెచ్చోనుండిరాఁగలదు వారు ద్వంద్వాతీతులై ఆనంద పూర్వకముగ నా భజనలో మునిఁగి యుందురు.

8. అకించనత్వము :-

సమయమునకు నాకు ఫలాని వస్తువు లభించునో లభింపదోయని జనులు సాధారణముగ సంగ్రహించు చు దురు. అందువలన వారు చాల వస్తువులను సంగ్రహించ చుందురు. కాని భగవద్భక్తులు యోగక్షేమములను గాంచ వాఁడు శ్రీహరియేనని భావించెదరు. ఎప్పుడేవస్తువు తమక గావలసివచ్చునో దానినిఁ దప్పక శ్రీహరి యొసంగును. అట్టి యెడ సంగ్రహచింత యేల ననుకొనును. ఇట్లు తలఁచి వారే వస్తువును బరిగ్రహింపరు. కథా కీర్తనమునకును, నా పూజకును గావలసిన వస్తువుల నవశ్యము గ్రహించును ఏలననఁగా నా సంబంధమైన సమస్త వస్తువులును నిర్గుణము లగును. తన కొఱకును, దన ఆశ్రితుల కొఱకును నాతఁ డేమియు నుంచుకొనఁడు.'

ఈ విధముగు నకించన నిర్ద్వంద్వుఁడగు సాధువు లభించినచో, నట్టివాని సత్సంగమున సంసార బంధన మతి శీఘ్రముగఁ దెగిపోవును. కావున నిట్టి సాధువుల సాంగత్య మవశ్యము చేయవలెను.'

ఉద్ధవుఁడిట్లడిగెను:–స్వామీ! ఈ గుణములు లోపలివి. సాధువులను గుర్తించుట కేవైన బాహ్య చిహ్నములను జెప్పఁగలరా?'

భగవానుఁడిట్లనెను:–'ఉద్ధవా! సంసారులు తినకుండ నెట్లుండఁజాలరో సాధువులు నాకథలను వినకుండ నుండఁజాలరు. వారికి నాకథలను విను వ్యసనముండును. మద్యపాన మొనర్చువానికి అన్నము లేకుండినను నుండఁగలఁడు కాని మద్యము లేకుండిన నుండఁజాలఁడు. అట్లే నా భక్తులు ప్రసాదము లేకుండినను బాధపడరుకాని కథాకీర్తనములు లేకుండిన నుండఁజాలరు. అందువలన నా భక్తుల స్థానములందు వ్యవధానము లేక పన్రెండు నెలలును నా కథాకీర్తనము జరుగుచుండును. సౌభాగ్యశాలురగు నా సాధువులు పరస్పరము కూర్చుండి నాసంబంధమగు గాథలను జెప్పుకొనుచుందురు. భాగవత కథలవలె వివిధములగు నాలోచనా ప్రత్యాలోచనలు జరుగుచుండును. సాంసారికుల వద్ద ఆ యీ ప్రాపంచిక సంబంధములగు నాలోచనములు వచ్చును కాని నాభక్తుల వద్ద నా సుమధుర నామకీర్తనము, వనో

హారములగు నాకథలను గాన మొనర్చుటయు జరుగుచుం డును. ఈ కథాకీర్తనాది కార్యముల వలన సాంసారికులకు సమస్త కళ్యాణమును జరుగును. కథలను వినుటచేతను, గీర్తన మొనర్చుట చేతను, కథలను జెప్పుటచేతను సందఱి పాపములును బటాపంచలగును. కథాకీర్తనములను గావించి యెవరు సంతోషించెదరో, ఏకాంతమున వానిని మనన మెవరు చేయుదురో, ఇతరులకు వినిపించెదరో, అనుమోదన మొనర్చెదరో, అట్లు చేయుట కితరుల నెవరు ప్రోత్సహిం చెదరో వారికి నా అనన్యభక్తి ప్రాప్తించును'

ఉద్ధవుఁడిట్లడిగెను :—'స్వామీ ! మీభక్తి కాక వారి కింకేమి ప్రాప్తింపఁగలదు ?'

నవ్వి భగవానుఁడిట్లనెను:—'నాభక్తి ప్రాప్తించిన వాని కింకఁ బ్రాప్తింపవలసిన దేది యుండఁగలదు ? నాభక్తి యొక్కటే ప్రాణులకుఁ బరమ ప్రాప్యస్థానము. ఇదియే చరమలక్ష్యము. అనంతగుణ సంపన్నుఁడను, ఆనందాను భవ స్వరూపుఁడను, సచ్చిదానంద ఘనుఁడను. కరుణా వరుణాలయుఁడను, పరబ్రహ్మ పరమాత్మనగు నాయందు భక్తి ప్రాప్తించెనా, సమస్త కోరికలును నొక్కసారిగా నెఱ వేరును. ఒకానొకఁడు మంచి చలికాలములో నమావాస్య నాఁడు ఘోరారణ్యము లోనికిఁ బోయినాఁడు. వానికిఁ గప్పుకొనుటకు వస్త్రములు లేవు. చలి అతిగా బాధించు

చున్నది. అరణ్యమునిండ సింహ వ్యాఘ్రాది క్రూరమృగ
ములు కలవు. చీఁకటి గాఢాంధకారము. వానికి చలిభయము,
క్రూరమృగములు హింసించునేమో ననుభయమును, చీకటి
భయము. ఇట్లు మూఁడుభయములు పట్టుకొనెను. వీనిని
నివారించుకొనుట కెన్నో కావలయును. అట్లుగాక యెండు
కట్టెలను దెచ్చి మంట వేసికొనినఁ జలియును బోవును.
చీఁకటియును నాశనమగును. మంట దగ్గఱకు హింస్రక
మృగములు రావు కావున వాని భయమును నుండదు.
ఒక్క అగ్నిని వెలిగించుటచే నంధకారమును, శీతమును,
భయమును నెట్లు నివృత్తియైనవో అట్లే భగవద్భక్తి కలిగి
నచో నన్నియును బ్రాప్తించినట్లే. సాధు పురుషులతో
సత్సంగ మొనర్చుటచే జన్మ జన్మాంతరము లందలి పాపము
లును, సంసార భయమును, అజ్ఞానమును నివృత్తియగును.
కావున సుఖము నపేక్షించువాఁడు నిరంతరము సాధుసేవన
మొనర్పవలయును. ఈ సంసార సాగరమున మునిఁగి తేలుచుఁ
గొట్టుకొను చుండువానికి బ్రహ్మవేత్తయును, శాంతచిత్తుఁ
డును సమదర్శియగు సాధువు మాత్రమే అవలంబనము.
భవజలధి యందు మునుఁగువారలకు భగవద్భక్త మహాపురు
షులను సుదృఢమగు నావయే ఆధారము. ప్రాణులకు
వాయువు, అగ్ని, జలమెట్లాధారమో, మత్స్యములకు జల
మెట్లు జీవనమో, అట్లే దేహధారులకు నేనే జీవనము.

గ్రుడ్డివానికి కఱ్ఱయెట్లాధారమో, సద్యోజాత శిశువునకు తల్లి పాలెట్లాధారమో, అదే విధముగ దీన దుఃఖులకు నేనే ఆధారము. విద్వాంసులకు విద్యయేధనము. వ్యాపారులకు ద్రవ్యమే ధనము. పరలోకమునకు ధర్మమే ధనము. ఇదే విధముగ సంసార భయ భీతులకు సాధు జనములే ఏకైక ధనము. వారే వీరికి పరమాశ్రయము.

ఉద్ధవుఁడిట్లడిగెను :- 'స్వామీ! సంతానములకు తల్లి, దండ్రులును, భార్యను భర్తయును సుఖమొసంగెదరు. వీరం దఱికను మించి సాధువుల కింతటి మహిమ యేల వచ్చినది?'

భగవానుఁ డిట్లనెను :- 'ఉద్ధవా? తల్లిదండ్రులును, పతిమొదలగువారును సాంసారిక సౌకర్యములను గూర్చి విశేషధ్యానముంచెదరు. కాని సాధుజనులు పరలోకము నందు విశేషశ్రద్ధ యుంచెదరు. సూర్యుఁ డుదయించి బాహ్య చక్షువులను ప్రకాశింపఁజేయును. కాని సాధువులు లోపలి నేత్రమును దెఱచెదరు. వారు నా సాక్షాత్కారమును గావింపఁజేసెదరు. కావున సాధువులు తల్లిదండ్రులు. సంబంధులు. సుహృన్మిత్రులు. సేవకులు, స్వాములు, ఇష్టదేవతలు, ఆత్మస్వరూపులు, పరమాత్మ స్వరూపులే. ఎంతని చెప్పఁ గలను? ఉద్ధవా! సాధువునకు నాకును భేదము లేదు. సాధుల హృదయము నాయది, సాధుల హృదయంబు నేను. సాధుల నేను ఎఱుంగుదు, సాధులెఱుంగుదురు నన్ను. కావున వారి సాంగత్యమున నుండవలయును.'

భగవానుఁడిట్లనెను:- "ఉద్ధవా! ప్రతిష్ఠాన పురాధిపతి పురూరవ చక్రవర్తి యిట్లు నిశ్చయ మొనర్చి ఊర్వశీ లోకమునుండి పృథివిమీఁదకు దిగివచ్చి సాధుసాంగత్య మొనర్చుచు స్వచ్ఛందుఁడై తీర్థస్థానములందు భ్రమించుచుండెను. అతఁ డనాసక్తుఁడై, ఆత్మారాముఁడై భూమిపైఁ బర్యటించుచు జీవన్ముక్తానందమును బొందుచుండెను. ఇదే విధముగ నుద్ధవా! నీవును మోహమమత్వమును వదలి భూమిపైఁజరించుచుఁ గాలక్షేప మొనర్పుము. నీకును నిప్పుడు నాకృపవలనఁ గర్తవ్య శేష మేమియును లేదు. నీవు నా పూజనమునే కర్తవ్యముగ భావింపుము. క్రియాయోగము ద్వారా నిరంతరము నన్ను భజించుచుండుము."

ఉద్ధవుఁడిట్లడిగెను :- 'స్వామీ! క్రియాయోగమని దేని నందురు? భక్తులు నీ యొక్క యే మూర్తిని ధ్యానించుచుందురు? ఎవరి నుపాసించెదరు? ఎట్లు చేయుదురు? దయ చేసి యీ క్రియాయోగమును గూర్చి నాకు జెప్పుఁడు.'

భగవానుఁడిట్లనెను :- ఉద్ధవా! ఋషులును, మునులందఱును నా క్రియాయోగమును వర్ణించిరి '

ఉద్ధవుఁడిట్లడిగెను :- 'కావుననే నాకత్యధిక జిజ్ఞాస కలిగినది. దేవర్షియగు నారదుఁడు పాంచరాత్రాదులయందు దీనిని విస్తరించి చెప్పినాఁడు. అంగిరుని పుత్రుఁడు బృహస్పతియును, వేదములను వ్యాస మొనర్చిన వ్యాసభగవానుఁడును,

ఇతర ఋషులును, మహర్షులును, మానవులయొక్క పరమ కల్యాణార్థమై మాటిమాటికిని నీక్రియను బరమ సాధనంగ జెప్పిరి. మీరును నీక్రియాయోగమునకు ఆది ఆచార్యులరు. మీరు మీ పుత్రుండగు బ్రహ్మకీయోగము ను గూర్చి చెప్పితిరి. అనంతరము బ్రహ్మ దానిని భృగు, శంకరాది పుత్రుల కుపదేశించెను. శంకరుండు పార్వతి కనుగంగా నామెకు జెప్పెను. స్వామీ! వైదిక కర్మకాండాదులకు నియమము కలదు. ఫలాని దానిని చదువుము, ఫలానిది చదువరాదను నియమము కలదు. కాని యీ క్రియాయోగ మునకందఱకును నధికారముకలదు. స్త్రీలును, శూద్రులును నీయోగము నాచరించి తమ కల్యాణమును సాధించుకొన వచ్చును. నా యభిప్రాయమున నీ క్రియా యోగముచే నందఱును బరమలాభమును బొందంగలరు. నాథా! ఆ కర్మ యోగమునుగూర్చి వినవలయుననియున్నది. కమలనయనా! మీరు నాకు దీని నుపదేశింపవలయును జగదీశ్వరా! మీరు నాకోరికను నెఱవేర్చవలయును. స్వామీ! నావినతి నంగీకరింప వలయును.'

సూతుండిట్లనెను :- 'మునులారా! ఈ విధముగ నుద్ధవుండు ప్రభువును బ్రార్థింపంగా భగవానుండిట్లనెను :- 'మంచిది, ఉద్ధవా! ఇప్పుడు నేను నీకు క్రియాయోగమును

గూర్చి ఉపదేశించెదను' ఇప్పుడు భగవానుఁడెట్లు క్రియా యోగమును గూర్చి యుపదేశించెనో, దానిని మీకుఁ జెప్పెదను.

---

## క్రియా యోగోపదేశము

శ్లో॥ న హ్యంతోఽనంత పారస్య కర్మకాండస్య చోద్ధవ।
సంక్షిప్తం వర్ణయిష్యామి యథావదను పూర్వశః ॥
శ్రీ భాగ. ౧౧స్కం. ౨౭అ. ౬శ్లో॥

వ. ఉద్ధవా! ఈ కర్మకాండ విషయమనంతము. దీని నెవరును బూర్వమును జూచినవాఁడు లేఁడు. కావున నేను బూర్వాపర క్రమమున సంక్షేపముగ దీనిని వర్ణించెదను.'

— శ్రీ మదాంధ్ర భాగవతము.

నిత్య నియమముతో భగవత్కథలను వినుటయు, కీర్తన మొనర్చుటయును, సేవాపూజలొనర్చుటయును, వైష్ణవోచిత తిలకధారణ మొనర్చుటయును, సదా అమానిగా నుండుటయును, అందఱకును గౌరవ మొసంగుటయును, అన్నిటి యందును భగవంతుని గాంచుటయును, జీవులయందు దయ గలిగి యుండుటయును, కార్యముల నన్నిటిని భగవంతుని కొఱకు మాత్రమే చేయుటయును, విషయవాసనలు లేకుండుట యును, కర్మలను బ్రభుప్రీతికొఱకై చేయుటయును, సదా సాధుసేవ యొనర్చుటయును, ప్రభు ప్రసాదమును స్వీకరించి

294'57 — Acc NO 778
BRA



సంతుష్టుఁడై యుండుటయును, ఇట్టివన్నియును భగవద్భ
లక్షణములు. వైష్ణవశాస్త్రములలో మాటిమాటికిని
వర్ణనము లభించుచుండును. ఎవరేది ప్రశ్నించినను పీ
గూర్చి ప్రశ్నింపవలసినదే. ఈ అన్నిటిలోఁ ప్రభుపు
అన్నిటికంటెఁ ప్రధానమైనది. అందువలన ప్రభు పూ
పద్ధతికి సంబంధించిన ప్రశ్న మాటిమాటికిని వచ్చినది.
రెవరినిఁ బ్రశ్నించిన వారు దానినే నానాప్రకారముఁ
సమాధానమొసంగిరి. భగవంతునిపూజ అనేక విధముఁ
నున్నది. ఎవరికేది అనుకూలమో, ఎవరెట్టిపూజకధికారు
వారట్టిదానిని గ్రహింపవలయును.'

సూతుఁడిట్లనెను:- 'మునులారా! ఉద్ధవుఁడు భగ
నునిఁ గ్రియా యోగమును గూర్చి ప్రశ్నింపఁగా' భగవా
డిట్లనెను:- 'ఉద్ధవా! ఈ కర్మకాండకంతము లేదు. కర్మశా
అతి విస్తృతమైనది. వేద, పురాణ, శాస్త్ర, సమస్త స్మృ
యందు దీనియొక్క విస్తారమే కలదు సర్వత్ర విధినిషేధ
లను గూర్చియే చెప్పఁబడినది. అసంఖ్యాకములగు ద
ములు కలవు. అన్నిటిలోను గ్రియాయోగమును గూర్చి
చెప్పఁబడినది. ఎట్లు పూజింపవలయును? ఎవనినిఁ బూఁ
వలయును? ఏ యే ద్రవ్యములతోఁ పూజింపవలయు
ఇవియే ముఖ్యమైన విషయములు.'

ఉద్ధవుఁడిట్లడిగెను :- 'స్వామీ ? పూజలెన్ని విధములు ?'

భగవానుఁడిట్లనెను :- 'పూజ కనంత భేదములు కలవు; కాని అవన్నియును మూఁడింటితో సమావేశమగును. వైదికపూజ, తాంత్రికపూజ, ఉభయాత్మక మిశ్రిత పూజ. వైదిక విధిచే వేదమంత్రములతోఁ జేయఁబడు పూజ వైదిక పూజ. పౌరాణిక, అన్యతాంత్రిక విధిచే నాయామంత్రములతోఁ జేయఁబడు పూజ తాంత్రికపూజ. రెంటిని అనఁగా వేదమంత్రములను దాంత్రిక మంత్రములను గలిపి చేయు పూజ మిశ్రిత పూజ. ఎవరి కే పూజ అనుకూలముగనుండునో దానినే వారు చేసికొనవలయును. తంత్ర పురాణ మంత్రములచే సూద్రులును స్త్రీలును జేసికొనవచ్చును వైదికపూజకును, మిశ్రితి పూజకును నధికారము ద్విజులకు మాత్రమే కలదు.'

ఉద్ధవుఁడిట్లడిగెను :- 'స్వామీ! ఇప్పుడు పూజా ప్రకారమును జెప్పుఁడు.'

భగవానుఁడిట్లనెను :-'ఏ పూజ నొనర్చినను దానికి ముందుగా నధికారమును బొందవలయును. ద్విజుఁడైనచో శాస్త్రవిధి ననుసరించి ఉపనయనమును జేసికొని యుండవలయును. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు ప్రథమ జన్మ తల్లి ఉదరమునుండి కలుగును. రెండవ జన్మ యజ్ఞోపవీత

సంస్కారమునఁ గలుగును. అందులకే ఆతనికి ద్విజుఁడను సంజ్ఞ వచ్చినది. ఈ విధముగ నుపనయనము ద్వారా ద్విజత్వమును బొంది త్రివిధ పూజలకును నధికారము కలిగి యుండును. అంత నాతఁ డత్యంత భక్తియుక్తముగ నాపూజ నొనర్పవలయును.''

ఉద్ధవుఁడిట్లడిగెను :- 'స్వామీ! మీకు నిశ్చితాకారము లేదుకదా! మీరు నిర్గుణ నిరాకారులు. సాధకుఁడు మీ పూజ నెట్లు చేయవలయును?'

భగవానుఁడిట్లనెను :-'ఉద్ధవా! నేను సర్వవ్యాపకుఁడను. సాధకుఁడు నన్నెచ్చట పిలిచినను నచ్చటనే ప్రకటమయ్యెదను. నా పరమభక్తుఁడగు ప్రహ్లాదుఁడు స్తంభమును జూపి దీనిలో నా భగవానుఁడున్నాఁడనెను. నేను వెంటనే ఆ స్తంభమునుండి బయటకు వచ్చితిని. కావున నెచ్చట నే వస్తువులో విశ్వాసముంపఁగలవో ఆవస్తువులో నన్నుఁ బూజింపవలయును.'

ఉద్ధవుఁడిట్లడిగెను :- 'స్వామీ! కొన్ని స్థానములను నిర్దేశింపుఁడు.'

భగవానుఁడిట్లనెను :- 'నా ప్రతిమలోఁ బూజింపవలయును. ప్రతిమ దొఱకకుండినచో నేలమీఁద నరుగునైచి దానిమీఁదఁ పూజింప వచ్చును. అగ్ని, సూర్యుఁడు, జలము, హృదయము, అతిథి, బ్రాహ్మణుఁడు వీని యందు నన్ను

భావించి శ్రద్ధాభక్తులతోఁ బూజింపవలయును. గురు దేవుని సాక్షాత్పరబ్రహ్మగా భావించి యథోచిత సామగ్రులతోఁ బూజింపవలయును.'

ఉద్ధవుఁడిట్లడిగెను :- 'స్వామీ! పూజకు మొదట యేమి చేయవలెను ?'

భగవానుఁడిట్లనెను :-'నిత్యకర్మ లొనర్చుకొనియే పూజ చేయవలసి యుండును. ప్రాతఃకాలమున బ్రాహ్మ ముహూర్తమున వేచి లఘుశంకాదు లొనర్చుకొని, చేతులను గాళ్ళను బాగుగాఁ దోమి కడిగికొని పుక్కిలించవలయును. అంతఁ బ్రాతః స్మరణ మొనర్పవలయును. శాస్త్రోక్త విధిచే శౌచమునకుఁబోయి, చేతులకును గాళ్ళకును మట్టిని రాచుకొని కడుగుకొని శుద్ధుఁడై, శుద్ధమైన వృక్షపుపుల్లతోఁ బళ్ళుతోముకొనవలయును. అంతనది, చెఱువు, సరస్సు, బావి లేక యింటిలోనైనను స్నానమొనర్పవలయును, స్నానమునకుఁ బూర్వమునను, స్నానమొనర్చునపుడును బఠింపవలసిన మంత్రములను బఠింపవలయును. మంత్రములతో శరీరమునకు మృత్తికను రాచుకొనవలయును. సంకల్పపూర్వకముగ స్నానమొనర్పవలయును. ముందుగా సంధ్యావందనాది నిత్యకర్మలొనర్పవలయును.సంధ్యాతర్పణాదులను బూర్తి కావించుకొని, కర్మలను బావనమును, కల్యాణమును గావించు ప్రతిమాదులందు నాపూజ నొనర్పవలయును.'

ఉద్ధవుఁడిట్లడిగెను:– 'స్వామీ! మీ ప్రతిమను నేవస్తువుతోఁ జేయవలయును?'

భగవానుఁడిట్లనెను:–'నా ప్రతిమ లనేకములు కలవు. ప్రతిమలలో ననేక భేదములు కలవు. అందులో నెనిమిది ముఖ్యములు.'

ఉద్ధవుఁడిట్లడిగెను:– 'ఎనిమిది విధముల ప్రతిమ లేవి? ముందుగా నా యెనిమిది విధముల ప్రతిమలనుగూర్చి చెప్పవలయును.'

భగవానుఁడిట్లనెను:– 'ఉద్ధవా! నా యెనిమిదివిధముల ప్రతిమలివి:—

1. పాషాణ ప్రతిమ:– రాతినిఁ జెక్కి నా రూపము నొనర్చుటకు పాషాణప్రతిమ యందురు. రాయి ఎఱుపు, తెలుపు, నలుపు లేక చలువరాయి వీనితో దేనితోనైనను ననుకూల విధినిఁ బ్రతిమ నొనర్చుకొనవలయును. చేసినది కొనవచ్చును.

2. ధాతుమయము:– బంగారు, వెండి, యిత్తడి, ఇనుము మొదలగు సప్తధాతువులతోఁ బ్రతిమను జేయింపవలయును. దానిని లౌహిప్రతిమ యందురు. వీనినిఁ గఱఁగియైనను బోతపోసెదరు లేక రేకులమీఁద నుబ్బెత్తుగ జెక్కెదరు.

3. దారుమయము:- చందనము, వేప, యితర శాస్త్రోక్త వృక్షముల కొయ్యతోఁ బ్రతిమ నొనర్పవలెను. ఇది దారుమయ ప్రతిమ. జగన్నాథమున నా ప్రతిమ దారు మయమే కదా!

4. లేప్యము:- చందనము బూదికాని, బియ్యపు పిండితోఁగాని ప్రతిమను జేయుటకు లేప్యప్రతిమ. ఇట్టి ప్రతి మలు చాలరోజులుండవు.

5. లేఖ్యము:- గేరువు మొదలగుధాతువులతో గోడ మీఁద వేసిగాని, అనేక రంగులతో భోజపత్రము మీఁదఁ గాని, కాగితముమీఁదగాని వేసినచిత్రమును లేఖ్యమందురు. కాగితమునీాద వేసినదైనచో నది చెడిపోకుండుటకై చిత్ర మును నద్దమును వేయించవలయును.

6. సైకతీ:- మట్టితోఁ గాని, యిసుకతోఁ గాని ప్రతి మలు చేయఁబడును. అది సైకతమని పిలువఁ బడును. రామావతారమున నేను రామేశ్వరమున సైకతముతో లింగమును జేసితిని.

7. మణిమయ ప్రతిమ:- ఇంద్రనీల మణితోఁ గాని, లేక అన్యమణులతోఁగాని ప్రతిమలనొనర్పవలెను. చిదంబర మందలి శివలింగ మిట్టిదే.

8. మనోమయి:- మనస్సుతోఁ దమతమ యిచ్ఛాను సారముగ మూర్తినిఁ గల్పించుకొని మానసికపూజ నొనర్ప

వలయును. ఈవిధముగ నావి యెనిమిది విధముల ప్రతిమలు కలవు. వీనికి ప్రాణప్రతిష్ఠ చేయునంతవఱకు పూజించుటకు యోగ్యములు కావు.

ఉద్ధవుఁడిట్లడిగెను :- 'ప్రాణ ప్రతిష్ఠ యన నేమి? స్వామీ!'

భగవానుఁడిట్లనెను:- 'ఈమూర్తు లేర్పడిన తరువాత శాస్త్రోక్తవిధిని దీనికిఁ బ్రాణప్రతిష్ఠ నొనర్పవలయును. ఇట్లు చెప్పవలయును:- 'ఈ ప్రతిమయందు బ్రాణము ప్రతిష్ఠింపఁ బడుగాక! ఏమియును మంత్రములు రాక యుండినచో నా నామముల నుచ్చరించుచు సమస్త శరీరమును స్పర్శింప వల యును. అనంతర మా ప్రతిమలోనికి జీవమువచ్చినట్లుభావింప వలయును. సాలగ్రామమునకుఁ బ్రాణప్రతిష్ఠను జేయవలసిన పనిలేదు. అది సదా సజీవమే. నేనే బృందా శాపమున శాలగ్రామ రూపమును ధరించితిని. ప్రాణప్రతిష్ఠ అయిన తరువాత మూర్తిస్థాపిత మగును.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'ప్రాణప్రతిష్ఠ యయిన తరువాతఁ బ్రతిమను అచ్చటినుండి కదలింపగూడదు కాదా స్వామీ!'

భగవానుఁడిట్లనెను:- 'ప్రతిష్ఠ రెండు విధములుగ నుండును. ఒకటి చలప్రతిష్ఠ. రెండవది అచలప్రతిష్ఠ. చల ప్రతిష్ఠ చేసినదాని నెచ్చటికైనను గదలించి తీసికొని పోవచ్చును; కాని అచలప్రతిష్ఠ నొనర్చిన దానినిఁ గదలింపక

ఒక్కచోటనే యుంచవలయును. ఆరెండును నాకు నివాసస్థానములే. ఆరెండుప్రతిమలును బూజనీయములే. రెంటియొక్క పూజాపద్ధతి ఒక్కటే. ముందుగా నావాహన మొనర్ప వలయును.'

ఉద్ధవుఁడిట్లడిగెను :—'స్వామీ! చల, అచల ప్రతిమలకు రెంటికిని నావాహన మొనర్పవలయునా?'

భగవానుఁడిట్లనెను :—' నాయొక్క అచలమూర్తికి ఆవాహన విసర్జనలుండవు. నేనెల్లప్పు డచ్చటనే నివసించెదను. చల ప్రతిమలందు ప్రాణ ప్రతిష్ఠ నొనర్చిన నావాహనము చేయవచ్చును లేక చేయక పోవచ్చును. ఏలననఁగా నవియును నిత్యములే. తాత్కాలిక పూజనమునకై వాలుకా గోమయ, మృత్తికలతోఁజేయు ప్రతిమలకు ఆవాహన విసర్జన లొనర్పవలయును. చిత్రాదులందావాహన విసర్జనలు తమ తమ యిష్టము ననుసరించి యుండును. పూజసామగ్రి నొక్క సారిగానే సమకూర్చుకొని యుంచుకొన వలయును.'

ఉద్ధవుఁడిట్లడిగెను :—'సమయమునకు ద్రవ్యాభావము కాని, ఏకారణముచే నైనను బూజాసామగ్రి లోపించినచో నేమిచేయవలెను?'

భగవానుఁడిట్లనెను:— 'దొఱకని వస్తువునకై దుఃఖింపవలసిన పనిలేదు. నాయనా! నాకు సామగ్రులకు గొదువలేదు. నేను నైవేద్యాలకు ఉవ్విళ్ళూరుటలేదు. నేను భావ

తృష్ణ కలవాఁడను. నాకు నిజమైన భక్తుఁడు జలముచేత నే భక్తిభావముతోఁ బూజించును. ఒక్క పుడిసెడు జలము నాకమృతము కంటె నెక్కువ ప్రియముగ నుండును. కేవలము లోక ప్రదర్శనము కొఱకు, పేరుకొఱకు, వైభవము కొఱకు వివిధములగు బహు మూల్యములగు వస్తువులను దెచ్చి పూజించిన, నాభక్తుఁడు జలముచేఁ బూజించునపుడు సంతోషించినట్లు సంతోషింపను. భావభక్తిలేక మంచి చందనము దీసి అలది, నాలుగు అగరు వత్తులను వెలిగించి, దీపమునుజూపి, పుష్పమాలా, నైవేద్యాదుల నర్పించి నన్ను వశపఱచుకొనుట మిక్కిలి అసంభవము కాఁగలదు.'

ఉద్ధవుఁడిట్లడిగెను:-'ప్రభూ! ఇప్పుడు పూజా ప్రక్రియను గూర్చి చెప్పుఁడు.'

భగవానుఁడిట్లనెను :- 'స్నానాదుల నొనర్చుకొని పూజచేయఁ గూర్చుండ వలయును. పూజచేయుట మంచి కుశాసనమును బఱచుకొన వలెను. కుశలయొక్క అగ్రభాగము తూర్పువైపుగ నుండవలెను. దానిమీాద మృగచర్మమును, ఆపైన వస్త్రమును బఱచుకొని పూర్వాభి ముఖముగఁ గాని ఉత్తరాభి ముఖముగఁగాని కూర్చుండవలెను. విగ్రహము తన కెదురుగ నుండవలయును. విగ్రహసమ్ముఖముననఁ గూర్చుఁడిన దిశావిచారము పనికిరాదు. స్థిర ప్రతిమయొక్క ముఖము ఉత్తరపు వైపున కుండినచోఁ, దాని సము

ఖము దక్షిణమగును. దక్షిణాభి ముఖముగఁ గూర్చుండి దేవకర్మచేయుట ప్రశస్తము కాదు. అయినను విగ్రహాము నకు ముందది దోషముకాదు. పూజాసామగ్రి నంతను నేర్ప ఱచుకొని తనకు కుడిప్రక్కన పీఁటమీఁద బెట్టుకొన వల యును. ఏ మంత్రముతోఁ బూజింపవలయునో, ముందుగా దానితో నంగన్యాస కరన్యాసము లొనర్పవలయును. ఏ మంత్రముతోఁ బూజింపఁ బోవుచున్నామో ఆమంత్రము యొక్క ఋషిని శిరస్సున న్యాసమొనర్పవలెను. ఛంద స్సును ముఖము మీఁదను, దేవతను హృదయము మీఁదను గాయత్రీ మంత్రమునకువలె న్యాసమొనర్పవలయును. దీనికి ఋషి విశ్వామిత్రుఁడు. ఛందస్సు గాయత్రియే. దేవతా సూర్యుఁడు. వీనినిఁ గ్రమముగ శిరస్సు, ముఖము, హృదయ మందు న్యాసమొనర్పవలయును. తా నంగ న్యాస కరన్యా సము లొనర్చి మూర్తియందును నట్లే కావింపవలయును. ఏలననఁగాఁ దాను దేవతయై దేవతను బూజింపవలయును. మంత్రన్యాసానంతరము ప్రతిమకు ముందుబెట్టిన నిన్నటి నిర్మాల్యమును దీసి ఒకపాత్రలో నుంచవలయును. సింహాస నము మొదలగు వానిని శుభ్రమొనర్పవలయును. పూజ కొఱకు తెచ్చిన జలముతోఁ బూజాసామగ్రిపైఁ జల్లవలయును. తన శరీరము మీఁదను, బూజాస్థానమునను జల్లవలయును. ఇంతవఱకు పూజకావలసిన వన్నియును సిద్ధమైనవి. ఇప్పుడు

పూజ నారంభింప వలయును. పంచపాత్రలనుదెచ్చి వాని జలమును నింపవలయును.'

ఉద్ధవుఁడిట్లడిగెను :- 'పంచపాత్రలని వేనినందు! స్వామీ !'

భగవానుడిట్లనెను:- 'ఒక పెద్ద పాత్రలో నై గిన్నెలనుంచవలయును. ఒక పాత్రను మధ్యలోను వలయును. మిగిలిన నాలుగు చతుర్దశ కమలమువలె దా నాలుగువైపులను నుండవలయును. మధ్యనుండిన పా కర్ణికాస్థానమున నుండును. వీనికిఁ బంచపాత్రలని పేరు. ఉద్ధరిణెను దానిలో నుంచవలయును. పంచపాత్రముల జలమును నింపవలయును. పాత్రలు సువర్ణ, రజత, తా ములుగ నుండుట శ్రేష్ఠము. వానిలోఁగుంకుమపువ్వు చం మును వేయవలయును. మధ్యపాత్రలో శుద్ధజలముండ యును. వాని అన్నిటియందును శాస్త్రములోఁ జెప్పఁబ వస్తువులను వేయవలయును. అవి పాదార్ఘ్య ఆచమ స్నానముల నేర్పడినవి. మధ్యపాత్ర శుద్ధజలముపాత్ర. పాద్య నందు దూర్వ, విష్ణుక్రాంత, తులసీ, గంధాదులను వే వలెను. అర్ఘ్యపాత్రయందు, గంధపుష్పాక్షత(విష్ణువు కోఁ తెల్ల నూవులు లేక జలము) ఆవాలు, గరిక, కుశ, క్షీరః దధి మొదలగువానిని వేయవలెను. ఏవియును లేకుం నన్నిటియందును తులసీదళములను వేయవచ్చును. ఆచ

నీయ జలమందు లవంగములు, జాజికాయ, కర్పూరాది సుగంధద్రవ్యములను వేయవలయును. అనంతరము త్రిపదా గాయిత్రిచే, మూఁడుపాదముల చేతను. హృన్మంత్ర, శిరో మంత్ర, శిఖామంత్రములతోఁ గ్రమముగఁ బాద్య అర్ఘ్య, ఆచమనీయ పాత్రల నభిమంత్రింప వలయును. చివరకు సంపూర్ణ గాయత్రీమంత్రముచేఁ బంచపాత్రల నభిమంత్రింప వలయును. తరువాత కోష్ఠశుద్ధి యొనర్పవలయును. '

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'కోష్ఠశుద్ధియని దేని నందురు? స్వామీ! '

భగవానుఁడిట్లనెను:- ప్రాణవాయువు శరీరమంతటను వ్యాపించి యున్నది. అదియే జీవనము. జఠర మందున్న నగ్నియే సమస్తధాతువులను బక్వమొనర్చును. కొలిమిలోని అగ్నిచే బంగారము శుద్ధమైనట్లు జఠరాగ్ని. ప్రాణవాయువులచే శరీరమంతయును శుద్ధమగుచున్నట్లు భావింపవలయును. పిండశుద్ధి అయిన తరువాత హృదయమందుండిన నష్టదళ కమలమందున్న నా పరమ సూక్ష్మమును, ఉత్తమము నగు జీవకళను ధ్యానింప వలయును. దానిని సిద్ధులు నాదాంత మందు భావనద్వారా ధ్యానము చేయుదురు '

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'ప్రభూ! సిద్ధులు నాదాంతమందే జీవకళన ధ్యానము చేయుదురు. '

భగవానుఁడిట్లనెను:– 'నేను వాచ్యుఁడను ప్రణవము వాచకము. ప్రణవమున కైదుకళలుగలవు. అకార, ఉకార, మకార, బిందు, నాదము, (కొందఱు మతమున అకార, ఉకార, మకార అర్ధమాత్ర (బిందు) ధ్వని, నాదము, శాంతి అను నేడు మాత్రలు కలవు) నాదముతరువాత పరాత్పరుఁడ నగు నేనుమాత్రమే యున్నాను. కావునఁ గేవలము నన్నే ధ్యానింప వలయును. నేనంతర్యామి రూపమున ఘటఘట మున వ్యాపించియున్నాను. శరీరము లన్నియును నా దేవా లయములే. నే నాత్మభూతమగు జీవకళారూపమున నన్నిటి యందున్నాను. కావున మునుముందుగా మానసికోపచార ములచేతఁ బిండమందు నాపూజ నొనర్ప వలయును. ఏల ననఁగాఁ బిండములో నేమున్నదో, బ్రహ్మాండమునను నదియే కలదు. మనస్సున నే తత్త్వమును మానసిక పూజద్వారా పూజించుచుంటివో, దానినే విగ్రహమునందు బాహ్యోప చారములచేఁ బూజించుచున్నావు. అనంతరము మంత్ర ముల ద్వారా యథావిధిగ నంగన్యాస కరన్యాసములొనర్చి పూజ నారంభింపవలయును. ముందుగా నావాహ్వానించి, తరువాత నాసన మొసంగవలయును. ఆసన మష్టదళ కమలముతోఁ జేయఁబడినదని భావింపవలయును. ఆ అష్ట దళములందు నష్టదిక్కులందు అష్టశక్తులు కలవు. మధ్య

కర్ణికయందు నవమశక్తి కలదు. ఆయన్నిశక్తుల ఆసనము లను నాకుఁ గూర్చుండుటకీయవలెను.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'స్వామీ! నవశక్తులేవి?'

భగవానుఁడిట్లనెను :- 'విమల, ఉత్కర్షిణి, జ్ఞాన, క్రియా, యోగ, ప్రహ్వీ, సత్యా, ఈశాన, అనుగ్రహ ఇవి నవశక్తులు. నా ఆసన పీఠమునఁ బర్యంకమును భావింపుము. ఆ పర్యంక పీఠమున ధర్మ, జ్ఞాన, వైరాగ్య, ఐశ్వర్యములను నాలుగు పాదములు కలవు. అధర్మ, అజ్ఞాన, అవైరాగ్య, అనైశ్వర్యములు పూర్వ, పశ్చిమ, ఉత్తర, దక్షిణములను నాలుగు దిశలకును దండములు. పీఠమున నానుకొనుట కుండిన పృష్ఠభాగమున సత్వ, రజ, స్తమము లను మూఁడు గుణములు కలవు. ఈ దివ్యాసనమును గల్పించుకొని దాని మీఁద నన్నుఁ గూర్చుండఁ బెట్టవల యును. అనంతరము పాద్యాదులచేఁ బూజనారంభింప వల యును పూజకు ముందుగా యథాస్థానమున నా అస్త్రాయు ధములను పార్షదులను స్థాపింపవలయును.'

ఉద్ధవుఁడిట్లడిగెను :- 'మీ యొక్క అస్త్రాయుధ పార్షదు లెవరు?'

భగవానుఁడిట్లనెను :- 'సుదర్శనచక్రము, పాంచ జన్యశంఖము, కౌమోదకీ గద, ఖడ్గము, బాణము, ధనుస్సు, హలము, ముసలము, ఈవన్నియు నెనమిది ఆయుధములు.

వీనిని యథాస్థానమున స్థాపింపవలయును. కౌస్తుభమణి, వైజయింతీమాల, శ్రీవత్స చిహ్నములును నాకు నిత్యాంగములే. నంద, సునంద, గరుడ, చండ, ప్రచండ, బల, మహాబల, కుముద, కుముదేక్షణ, దుర్గా, వినాయక, వ్యాస విష్వక్సేన, గురు, దేవతాదులను గూడ యథాస్థానమున స్థాపింపవలయును. వీనిని గూడ ప్రోక్షించి పూజింపవలయును. ముందుగాఁ బార్షదులను బూజించి, తరువాత నా పూజ లొనర్పవలయును. లేక సాంగాయ సపరివారాయయని చెప్పి యును బూజింపవచ్చును.

ఆవాహన, ఆసనానంతరమునఁ బాద్య మొసంగవలయును. అర్ఘ్య, ఆచమనము లొసంగి స్నానము చేయించవలయును. సామర్థ్యముండినచో నిత్యమును బంచామృతములతో స్నానమొనరింపఁజేయవలయును. చందన, ఉశీర, కర్పూర, కుంకుమ, అగరు మొదలగు సుగంధిత జలములచే స్నానమును జేయింపవలెను. అభిషేకమునకు స్వర్ణధర్మానువాకము, మహాపురుష విద్య, పురుష సూక్తము, సామ వేదోక్త రాజనాదిమంత్రమును బఠించుచు నాకు స్నాన మొనరింపఁజేయవలయును.'

ఉద్ధవుఁడిట్లనెను :- స్వామీ! పాషాణ, ధాతువులతోఁ జేయఁబడిన ప్రతిమలకు స్నానమును జేయింపవచ్చునా ? కొన్ని ప్రతిమలు గోడమీఁద లిఖింపఁబడి

యుండును, లేక కాగితముల మీఁద వేయఁబడియుండును. వానిని స్నానము చేయించిన నవి తడిసి కరిగిపోవునుగదా!'

భగవానుఁడిట్లనెను :- 'స్నానము పాషాణ, ధాతువులచేఁ జేయఁబడిన ప్రతిమలకే జరుపఁబడును. భిత్తి (గోడ) మొదలగు వాని మీఁదఁ గేవలము నీటినిఁ జిలుకరింపవలయును. కాగితము మొదలగు వానిని తడిగుడ్డతోఁ దుడువవలయును. ఈ విధముగనే వస్త్రాలంకార విషయమునను జరుపవలయును. ధాతు, పాషాణాది విగ్రహములందు వస్త్రాద్యలంకారములను జేయవచ్చును గాని చిత్రపటాదులందు వస్త్రాద్యలంకారములను జేయుట కెట్లు వీలుకాఁగలదు?'' స్నానానంతరమున నా ప్రతిమకు యథోచిత వస్త్రములను సమర్పించి, అలంకరించి, చందనము నలఁది, పత్ర, పుష్పములను ముందుంచి, మాలలను ధరింపఁజేసి, అత్తరు మొదలగు సుగంధవస్తువుల నర్పింపవలయును. ఈ విధముగ యథోచిత రీతిని నా ప్రతిమకు సుందర శృంగార మొనరింపవలయును. ఈ విధముగ నాసన, పాద్య, అర్ఘ్య, ఆచమనీయ, స్నాన, వస్త్ర, ఆభరణ, యజ్ఞోపవీత, చందన, పుష్ప, మాలా, అత్తరు, ధూప, దీపాదులచేఁ బూజించి నైవేద్యము నొసఁగవలయును.'

ఉద్ధవుఁ డిట్లడిగెను : - 'స్వామీ! నైవేద్యమునకేయే వస్తువులను బెట్టవలయును?'

భగవానుడిట్లనెను:- 'నాయనా! నైవేద్యమునకు నియమమేమియును లేదు. శక్తి సామర్థ్యము ననుసరించి పెట్టవచ్చును. చాలమంది నాలుగుపండ్లను బెట్టెదరు. సామర్థ్యముండినచో సుందరములగు నుత్తమ. స్వాదిష్ట, మనోహర పరమాన్నములను నివేదింపవలయును. బెల్లము, చక్కెరలతోఁ జేయబడిన నానా విధములగు తీపి పదార్థములను, బాదాము, పిస్తా మొదలగు కోవా పదార్థములను, క్షీరాన్నములను, మంచి మంచి పిండి వంటలను, లడ్డు, మైసూరుపాకు, జిలేబి, పూరీ, హలువా, గారెలు, అరిసెలు, బూంది, కేసరిభాత్, మొదలగు ననేక పదార్థములను పప్పు, పులుసు మొదలగు కూరలను పప్పులను, వడియాలు, అప్పడాలు మొదలగు వానిని, చారు అన్నము, పులిహోర మొదలగువానిని అన్ని షడ్రుచులను బెట్టవలయును. ఇట్లు ఏబదియాఱు పిండి వంటలను నిత్యమును నివేదింపవచ్చును. లేదా శక్తికొలఁది పెట్టవచ్చును. పర్వములందు సమస్త పదార్థములను జేయవచ్చును. అట్టి పర్వములందు విశేషముగ నభిషేకించవలెను. మంచి సుగంధతైలమును రాచి, నలుగు, దంతధావనము మొదలగు విశేషోపచారముల నొసర్పవలయును. వీనినన్నిటిని శ్రద్ధగా సంగ్రహింప వలయును. నృత్యమును జేయింపవలయును. వివిధములగు మేళతాళములను ప్రయోగింపఁ జేయవలయును. నాటకాభినయ

మును గావింప వలయును. సారాంశ మేమనఁగా మహారాజులకు వలె నన్నర్చింపవలయును. మహా మహోత్సవము లేర్పాటు చేయవలయును. నేను మిక్కిలి సంక్షేపముగఁ జేయవలసిన దేదియో చెప్పితిని. ఇప్పుడు నీవేమి వినఁగోరుచున్నావు?'

ఉద్ధవుఁడిట్లడిగెను:-'స్వామీ! ఇదివఱలో మీరు మీపూజను జల, స్థల, అగ్ని, హృదయము బ్రాహ్మణ, ప్రతిమలయందు జేయవచ్చు నంటిరి. వానిలో మీరు ప్రతిమార్చన విధినిఁ జెప్పితిరి. ఇప్పుడు జలమునందును, స్థలమునందును, అగ్ని, హృదయము మొదలగు వానియందు మీ పూజ నెట్లు చేయవలసి యుండును. కృపతో నీ విధినిఁ జెప్పుఁడు.'

భగవానుఁడిట్లనెను :-'నాయనా! పూజ అన్నిటియందును సాధారణముగ నొక్కొక్కటిగనే యుండును. కాని జలము, అగ్ని యందును గూడ అట్లే చేయఁబడును. ఏ భేదముకలదో దానిని నేను నీకత్యంత సంక్షేపమునఁజెప్పెదను.'

సూతుఁడిట్లనెను :-'మునులారా! ఇప్పు డేవిధముగ నగ్ని మొదలగు వానియందు బూజచేయు విధానమును భగవంతుఁడు చెప్పెనో, దానిని గూడ నేను మీకుఁజెప్పెదను. మీరందఱును దత్తచిత్తులరై శ్రవణ మొనర్పుఁడు.'

---

# అగ్న్యాదులందు పూజనము

శ్లో॥ అర్చాదిషు యదా యత్ర శ్రద్ధామాం తత్ర చార్చయేత్ ।
సర్వభూతేష్వాత్మని చ సర్వాత్మాహ మవ స్థితః॥

—శ్రీ భాగ. ౧౧ స్కం. ౨౭ అ. ౪౮ శ్లో॥

వ. ఉద్ధవా! ఉపాసించువాఁడు ప్రతిమా, అగ్ని, జలాదులందు, ఏ సమయమున నెంతటి శ్రద్ధయుండునో, అచ్చట ఉపాసన మొనరింపవలయును. ఏలననఁగా నేను సమస్త ప్రాణులందును, నా స్వరూపమునందును సర్వాత్మభావముతో నుందును.

—శ్రీ మదాంధ్రభాగవతము.

అగ్నియందు హవన మొనర్పవలయును. జలమునఁ దర్పణ మొనరింపవలయును. లేక బ్రాహ్మణునకు అన్నాహుతుల నొసంగుము. గోవునకు గడ్డినిఁ బెట్టుము. లేక సమస్తభూతములందును భగవంతుని భావించి శ్రద్ధాభక్తులతో నాదర సత్కార మొనరింపవలయును. ఇవన్నియును భగవానుని పూజలే. సర్వవ్యాపకుఁడగు భగవాను నెచ్చట నే భావనతో భజించెదవో పూజించెదవో, అచ్చట నా భావన ననుసరించి ఆతఁ డచ్చట ప్రకటమగును. ఆతఁడు సర్వాత్మ సర్వేశ్వర భావమున సంతుష్టుఁడగును. ఎచ్చట ఎప్పుడేది అనుకూలపడిన నప్పుడచ్చట అట్టిపూజ నొనర్పవలయును.

సూతుఁ డిట్లనెను :- 'మునులారా! విగ్రహముల మీఁద గాక ఇతరస్థానములందు బూజ నెట్లు చేయవలయు నని ఉద్ధవుఁ డడుగఁగా భగవానుఁ డిట్లనెను :- 'ఉద్ధవా! ప్రతిమయందు బూజ యెట్లు జరుపఁబడునో అగ్నియందును నట్లే నా పూజను గావింపవలయును.

ఉద్ధవుఁడిట్లడిగెను :- 'స్వామీ! అగ్నిలో మీ పూజ యే విధిని జరుపఁబడును?'

భగవానుఁ డిట్లనెను :- 'అగ్నిలో నన్నుఁ బూజించు సాధకుఁడు ముందుగా హవన మొనర్చుటకై ఒక అగ్ని వేదిక నేర్పాటు చేయవలయును. ఆ వేది మేఖలాగర్తములు కలిగి యుండవలెను. లేకున్న హవనకుండమును ద్రవ్వి యేర్పాటు చేసి, దాని చుట్టును వేదిని వేయవలయును. అంత నాకుండ మున విధ్యుక్తముగ నగ్నిని స్థాపింపవలయును. తదనంతరము దానినిఁ బ్రజ్వలింపఁ జేయవలయును. ఊదియైనను (చేతి నడ్డము పెట్టుకొని) విసనకఱ్ఱతో నైనను, నూదు గొట్టముతో నైనను నూదవచ్చును. సరిగా నగ్నిని ఊదరాదు. అగ్ని ప్రజ్వలించిన తరువాత కుండమునకు నలువైపులను గుశలను పఱచవలయును. కుశలయొక్క అగ్రభాగములు దక్షిణపు వైపునకుగాని, పడమర వైపునకుగాని యుండరాదు. కుశలను బఱచిన తరువాత వానినిఁ బ్రోక్షింపవలయును. సమిధలను అన్వాధానము కావింపవలెను. అనఁగా సమిధల నొక్క

చోటికిఁ జేర్చవలయును. హవనీయ సామగ్రిని కుండమునకు ఉత్తర భాగమున నుంచవలయును. పాత్ర లన్నిటినిఁ గడిగి స్వచ్ఛ మొనర్పవలయును. అనంతరము ప్రోక్షణీపాత్రచే హోమోపయోగములగు సామగ్రిమీఁదఁ బ్రోక్షింప వలయును. ఆచమన ప్రాణాయామములను గావించి అందులో జతుర్భుజరూపుఁడగు భగవంతుని ధ్యానింపవలయును.'

ఉద్ధవుఁడిట్లడిగెను :- 'ధ్యాన మెట్లు చేయవలయును ? స్వామీ !'

భగవానుఁడిట్లనెను:- 'తప్తసువర్ణసదృశముగా నా తేజస్సు కలదు. నాలుగు విశాలభుజములు కలవు. వానిలో శంఖ, చక్ర, గదా, పద్మములు ధరింపఁబడి శోభాయమానముగ నుండును. నా సుందర సుకుమార, సుశోభిత, శాంత శరీరముమీఁద కమల కేసరములవలె బీతాంబరము శోభిల్లుచుండును. మనోహర దివ్యాంగములందు మణిమయ దివ్యాభూషణములు కలవు. శిరస్సునఁ గిరీటమును, ఉరమున దివ్యహారములును, కర్ణములందు కుండలములును, ముక్కున బులాకియును, వనమాలయును, కరములకు కంకణములు, భుజములకు భుజబంధములు (బాజూబందులు) వక్షఃస్థలమున శ్రీవత్సము, కమనీయకాంతియుక్తమగు కౌస్తుభమణి, కటియందు మొలనూలు, చరణములందు నూపురము శోభాయమానముగ నుండినట్లుండవలెను. ఇట్టి త్రైలోక్యమోహన

కరమగు రూపమును ధ్యానింపవలయును. అంత పూజకై పంౘెండు అంగుళములుగల సమిధలను నాహుతిగ నొసంగ వలయును. ప్రజాపతి ఇంద్రులకును, అగ్ని, సోములకును, ఆద్యభాగములను నామముతో రెండు రెండు ఆహుతుల నొసంగవలయును. అనంతరము సాకల్యాక ఆహుతులనొసంగ వలయును.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'స్వామీ! ఆహుతుల నే మంత్ర ములతో నీయవలయును.

భగవానుఁడిట్లనెను:- 'ఎవరి కే మంత్ర మగునో వారామంత్రముతో నాహుతులొనర్పవలయును.' అష్టాక్షర, ద్వాదశాక్షర, గాయత్రి, లేక పురుష సూక్తములతో 'స్వాహా' యని చివరజోడించి హవన మొనర్పవలయును. అంత శాస్త్రోక్తవిధిచేఁ బూజనక్రమమున ధర్మాది దేవతల కును నాయామంత్రములతో, నాహుతులీయవలయును. చివ రకు 'స్విష్టకృత్' మంత్రముతో హవన మొనర్ప వలయును. స్రువముతో ఘృతాహుతుల నొసంగి మిగిలిన దానిని 'ఇది ఫలాని దేవతయొక్క భాగము, నాది కాదని జలపాత్రలో వదలవలయును.'

ఈవిధముగ హవన మొనర్చి పూర్ణాహుతి నొసంగి, పూజానమస్కారము లైనతరువాత, నందసునందాది భగవ త్పార్షదులకు బలిప్రదాన మొనరింప వలయును. తదనంత

రము భగవంతుని స్మరించుచు మూలమంత్రమునుగొంచెము సేపు జపింపవలయును. భగవత్పార్షదులలోఁగల విష్వక్సేనా దులు భగవత్ప్రసాదమునే గ్రహించెదరు. కావున భగ వంతుని ప్రసాదమును ఆచమనమొనర్చి విష్వక్సేనాదులకు నివేదింప వలయును. ముఖశుద్ధి కొఱకు తాంబూలాదుల నొసంగి హారతి, పుష్పాంజలుల నొసంగవలయును. అనంత రము నా నామ గుణగాన మొనర్పవలయును. నాకథను జెప్ప వలయును. వినవలయును. నాచరిత్రల నభినయింపవలయును. తదనంతరము సమస్త పూజాపారాయణ లొనర్చి, నృత్య గానము లొనర్చి కొంచెముగ విశ్రమింపవలయును.'

సమస్త పూజలందును హారతి, ప్రదక్షిణ, పుష్పాంజలి క్షమాప్రార్థన మొక్కటిగనే యుండును. వేదమంత్రము చేతను, పురాణ మంత్రములచేతను, లేక ప్రాకృత భాషా స్తోత్రములతో నన్ను స్తుతింప వలయును. సర్వసాధారణ ముగ నేస్తుతులు చేయఁబడుచుండునో, భక్తులు వేనిని భగ వానుని సమ్ముఖమున గానము చేయుదురో, పఠించెదరో, అతనిఁ బ్రార్థించి, గద్గద కంఠముతో నిట్లు పలుక వలెను:- 'ప్రభూ! మీరీ పామరునియందు బ్రసన్నుఁడవు కావలయును. పరమాత్మా! నా సమస్తాపరాధములను క్షమింపవలయును.' ఈవిధముగ వినతి యొనర్చి, నేలపైఁబడి సాష్టాంగ దండ ప్రణామ మొనరింపవలయును. తన శిరస్సును నా పాదముల

మీఁదనుంచి కుడిచేతితో నా కుడికాలిని, ఎడమచేతితో నా యెడమ కాలినిదాకి వినతి చేయవలయును:- 'ప్రభూ! నే నీ మృత్యురూపమగు సంసారసాగరమును గాంచి భయభీతుఁడ నైనాను. శరణాగత వత్సలా! శరణాగతుఁడనగు నన్ను రక్షింపుము.'

ఈవిధముగ సాష్టాంగప్రణామమునొనర్చి, నిర్మాల్య, చరణామృత, నైవేద్యములను గ్రహింప వలయును. నాపై నుంచిన వనమాలను నాప్రసాదరూపమున శ్రద్ధాభక్తులతో స్వీకరించి మస్తకమున ధరింపవలయును. ప్రతిమావిసర్జన మైనచో నుత్తరపూజన మొనర్చి ఆతనితో నిట్లనవలెను:- 'సురశ్రేష్ఠా! నీవు నీస్థానమునకు వెడలిపొమ్ము. నా యిష్ట వస్తువును, మనోకామనను బూర్తి కావింపుము. మరల నే నాహ్వానించినపుడు మరల నీవు రావలెను' విసర్జనము లేకుండినచోఁ బ్రణామ మొనరించి శయనింపఁ జేయవలయును.

ఈవిధముగ అగ్నియందు దాహుతులద్వారా సూర్యనారాయణునియందు అర్ఘ్యాదులచే, జలమునఁ దర్పణాదుల చేతను, ప్రతిమాదులయందు సవిధి పూజనాదులచే నాపూజ చేయవలెను. ఉపాసకున కే సమయమున దేనిమీఁద శ్రద్ధయుండునో, ఆసమయమున నట్టిపూజనే చేయవలయును. ఏలననఁగా నేనందఱిలోను సదా సమానభావమునను న్నాను. ఈవిధముగఁ దనశక్తి ననుసరించి వైదిక, తాంత్రిక, మిశ్రిత

విధిచే నాపూజనొనర్చి సాధకుఁడు లౌకిక, పారలౌకిక సిద్ధులను బ్రాప్తింపవచ్చును. నేనత్యంత సంక్షేపమునఁ బ్రతిమాదుల పూజనుగూర్చి చెప్పితిని. ఇప్పుడు నీవేమి వినఁదలఁచుచున్నావు.'

ఉద్ధవుఁడిట్లడిగెను:—'స్వామీ! ప్రతిమను ఇంటిలో స్థాపించి పూజింప వచ్చునా?'

భగవానుఁడిట్లనెను:—'నాయనా! ఇది నీసామర్థ్యము ననుసరించి యుండును. ఇంతటి సామర్థ్యము లేనివాడును, వేఱుగా మందిరమును గట్టఁజాలక పోయినచో వారు గృహమునందే ఒక పూజస్థానము నేర్పఱచుకొని పూజింపవలయును. సామర్థ్యము గలవారెంత వైభవముగ నైనను బూజింపవచ్చును. ప్రపంచమందలి సమస్త సామగ్రులును నా ఉపయోగమునకు వచ్చినప్పుడే సార్థకములగును. ధనముండినను విత్తశాఠ్యమొనర్చి, ధనమును నాసేవా పూజలలో వినియోగింప కుండినచో నాతఁడు కృపణుఁడనఁబడును. అతని ధనము వ్యర్థము. అది దొంగవస్తువు వలెను, విధవా గర్భమువలెను సదా దాగియే యుండును. ఈ పాపమున నాతఁడు నరకమునకుఁ బోవును. ఓయీ! ధనము నేటివఱకెవఁడైన వెంటఁగొని పోయినాఁడా? పరమార్థమున వినియోగింపఁ బడినదే మన వెంట వచ్చును. ఇచ్చట కూడు కొనిన కొలఁది అంతటి అనర్థ మెక్కుడగుచుండును. అంతటి

అనర్థ మొనర్చుటచే, దాను దానికిసంరక్షకుఁడని భావించి, దానిని భగవత్పూజాదులతో వినియోగించి అత్యంతోల్లాసము తోడను ప్రమోదముతోడను జేయవలయును.'

ఉద్ధవుఁడిట్లడిగెను :-'ధనముండిన నేనేమిచేయ వలెను స్వామీ ?'

భగవానుఁడిట్లనెను :-'దైవవశమున ధనము లభించిన దానిని నీదియని యనుకొనకుము. నీవు ధనమును గొనువాఁడవును, కూడబెట్టువాఁడవును' జమా ఖర్చులు వ్రాయు సేవకుఁడవు. మంచి మంచి రాళ్లను దెప్పించి అత్యంత దివ్య దేవాలయములను గట్టింపవలయును. దానిమీఁద మనోహరములగు జిత్రములను వేయింప వలయును. దానికి ప్రక్కన సుందర పుష్పోద్యానములను నాటవలయును. విద్యార్థులకు పాఠశాలలను దెఱువవలయును. నా నిత్యనైమిత్తిక పూజలకు యథోచితములగు నేర్పాటులను గావింపుము. నిత్యమును భగవానునకు దివ్యభోగముల నొనర్పుము. సాధు మహాత్ములకును, అతిథి అభ్యాగతులకును, విద్యార్థులకును ధర్మచారులకును భోజనముల నిడుము. నిత్యమును నతివైభవముగ హారతుల నొసంగవలయును. విద్యార్థులు వేదపాఠ మొనరింపవలెను. గొప్ప గొప్ప ఉద్యానము లుండవలయును. ఉత్సవస్థానము లుండవలెను. వానిలో సుందర ఫల పుష్పయుక్తములగు వృక్షములను నాటవలయును. నానావిధము

అగు పుష్పములతో నిత్యమును వివిధమాలలను గట్టవల యును. ఫలములు నాకు నివేదింప వలయును. తులసీ వన మును నాటవలెను. నిత్యమును సుందర తులసీ, చందన చరణామృత, ప్రసాదములను బంచిపెట్ట వలయును. సవిధిగ నిత్యపూజ లొనర్పవలయును. నిత్యపూజలే కాక నైమిత్తిక పూజలను గూడ అప్పుడప్పుడు చేయుచుండ వలయును.'

ఉద్ధవుఁడిట్లడిగెను :–'నైమిత్తిక పూజయనిన నేమి ? స్వామీ!'

భగవానుఁ డిట్లనెను:– 'విశేష పర్వము లందును, ఉత్సవములందును జరుగు పూజకు నైమిత్తిక పూజయందురు. రామనవమి, జన్మాష్టమీ, నృసింహచతుర్దశీ, వామద్వాదశి, రథోత్సవము, డోలోత్సవము, దీపావళి, దసరా, మొదలగు నితరవిశేషపర్వములందు నైమిత్తికపూజ లొనర్పవలయును. పర్వములందు విశేష వైభవముగఁ బూజలొనర్పవలయును. నాకు ఉత్సవము చేయవలెను. మేళతాళముల నేర్పాటు చేయవలెను. నృత్య, గీత, సంకీర్తన, అభినయములు మొద లగు నానందోల్లాస కార్యము లొనర్పవలయును. నావాహన మును మేళతాళములతో గ్రామోత్సవ మొనర్పవలయును. వసంతోత్సవము లొనర్పవలయును. పవళింపుసేవ లొనర్ప వలయును. జయంతులందు జయంత్యుత్సవము లొనర్పవల యును. ఈ ఉత్సవము లెల్లప్పుడును జరుగు నట్లేర్పాటు లొనర్పవలయును.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'సదా ఉత్సవములు జరుగుటకై యేమి చేయవలసియుండును?'

భగవానుఁడిట్లనెను:- 'నా పూజకొఱకు వేఱుగా నిధి నేర్పాటు చేయవలయును. ముఖ్యద్వారమున వానిని గూర్చి వ్రాయించవలెను. గోపురములకును, నగరములకును దేవతా నామములనుంచుము. మందిరమునఁ దోటలను, పైరులను వేయవలెను. గొప్పగొప్ప నగరములందు వచ్చు అద్దెను మందిరములకు వినియోగించుము. ఇంకను నియమితముగు నాదాయము వచ్చు సాధనములేర్పాటు చేయవలయును. ప్రతిమాసమును ప్రతిసంవత్సరమును నాదాయము వచ్చున ట్లుండవలెను. ఎవరీ లోకమున నాపేరుతో నిట్లొనర్చెదరో, వారికంతమున నాకువలె నైశ్వర్యము ప్రాప్తించును.'

ఉద్ధవుఁ డిట్లడిగెను:- 'ఏ పూజా కృత్యముచే నే యైశ్వర్యము ప్రాప్తింపఁగలదు!'

భగవానుఁడిట్లనెను:- 'ఒక శిథిలాలయములో విగ్రహము పగిలిపోయినను, మందిరము కట్టి సగమున నాపివైచినను, మూర్తులను స్థాపింపకుండినను, యిట్టి మందిరములో నెవఁడు ప్రతిమలను బ్రతిష్ఠింపఁజేయునో, అట్టి కర్మఫలము వలన స్వర్గమునకుఁ బోవును. అచ్చట స్వర్గసుఖముల ననుభవించి చివరకు సార్వభౌమత్వమును బొందును. ఆలయము శిథిలమైనను, క్షీణించినను దానిని బాగుచేయించుటచేఁ ద్రిలో

శాధిపత్యము లభించును. ఆతఁడు స్వర్గమునకుఁబోయి దేవేంద్రుఁడగును. ఒక ఆలయములో విగ్రహములును స్థాపింపఁబడినవి. మందిరము సుందరముగఁ గట్టఁబడినది. దానిలోఁ బూజా సేవలకే సముచితములగు నేర్పాటులు లేకుండిన, నామందిరమునకు ధనమును వ్యయమొనర్చి పూజోత్సవాదుల నేర్పాటుగావించినచో వానికి బ్రహ్మలోక ప్రాప్తికలుగును. తాను స్వయముగ మందిరమును గట్టి, తానే అత్యంత శ్రద్ధాభక్తులతో ప్రతిమలను ప్రతిష్ఠించిన తరువాత తానేసేవాపూజలకు సముచితములగు నేర్పాటులను గావించినచో వారి విషయమునఁ జెప్పఁదగిన దేముండగలదుఁ? ఆతఁడు నా సమానుఁడగును. ఎవఁడు నిష్కామ భావముతోడ నన్నే భక్తుఁడు పూజించునో, ఆతఁడు నిస్సందేహముగ నన్నుఁబొందును. విధ్యుక్తమగు భక్తితో నన్నుఁ బూజించినచో వారికి నా భక్తియోగము ప్రాప్తించును.'

ఉద్ధవుడిట్లడిగెను:– 'స్వామీ! ఒకఁడు తన జీవితమున మీపూజకొఱకు తన సర్వస్వమును పొలము, తోటలు, దొడ్లు, గ్రామము, దుకాణములు మొదలగు వానిని వ్రాసియీయఁగా నాతని పుత్రపౌత్రాదులు దానిని లాగుకొని మందిరకార్యములకు వ్యయమొనర్పక, తమ స్వంతకార్యములకు వ్యయమొనర్చుకొనిన వారికి దోషముండదా?'

భగవానుఁడిట్లనెను :– 'దానిని దానమొనర్చువారి దోషమేమున్నది? ఆతఁడు శుద్ధచిత్తముతో దానమొనర్చి

నాఁడు. ఎవఁడీ దైవ సంపత్తి హరించినాఁడో ఆతనికవశ్యము దోషముకలిగితీరును.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'వానికేమి దోషము లభించును?'

భగవానుడిట్లనెను:- 'నాయనా! వాని దోషమును గూర్చి యేమియు నడుగకుము. ఇట్టివాఁడు లక్షల సంవత్సరములు మలములోని పురుగై పుట్టును. దేవ బ్రాహ్మణ వృత్తుల నెవరు హరించెదరో, ఆవృత్తిని దనవారు గాని, తన సంబంధులుగాని, ఇంక నన్యులుగాని యిచ్చియుండినదై నప్పటికిని వారు రౌరవనరకములకు పోయితీరెదరు. మలములోని పురుగులగుదురు. కావున బ్రాహ్మణునకు దానమొసంగిన వస్తువును, దేవసంపత్తినిఁ బొరబాటుననైనను హరింపరాదు. అట్లు చేయువానికేకాదు యీ దోషము లభించునది, దానికి సహాయమొనర్చువారికిని, అనుమోదించువారికిని, ఇట్లు చేయుటకుఁ బ్రేరించినవానికిని, నందఱకును దోషము లభించును. హరించువాని సహాయకుఁడు, ప్రేరకుఁడు, అనుమోదకుఁడు, ఈ నలుగురు సమానముగ బాపమును బొందువారగుదురు. ఇదే విధముగ నీ పుణ్యముల నొనర్చువారును, ఇట్టికార్యములకు యథాశక్తి తను, మన, ధనములతో సహాయమొనర్చునో, అట్టిపని చేయువారినిఁ బ్రేరించునో అట్టిదాని ననుమోదించువారును, వారికుత్సాహమును గలిగించువారును, అతనితో సమానమగు పుణ్యము నందఱును

బొందుదురు. కావున నిట్టి కార్యములను సదా అనుమోదన మొనరించుచుండవలయును.

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'స్వామీ! నేను పూజావిధిని వింటిని. నాకు మీరు సారాతిసారమగు నుపదేశ మొనర్ప వలయును.' సంసారమునఁ బరమార్థ వస్తువేది? ఈతఁడు పరమార్థపథపథికుఁడని గ్రహించు టెట్లు? ఈతఁడు యథార్థముగఁ బరమార్థమును బొందినాఁడా? లేదా? యని తెలియు టెట్లు?'

ఇది విని భగవానుఁడు మిక్కిలి ఆనందించి యిట్లనెను:- 'ఉద్ధవా! నీవు మిక్కిలి ఉత్తమ ప్రశ్న నొనర్చితివి. ఇప్పుడు నీకు సారాతిసారమగు పరమార్థతత్త్వమును గూర్చి చెప్పెద.

సూతుఁడిట్లనెను :- 'మునులారా! ఇప్పుడు భగవానుఁడు పరమార్థతత్త్వమును గూర్చి, ఏమి చెప్పెనో దానిని మీ కందఱకును జెప్పెదను.'

---

## సారాతి సారోపదేశము

శ్లో॥ పరస్వభావ కర్మాణి న ప్రశంసేన్న గర్హయేత్ ।
విశ్వమేకాత్మకం పశ్యన్ ప్రకృత్యా పురుషేణ చ॥

—శ్రీభాగ. ౧౧ స్కం. ౧ ౨౮ అ. శ్లో॥

వ. ఉద్ధవా! ఇతరులు కర్మములను ప్రశంసింపనురాదు, నిందింపనురాదు. ఏలననఁగా నీ విశ్వము ప్రకృతి పురుషుల యొక్క ఏకత్వమును భావింపవలయును.

—శ్రీమదాంధ్ర భాగవతము

అజ్ఞానమునకు మొదటి లక్షణము పరచర్చ, ఎవని మనస్సెంతగాఁ బరచర్చలో నిమగ్నమై యుండునో, అతఁడంతటి అజ్ఞాని. ఎచ్చటనైనను నలుగురు కూర్చుండినచో నిట్టి చర్చలేవచ్చుచుండు:- 'వీఁడు చాల దుష్టుఁడు. వీఁడు ఫలాని వానినిఁ గొట్టినాఁడు. పరస్త్రీగమన మొనర్చినాఁడు. ఫలానివాని ధనమును హరించినాఁడు. మేము ఫలాని వానిని మంచివాఁడనుగాననుచున్నాము. వాని దగ్గఱకు మేము ఫలాని పనికి పోయినాము. మమ్ముఁ జూడఁగానే లేచి నిలుచుండెను. మా పనిని వెంటనే చేసినాఁడు. వానికొక సోదరుఁడును గలఁడు. దారిలోఁ గనఁబడినచోఁ బెడముఖమును బెట్టుచుండునుగాని మాటలాడఁడు.' అని యిట్లు కొందఱను స్తుతించుటయును, గొందఱను నిందించుటయును జరుగుచుండును. నిందాస్తుతు లొనర్చువారి ఒగత్తును సత్యముగ భావించుచుందురు. ఇందలి పదార్థములు అపరివర్తనశీలములనియును, శాశ్వతములనియును భావించి కలహించుకొనుచుందురు. వీరికి స్వార్థమునకు సహాయపడినచో స్తుతించెదరు. స్వార్థమునకు విఘ్న మొనర్చినచో నిందించెదరు.

ఏ పదార్థము కొఱకై పోట్లాడుకొనుచుండిరో, అది అశాశ్వత మని వారికి దెలియదు. ఒక కథ కలదు-ఇద్దరు కూర్చుండి తా మిద్దరును గలిసి చెఱకు తోటను వేయవలయు ననుకొనిరి.

ఒకడిట్లనెను :-'బీజము నెచ్చటినుండి తెచ్చెదవు ?'

రెండవవాఁడిట్లనెను:-'ఫలాని వాని వద్ద మంచి చెఱకు మొలకలు కలవు. అచ్చటినుండి తెచ్చెదను.'

మొదటివాఁడిట్లనెను :- 'ఎన్ని కుంటలు నాటెదవు ?'

రెండవవాఁ డిట్లనెను :- 'పది కుంటలు చాలును.'

మొదటివాఁ డిట్లనెను :- అవును. ఆ పొలమున బాగుగా నెరువుపడినది. మంచి పెద్ద పెద్ద గడలు కాఁగలవు. నేను ప్రతి దినమును ఉదయముననే లేచి, నిత్యకర్మలు పూర్తి చేసికొని ఐదుగడలను బీల్చెదను.'

రెండవవాఁ డిట్లనెను :- 'అయితే నేను పదిగడలను బీల్చెదను.'

అంత మొదటివాడిట్లనెను :-'నీవు పది యెట్లు పీల్చెదవు ? నీవు పది పీల్చినచో నేనిరువది పీల్చెదను.'

అంత రెండవవాని కావేశము వచ్చెను. అతఁడిట్లనెను :-'నీవు ఇరువది దినుటెట్లు ? అట్లు చేసినచో నీతల పగులఁ గొట్టెదను.'

అంత నిద్దరును గట్టలను దీసికొని తలలను, శరీర మును విఱగఁగొట్టుకొనిరి. రాజద్వారమున నభియోగమును గావించుకొనిరి. న్యాయాధీశుఁ డంతయును విని యిట్లనెను:- 'మీరిద్దరును బది కుంటలు పొలమును దున్నితిరి. చెఱుకును గూడ వేసిరి. చెఱకు గడలను బీల్చితిరి. వాని కొఱకై కల హించుకొంటిరి. ముందుగా మీరు పదికుంటలభూమిని సంపా దింపుఁడు.

అంత వారిట్లనిరి :- 'మహారాజా! మేము పొలమును గొనలేఁదు. చెఱకును వేయలేదు. కాని కల్పిత చెఱకు కొఱకు దెబ్బలాడుకొంటిమి. దెబ్బలాడుకొంటిమి కావున దాని దండనము ననుభవింప వలసినదే.'

ఇంతకు చెప్పిన దేమనఁగా మనము మిథ్యాపదార్థము లను సత్యములని భావించి యితరులను నిందించుచున్నాము. కొందఱను స్తుతించుచున్నాము. పరమార్థమునుండి పతితుల మగుచున్నాము.'

సూతుఁడిట్లనెను:-'మునులారా! ఉద్ధవుఁ డుపేంద్రుని సారాతిసారమగు బరమార్థతత్త్వమును గూర్చి ప్రశ్నింపఁగా భగవానుఁడిట్లనెను :-ఉద్ధవా! సమస్తోపదేశములకును ముఖ్య మగు నుపదేశ మేమనగా-ఎన్నడును, బొరపాటుననైనను నెవరిని నిందింపనురాదు. స్తుతింపనురాదు.'

ఉద్ధవుఁడిట్లడిగెను :— స్వామీ ! అది యెట్లు జరుగఁ గలదు ? చెడ్డస్వభావము కలవానిని నిందింపవలసియుండును, మంచి స్వభావము గల వానిని ప్రశంసింపవలసి యుండును.

భగవానుఁడిట్లనెను:—'ప్రకృతిని స్వభావ మందురు. ప్రకృతియా త్రిగుణాత్మకము. గుణములందు సృష్టికాలము రాఁగానే వికృతి కలుగఁగాఁ బురుషునియొక్క సహాయముచే నీ విశ్వసృష్టి కలుగును. సాలీని గూటిలో నేమున్నది ! పడుగు పేఁకలయందు కలది దారమేకదా ! నీవు పడుగును నిందించినచో సూత్రమును గూడ నిందించినవాఁడ వయ్యెదవు. పేఁకను నిందించినను సూత్రమునే నిందించినవాఁడ వయ్యెదవు, సూత్రముగాక ఆవలలో నింకేమైన నుండినచో దానిని నిందింపవచ్చును. అదే విధముగఁ బ్రపంచమున నాకు తప్ప సత్పదార్థము లేనే లేదు. దృశ్య ప్రపంచమంత యును నసత్తే. దీనిని సత్పదార్థముగ భావించి యెవఁడు వ్యవహరించునో, ఆతఁడు శీఘ్రముగఁ బతనముకాఁ గఁలడు.'

ఉద్ధవుఁడిట్లడిగెను:—'అసత్తును సత్తుగా భావించిన నేమి హాని ?'

భగవానుఁడిట్లనెను:—'హాని చాలకలదు. నీ వసత్తునే చింతించుచుండినచాలు, దానియం దభినివేశము కలుగును. దేని నాలోచించిన నది కాఁగలఁదు.'

ఉద్ధవుఁడిట్లడిగెను:—' ప్రకృతినుండి మహాత్తత్త్వము, మహాత్తత్త్వమునుండి అహంకారము కలుగును. ఆదిసాత్త్విక

రాజస, తామస భేదములతో నుండును. రాజసాహంకారము చేత నే యింద్రియము లుద్భవించినవి.'

భగవానుఁడిట్లనెను :–'అవును, యథార్థమే. విచారించుము. ఇంద్రియములు తమోగుణాభూతము లైనచో నిద్రవచ్చును. అప్పుడు శరీరస్థజీవునకుఁ జైతన్యముండదు. ఆసమయమున స్వప్నావస్థయందు స్వప్నజగత్తును సృష్టించుకొనును. లేక సుషుప్త్యవస్థయందు అత్యంత విస్మృతి కలుగుటచే గాఢనిద్రగాని, లేక మృత్యువుగాని ప్రాప్తించును. ఇదే విధముగ నెవని మనస్సునందు సదా భేదభావముండునో ఆతఁడు భేదభావమునే పొందును. అసచ్చింతన మొనర్చుటచే నసత్ప్రాప్తియే కలుగును. నానాత్వము లేనిచోట నానాత్వమును స్థాపించుకొని మాయాజాలమునఁబడి మాటిమాటికిని బుట్టుచు గిట్టుచుండును.'

ఉద్ధవుఁడిట్లడిగెను:–'అయినను స్వామీ! చెడుదానిని జెడ్డగను మంచిని మంచిగను భావింపవలసియే యుండును.'

భగవానుఁడిట్లనెను:–'మంచిచెడ్డల నదియే మాటయేనా? ఓయీ! ఈ ప్రపంచమున మంచియేమి కలదు? చెడ్డయేమి కలదయ్యా! మంచిది. నేను నిన్నడుగుచున్నాను. నీవు బాగుగా వడఁబోసి తేల్చి ఇందులో నెంత భాగము చెడ్డదియో, ఎంత భాగము మంచిదియో? ఎంత శుభమో ఎంత అశుభమో?'

ఉద్ధవుఁడిట్లడిగెను:-'స్వామీ! మనమెవరిని మంచి వారని అందుమో, కొందఱువారినే చెడ్డవారందురు. మనమే వస్తువును జెడ్డదని అందుమో యితరులు దానికొఱకై ప్రాణముల నొసంగెదరు. ఇంత మంచిది, యింత చెడ్డది, యింత శుభము, యింత అశుభమని నిర్ణయించుట చాల కష్టము.'

భగవానుఁడిట్లనెను:-'నాయనా! ఈ ప్రపంచమున నీకు గనఁబడు నదంతయును నశ్వరమైనది. ఏది నశ్వరమో అది మిథ్య. వాక్కుతో నీ వే ఘుటపటములను గూర్చి చెప్పుచున్నావో, మనస్సుతో దేనినిగూర్చి చింతించుచున్నావోఁ అవి అన్నియును నసత్తులే, మిథ్యలే.'

ఉద్ధవుడిట్లడిగెను:-'స్వామీ! మిథ్యావస్తువుల వలన వ్యవహారము జరుగదు కదా! కొయ్యతో మిథ్యాహాయమును గావించినచో, దానివలన యాత్ర జరుగదు కదా! ఇసుకతో మిథ్యా మోదులను జేసినచో వానిచే నాఁకలి తీరదుకదా! ఇదే విధముగ వాస్తవమునఁ బ్రపంచమునఁ గల వస్తువులన్నియును మిథ్యలైనచో వీని మూలమున మనకు క్లేశము లేల కలుగుచున్నవి?'

భగవానుఁడిట్లనెను :-' మిథ్యా వస్తువుల వలనను క్లేశము కలుగుచుండును. రాత్రియందు నీవొక వంకఱకఱ్ఱ నీడను జూచి భూతమని భయపడెదవు. ఆ భ్రమ పోవువఱకు మిథ్యాఛాయను గాంచిన భయము కలుగుచునే యుండును.

చాలమంది ఆ ఛాయా భయముచేఁ జచ్చినవారును గలరు. వాస్తవమున నదిభూతముకాదు. సర్వథా మిథ్యాఛాయయే, కాని భ్రమ కలుగుటచే దానియందాతనికి సత్యత్వము గోచరించినది. దానివలన భయము కలిగెను. ఛాయవలనఁ బనులు కూడ కొన్ని నెఱవేరును. చాలమంది ఛాయాపురుషు నుపాసించి, సిద్ధినిఁబొంది, తమ యిచ్ఛానుసారముగ గొప్ప గొప్ప కార్యములను నెఱవేర్చుచుందురు. ఇంకొక దృష్టాంత మును వినుము. క్రొత్తగాఁగట్టిన యిండ్లయందును, గుహల యందును బిల్లలు మాటలాడు చుందురు. వారు మాటలాడు చుండిన మరలఁ బ్రతిధ్వని వచ్చును. అజ్ఞానులు గృహము మాటలాడు చున్నదనియు, గుహనుండి ధ్వనివచ్చు చున్న దనియు భావించెదరు. ఒక బావిలో సింహము గర్జించెను. కూపమునుండి దాని గర్జనము ప్రతిధ్వనించెను. ఇంకొక సింహము గర్జించుచున్నదని భావించి దానిలోనికి దుమికి చచ్చెను. యథార్థమునకు గుహలోనుండి వచ్చిన శబ్దము మిథ్యయే. కాని దానివలనఁ గార్యమగుట సంభవించినది. అది సింహమును జంపినది.

త్రాడు వంకరటింకరగఁ బడియుండుటచే దానినిఁ గాంచి ఒకఁడు సర్పమనుకొనెను. వాస్తవమున నచ్చట సర్పము త్రికాలములందును లేదు. కాని ఆతని మిథ్యాభాసము కలిగెను. ఆతని భ్రమ పోవువఱకాతఁడు

భయభీతుఁడై యుండును. ఒకఁడు దూరమున మెఱయు చుండిన ముత్యపుచిప్పనుగాంచి రజతమనుకొనెను. ఆవెండిని గైకొనవలయునని పరువిడి క్రిందపడి దెబ్బతినెను. దెబ్బ తగిలినది కాని, ఆ ముత్యపు చిప్పయందు వెండి యిదివఱ కును లేదు, ఇప్పుడును లేదు, ముందును నుండబోదు. కాని మిథ్యాభ్రమచే నాతనికి దెబ్బమాత్రము తగిలినది. దీనిని బట్టి వస్తువువలన నేమియును జరుగదని చెప్ప వీలులేదు. ఈ దేహమునే తీసికొనుఁడు. ఇది సత్పదార్థముకాదు. ఏక రసము కాదు. పరివర్తన శీలముకలది. నశ్వరమైనది. కాని మృత్యుపర్యంతము దీనివలన ననేక క్లేశముల ననుభవించు చున్నాము.

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'స్వామీ! కర్తలేక కార్యము జరుగదు. కార్యముండిన దానినిఁ జేయువాఁడును నుండును. దేవదత్తుఁడు గృహమున గట్టుకొనిన గృహము వేఱు, దేవ దత్తుఁడు వేఱు. దేవదత్తుఁడు గృహము కాలేదు. కుండ యును, కుమ్మరియును వేఱు వేఱుగ నున్నారు. కుమ్మరి వాఁడే కుండ కాదు.'

భగవానుఁడిట్లనెను:- 'కర్తా కార్యములు రెండును వేఱువేఱు కాదు. పాలే పెరుగురూపమునఁ బరిణతి చెందు నట్లును, సాలీడు తనలోనుండియే వలనల్లి మరలఁ దనలోనికిఁ దీసికొనునట్లును, ఆత్మయే, ఆత్మరూపమగు ప్రభువే విశ్వ

రూపమున బరిణతినిఁజెందెను. విశ్వమును రచించు బ్రహ్మయు నాతఁడే, విశ్వమును నాతఁడే. ఆతఁడే విష్ణువై పాలించును. విశ్వమై పాల్యుఁడగును. తానే రుద్రుఁడై జగత్తునకు సంహారకుఁడగును. తానే సంహృతుఁడగును. అన్యపదార్థములను బ్రకాశింపఁజేయు సూర్య, చంద్రాగ్ను లవసరము లగును, కాని సూర్యుఁడు కేవలము తన ప్రకాశము చేతనే ప్రకాశించును. తాను బ్రకాశించుట కింకొక బాహ్యప్రకాశ మక్కఱలేదు. ఇదేవిధముగ నాత్మ స్వయంప్రకాశమైనది. దాని కింకేమియు నక్కఱలేదు. ఆత్మకుభిన్నముగ గోచరించు నవియును నన్య పదార్థములునుద్వారా నిరూపితము కావు.

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'స్వామీ! ఆత్మ సత్యమైనపుడీ అసత్ప్రతీతి యెచ్చటినుండి వచ్చినది?'

భగవానుఁడిట్లనెను:-'సదసత్తుల ప్రతీతికి అధిష్ఠానము ఆత్మయే. ఆత్మయందే ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మిక భావప్రతీతి కలుగుచున్నది.

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'స్వామీ! కారణములేక కార్య ముండదు. ఈ యాత్మయందు గలుగు మూఁడు విధములగు ప్రతీతు లేల కలుగుచున్నవి?'

భగవానుఁడిట్లనెను:- 'కారణ మేమియును లేదు. అకారణముగనే ప్రతీతి కలుగుచున్నది. మూలము లేకయే అది భాసించుచున్నది. నాయిచ్ఛయే యేకైక కారణము,

ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మికము గుణమయ మైనది. మాయాకృతమైనది. అంతయును మాయాకృత మైనపుడు దీనియందు సత్యత్వబుద్ధికలిగి ఆసక్తి నేల చెందవలెను. మన మొకరిని నిందించెదము, ఇంకొకరిని స్తుతించెదము. అప్పుడు మనకీ సాంసారికవస్తువులందు సత్యత్వప్రతీతికలుగుచుండును. పిల్లలు మట్టితో బొమ్మలను జేసి అందులోఁ గొన్నింటిని ప్రేమించి, కొన్నింటిని ద్వేషించుచుందురు. మృత్తిక అంతయు నొకటే. నామరూపములను దొలిగించినచో మృత్తికయే మిగులును. నామరూపములు రెండును మిథ్యలే. నిందాస్తుతులకు స్థానమెచ్చటనున్నది.

ఉద్ధవుఁడిట్లనెను:- 'స్వామీ! ఎవరిని నిందింపకయు, స్తుతింపకయు నుండిన నింక జేయునదేమున్నది?'

భగవానుడిట్లనెను:- 'ఇట్టి జ్ఞాన విజ్ఞాన ప్రవీణత వచ్చిన తరువాత చేయవలసినదేమియుండును. ఆనందముగ నిర్విచారముగనుండి విచారణమొనర్పవలయును. ఏ సంఘట నమును గాంచినను నిట్లాలోచింప వలయును - ఇవి గుణ సఘాతమన్ని భావింపవలయును. ఒకనికి రజోగుణము వృద్ధి యైనఁ గ్రోధము కలుగును. తమోగుణము వృద్ధియైన నిద్రించును లేక యేదైన నుత్పాతమును గావించును. సత్వగుణము వృద్ధియైనచో జ్ఞాన ధ్యానములను గూర్చి యోచించును త్రిలోకములందును నేదియో గుణమున వర్తింపని వాఁడెవ

దును నుండఁడు. ఈ ప్రపంచము మాయా మాత్రమును త్రిగుణమయమునైయున్నది. మనస్సులో భేదభావము కలిగినపుడేదీనిలో భేదభావముగోచరించును. సూర్యనారాయణుఁడు ధర్మాత్ముని యింటను, చండాలునియింటను సమానముగఁ బ్రకాశించును. గంగాజలమును, విష్టామూత్రములందలిజలము లాగుకొనును. ఆతఁడు భేదములేక నిర్లిప్తభావముతో సర్వదా వ్యవహరించును. అట్లే తత్త్వజ్ఞానియును భేదరహితముగ వ్యవహరింపవలయును. ఆతఁడునిర్ద్వంద్వుఁడై, నిరీహుఁడై, నిర్లిప్తుఁడై, సమాన భావముతో సదా సర్వదా సర్వత్ర చరించుచుండును.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'స్వామీ! సంసారమునందసంగత యెట్లుకలుగును?'

భగవానుఁడిట్లనెను :- 'ఆత్మ అసంగమైనది. భ్రమవశమున మిథ్యాప్రపంచమున నాసక్తి కలిగినది. దానిని విచార వివేకములచేఁ దొలఁగించుచుండవలయును. చచ్చుచుండువారిని గాంచుచుండియును నీ శరీరము నెంతో ప్రేమించుచుందురు. వీరు శరీరమునే సర్వస్వమనుకొనుచున్నారు. శరీరముకొఱకే అసత్యము, పాపము, కపటాదుల నొనర్చుచున్నారు. ఆ శరీరమే నేఁడు ధూళిలోఁ బడినది. ఈగలు మూగియుండును, విసరి పారవైచినను, తగులఁబెట్టినను, బంచభూతములు పంచభూతములలోఁ గలిసిపోవును. ఇట్టి శరీరముమీఁదనాసక్తినిఁ జెందనేల?'

అనుమానము చేతను విచారించుము. కారణ మెట్లుండునో, కార్యమును నట్లే యుండును. మృత్తికతో బొమ్మలను జేసి వానినెంతగా నలంకరించినను నదిమృత్తికయే. ఇదేవిధము నీ శరీరము అన్నము, పప్పు, కూరలవలన నేర్పడి నది. నేఁడన్నమును వండియుంచుము లేదా రొట్టెను జేసి యుంచుము. మరునాఁటికి పాసి, కుళ్లి దుర్గంధము వచ్చును, దానిలోఁ బురుగులుపడును, అప్పుడు తినుటకు యోగ్యముగ నుండదు. ఈ నశ్వర, అనిత్య, దుర్గంధ యుక్తములగు పదార్థములచే నేర్పడిన యీ శరీరము నిత్యముగ నెట్లుండఁ గలఁదు. నిమ్మచెట్టునకు మామిడిపండ్లెట్లు కాయఁగలవు?'

శాస్త్రవచనములను విశ్వసించినను సంసారముయొక్క అనిత్యత ధ్రువపడును. ఈ శరీరమనిత్యమనియు, సాంసారిక వస్తువులన్నియును నశ్వరములనియును, వీనిపై మోహమును జెందరాదనియు శాస్త్రములు ఢంకామీఁద దెబ్బను గొట్టి చెప్పుచున్నవి. శాస్త్రము నంగీకరింపకుండినను స్వయముగ ననుభవపూర్వకముగఁ దెలిసికొనవచ్చును. మొదట మనము బాలకులము. యువకులమైతిమి. ఇప్పుడు వృద్ధులమైతిమి! శరీరము శిథిలమైనది. దినదినమును క్షీణించుచున్నాము. ఈ శరీరముమీఁద నింతటి మమకారమును, మోహమెందులకు ఇది తప్పక నశించి తీరును. ఈ నశ్వర వస్తువుతో సంబంధ

మేల పెట్టుకొనవలెను? తనదనుకొను టెందులకు? ఈ సాంసారిక పదార్థము లన్నియును ననాత్మయు, నసత్తును, ఆద్యంత యుక్తములు, అసారములు. వీనియందలి సంగ మెందులకు! నిస్సంగులై ఆత్మను స్మరింపవలయును.'

ఉద్ధవుడిట్లడిగెను:- 'స్వామీ! నాకొక సందేహము కలదు. ఈ ప్రపంచప్రతీతి దేనివలనఁ గలుగుచున్నది? శరీరమున రెండు వస్తువులు కలవు. ఒకటి ఆత్మ, రెండవది శరీరము. ప్రపంచోపలబ్ధి ఆత్మలోఁ గలుగునా? ఆత్మ స్వయంప్రకాశమైనది. జ్ఞానస్వరూపము. సాక్షిమాత్రము. దీనిలో నజ్ఞానప్రతీతి యుండఁజాలదు. సూర్యుఁడున్నచోట నంధకార మెట్లుండఁగలదు? సాక్షికి అపరాధ ముండదు. ఆత్మోపలబ్ధి యుండదని నీవనుచో దేహమునకందుమా అది జడమైనది. జడమున కేమి ప్రతీతి కలదు? అంధకారమును అంధకారము మ్రింగివేసెననుట పిష్టపేషణము కాఁగలదు. జడమునందు జడ మెట్లు భాసించును. అగ్ని యెట్లు సర్వవ్యాపకమో, అవ్యయమో, అనావృతమును, నిర్గుణమును, మలరహితమును, విశుద్ధ స్వయంప్రకాశమునునై యున్నది. దేహము కాష్ఠమువలె జడమైనది. అట్టియెడ యీ ప్రపంచము కనఁబడున దెవరికి?'

ఇదివిని భగవానుఁడు నవ్వి యిట్లనెను:-'ఉద్ధవా! నీవు ఉత్తమ ప్రశ్నమును గావించితివి. విషయమును దెలిసికొనఁ

జాలనివాఁడేమి ప్రశ్నింపఁ గలఁడు. కావున నట్టి ప్రశ్నను నీవే అడుగఁ గలవాఁడవు. అడిగినను నేదో యడుగును. నీప్రశ్న యుక్తియుక్తమైనది. ఇప్పుడు నేను నీ ప్రశ్నకు సమాధానమును జెప్పెదను.'

సూతుఁడిట్లనెను:- 'మునులారా! భగవానుఁ డెట్లు ఉద్ధవుని ప్రశ్నకు సమాధాన మొసంగెనో, దానిని నేను మీకుఁ జెప్పెదను. మీరు దీనిని సమాహితచిత్తులరై శ్రవణ మొనర్పుఁడు.'

---

## సంసార మసారమైనది

శ్లో॥ యావద్దేహేంద్రియప్రాణై రాత్మనః సన్నికర్షణమ్।
సంసారః ఫలవాంస్తావ దపార్థోఽప్యవివేకినః ॥

శ్రీభాగ ౧౧స్కం. ౨౨ అ. ౫౫ శ్లో॥

వ. ఉద్ధవా ఎంతవఱకు అవివేకియొక్క శరీర, ఇంద్రియ, ప్రాణమనములతో సంబంధముండునో, అంతవఱకు సంసార మంతయును నసత్తైనను వానికి సుఖదుఃఖ రూపమగు ఫలము నొసంగును.

ఒక సామెతకలదు. 'అనుకొనిన దేవుఁడనుకొనుము, లేదా రాయి అనుకొనుము' వాస్తవమునఁ గాంచినచో నీ ప్రపంచము మాన్యతమీదనే ఆధారపడి యున్నది. ఎచ్చ

టనో పిల్లపుట్టినది, ఇంకెచ్చటనో పిల్లవాఁడు పుట్టినాఁడు. ఇద్దరికిని నే సంబంధమును లేదు. ఎఱుక లేదు, గుర్తు లేదు. పరస్పర మొకరొకరు భార్యాభర్తల మనుకొనిరి. అంగీకరించిరి. కష్టమో నిష్ఠురమో యిద్దరును సహించుకొందురు. ఈతఁడు మాగురువు, మిత్రుఁడు, సంబంధి ఈ విషయము లన్నియును మాన్యతమీఁదనే ఆధారపడియున్నవి. మనస్సు ఎవని మంచివాఁడనుకొనిన మంచివాఁడుగనే కనఁబడును. చెడ్డగా భావించినఁ జెడ్డగానే కనఁబడును. వాస్తవమున మంచివారును లేరు. చెడ్డవారును లేరు. అంతటను నొకే తత్వము కలదు. ఒకే సువర్ణము నానాభరణముల రూపమున నేర్పడినది. ఆభరణము లగుటకు ముందునుసువర్ణమే. ఆ యాభరణములు నశించినతరువాతను సువర్ణమే శేషించి యుండును. మధ్యలోవచ్చిన నామరూపములవలన గొలుసు, కంటె, గాజులు, వడ్డాణము, ఉంగరములను పేర్లు వచ్చినవి. ఈ నామరూపము లన్నియును మిథ్యలే. అది ఆభరణములై నపుడును దాని సువర్ణత్వము నశింపలేదు. వీలసనఁగా సిద్ధాంతము ననుసరించి ఆద్యంతములో నుండునది మధ్యలోను నుండును.

సూతుఁడిట్లనెను:—'మునులారా! దేహము జడము, ఆత్మ చైతన్యమును, స్వయం ప్రకాశమునై యుండఁగాఁ బ్రపంచము దేనియం దేర్పడినదని ఉద్ధవుఁడడుగఁగా నంత

భగవానుఁడిట్లనెను :-'ఈ ప్రతీతి జడమునను లేదు, చైతన్యమునను లేదు. కేవలము భ్రమమిాఁద నేకలదు.'

ఉద్ధవుఁడులికిపడి యిట్లడిగెను :-'స్వామీ! భ్రమప్రతీతి యెట్లుండును ? భ్రమ యెచ్చట నుండును ?'

భగవానుఁడిట్లనెను :-'నాయనా! అన్నిటికిని అధిష్ఠానమాత్మయే.'

ఉద్ధవుఁడిట్లడిగెను :-'ఆత్మ స్వయం ప్రకాశమును, జ్ఞాన స్వరూప మగుచుండఁగా దానిలో భ్రమ యెట్లు కలుగును ? ప్రకాశముండగా నంధకార మెట్లుండగలదు ?'

భగవానుఁడిట్లనెను :-ప్రకాశమంధకారము యొక్క నివృత్తి కావించును. కాని ప్రకాశముండఁగా నంధకారముండఁజాలదు. దీపము క్రిందనే అంధముండును. కాని ఆ యంధకారము ప్రకాశ సమ్ముఖమున నే యనర్థమును గావింపఁజాలదు. ఇదే విధముగ సంసారము సర్వథాఅసత్తే. కేవలమాత్మయే సత్తు. శరీరమున్నంతవఱకును, ఇంద్రియము లున్నంతవఱకును, ప్రాణ మనస్సులతోఁ బురుషునకు సంబంధమున్నంతవఱకు, అవివేక మున్నంతవఱకు సంసార ప్రతీతి యుండును. దానివలన వచ్చిన బుణ్యాపాపములునునుండును, వానికి సంబంధించిన సుఖ దుఃఖములును ననుభవింప వలసి వచ్చును. జీవున కజ్ఞానము నివృత్తియైనచో, సంసారము యొక్క సత్యత్వమును నివృత్తియగును.'

ఉద్ధవుఁడిట్లడిగెను :-'స్వామీ ! అసత్తువలన దుఃఖము కలుగఁజాలదు. గొడ్డురాలికి పుత్రుఁడే లేకుండిన, నామె పుత్రునకు తలనొప్పి యెట్లు రాఁగలదు ?'

భగవానుఁ డిట్లనెను :-'అసద్వస్తువుచేతను దుఃఖము కలుగును. స్వప్నమున మనమొక భయంకర పురుషుఁడు చేతిలోఁ దీక్ష ఖడ్గమును దీసికొని వచ్చుచుండుటను ఆతఁడు మనలను జంపుటకు వచ్చుచున్నట్లుండిన నా సమయము నందు గొప్ప క్లేశము కలుగును. స్వప్న పురుషుఁడును, స్వప్న ఖడ్గమును రెండును నసత్తులే. కాని స్వప్నముపోయి జాగ్రదవస్థ రానంతవఱకు, ఆ అసద్వస్తులచేఁగష్టము కలుగు చునే యుండును. స్వప్నమున నివి లేకుండినను సత్యముగ భాసించును. కష్టమును నంతగానే కలుగును. అనఁగా జాగ్రత్తలోఁ గత్తితోఁ గొట్టిన నెంతటి బాధ కలుగునో అంతటి బాధ కలుగును. భయమును నట్లేయుండును. ఇదే విధముగ నీ ప్రపంచమును బొత్తుగా నసత్తైనది. కాని అజ్ఞానమునఁబడిన ప్రాణి, వీనిని సత్యముగ భావించి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను జింతించు చుండు వఱకే సంసార నివృత్తి కానేకాదు. త్రికాలములందును గాదు. నిద్రించుచు స్వప్నమును జూచుచుండు నంతవఱకు క్లేశమును బెందుచునే యుండును. మేల్కొన్న తరువాత నాతనికి

భయమును లేదు, శోకమును లేదు, భయమును లేదు, మేల్కొన్న తరువాత ఆతఁడు నవ్వుకొనును. ఆ స్వప్న వస్తువులు విలీనములగును. విలీనములగుటేమి ? అవి లేనే లేవు. ఇదే విధముగ నజ్ఞానావస్థలోనే మానవుఁడీ మాయిక అసత్పదార్థములచే భయపడును. జ్ఞానోదయము కాఁగానే నిర్భయుఁడగును. ఒక్క విషయమును విచారించుము. పుత్రుఁడు చచ్చినఁ దండ్రికి అత్యంత దుఃఖము కలుగును, ఇంకొక పుత్రుఁడు పుట్టిన నత్యంత హర్షము కలుగును. బలవంతుఁడు శస్త్రమును దీసికొని కొట్టవచ్చినచో భయమునఁ గంపము కలుగును. ఎవడైన మనకు విరుద్ధముగ నడచినఁ గ్రోధము కలుగును. ద్రవ్యము లభించిన లోభము కలుగును. అత్యంతసుందరియగు భార్యవలనను, పసివాఁడగు పుత్రుని యెడలను మోహము కలుగును. మనవద్దఁ లేని వస్తువును బొందఁ గోరిక కలుగును. మన బంధువు మరణించిన సంతాపము కలుగును. ఇవన్నియును నెచ్చట కలుగుచున్నవి ?'

ఉద్ధవుఁడిట్లనెను:– 'స్వామీ! ఇవన్నియును బ్రపంచమున నుండుటచే వచ్చుచున్నవి.'

భగవానుఁ డిట్లనెను :– 'ప్రపంచమున నెందఱో బాలకులు పుట్టుచున్నారు, చచ్చుచున్నారు. వారందఱు చచ్చుచుండిన మనకు దుఃఖము కలుగుటలేదు, పుట్టుటచే సుఖము కలుగుటలేదు.'

ఉద్ధవుఁడిట్లడిగెను :- 'స్వామీ! వారితో మనకు సంబంధము లేదు. ఎవరితో మనకు సంబంధముండునో వారు పుట్టునపుడును, జచ్చునపుడును హర్షశోకములు కలుగును.

భగవానుఁడిట్లనెను :- 'అవును నిజమే. శోక, హర్ష, భయ, క్రోధ, లోభ, మోహ, స్పృహా, జన్మ, మృత్యు మొదలగు భావములన్నియును నజ్ఞానజనిత అహంకారముననే కలుగును. అహంకార కారణముననే మమత్వము కలుగు చున్నది. అహంకార మమకారములవలననే సంసారప్రాప్తి కలుగుచున్నది. ఆత్మ,నిత్య, శుద్ధబుద్ధమైనది. దానికి సుఖ దుఃఖాది ద్వంద్వములతోనేమియును సంబంధము లేదు.'

ఉద్ధవుఁడిట్లడిగెను :- 'స్వామీ! నా ప్రశ్న అట్లే యున్నది. ఈ ప్రపంచప్రతీతి చైతన్యమగు నాత్మకా లేక జడమగు శరీరమునకా?'

భగవానుఁడిట్లనెను:- 'శరీరమునకుగాని, ఆత్మకుగాని లేదు. ఈ ప్రపంచ ప్రతీతి జీవునకే.'

ఉద్ధవుఁడిట్లనెను :- 'స్వామీ! జీవుఁడని యెవరి నందురు?'

భగవానుఁడిట్లనెను:- 'దేహేంద్రియ ప్రాణమనస్సుల యందభిమానముగల యే అంతరాత్మ కలదో, దానినే జీవుఁ డందురు. గుణ కర్మలే ఆతని స్వరూపము. దానినే కొందఱు సూత్రాత్మ యనియు, కొందఱు మహత్తనియు, కొందఱు

మహాత్తత్వమనియు నందురు. ఈ విధముగ వేఱు వేఱు ఋషులు వేఱు వేఱు నామములతోఁ జెప్పిరి. అట్టి అఃతః కరణాభిమానియగు జీవుఁడు కాలకర్మాధీనుఁడై ప్రపంచమున బుట్టి చచ్చుచున్నట్లు తోచును. నానా ఉచ్ఛ నీచ యోను లలో భ్రమించుచుండును.'

ఉద్ధవుడిట్లడిగెను:- 'స్వామీ! ఈ సంసార చక్రము వీడునదెట్లు? ఆత్మజ్ఞానమెట్లు ప్రాప్తించును?'

భగవానుఁడిట్లనెను :- 'ప్రపంచమున నీవు చూచు మంచి, చెడ్డ, సుఖదుఃఖ పదార్థము లేవియును లేవు. అవి మనస్సే. మనస్సే నానారూపములను ధరించి వచ్చును. మనస్సు వెనుకనే ఇంద్రియములు పోవుచుండును. ప్రాణము లును వానిననుసరించును. శరీరమును దాని సంకల్పముచేతనే కర్మలొనర్పఁబూనును. సంసారమందలి సమస్తకార్యములు జరుగుచుండును. ఇవన్నియును నిర్మలములును భ్రాంతములు నైయున్నవి. విషయములలోనికిఁ బరువిడుచు మనోనుకూలత నన్వేషించుచుండును. విషయములందజ్ఞానవశమున సుఖాను భవమును జెందుచుండును. వానియందు దృష్టకలుగును. సంసారము సుదృఢమగుచుండును. మమత్వము కలిగినచో నాసక్తి కలుగును. సంసారాసక్తియే బంధనమునకు మూల కారణము. కావున సద్గురు చరణముల నాశ్రయించి, ఆతనికి సేవా శుశ్రూషలొనర్పవలయును. నిష్కపట భావముతో

నాతని నుపాసించవలెను. జ్ఞానమెచ్చటినుండియును దేనవ సరము లేదు. ఉపయోగింపకపోయినచో నది కుంఠిత మగును. దానిమీఁద నేదో పడినది నీవు కొన్నాళ్లు కంటికి పట్టీని కట్టుకొనినఁ గొన్నాళ్ళకు జ్యోతిపోవును. కన్నులు కనఁ బడవు. చేతిని బైకెత్తియుంచుము. కొన్నాళ్ళకది క్రిందకు రాదు. అద్దమునట్లే కొన్నాళ్లుంచిన దానిమీఁద దుమ్ము పేరుకొని రూపము గనఁబడదు. చివరకు దర్పణముకూడ కప్పఁబడిపోవును. దైవవశమున నొక జ్ఞానియగు గురువువచ్చి ఆజ్ఞాపించి నా దర్పణము మీఁద ధూళి తుడువఁబడును. అప్పుడు దర్పణమున నీ స్వరూపముకనఁబడును. గురుదేవుఁడు నీస్వరూపము నెచ్చటినుండియో తెచ్చి దర్పణమునఁ బెట్ట లేదు. ఆతఁడు కేవలమావరణమును దొలఁగించినాఁడు. స్వరూపము కనఁబడు స్వభావము దర్పణమున కిదివఱకును గలదు. గురువు దానిని నిర్మలమొనర్చు యుక్తినిఁజెప్పినాఁడు. ఒక మొక్కకు నలువైపులను గడ్డిగాదము మొలిచి అల్లు కొనినది. నీదగ్గఱ కొడవలియుండినను, దానిని వినియోగింపక పోవుటచే గుంఠితమై మైల యేర్పడెను. అందువలనఁ జెట్టు కనఁబడలేదు. నీవు కొడవలితో గడ్డినిఁ గోసినచో మొక్క కనఁబడినది. ఇదే విధముగ గురువు చెప్పిన ఉపాసనద్వారా జ్ఞాన ఖడ్గమును సానబెట్టి, అజ్ఞానజనితమగు గడ్డితోఁ బూడిపోయిన దానిని ఖండించి, తృష్ణా రహితుఁడవు కమ్ము.

అంత నిర్ద్వంద్వుడవై యెచ్చటనైనను బృథివిపై విచారింపుము. ఇంకఁ జింత యుండనేయుండదు. జ్ఞానులిదే విధముగ దృష్టా మూలమును దెగఁగోసి బ్రహ్మానంద సుఖానుభవ మొనర్చుచు నీ శరీరము తోడనే జీవన్ముక్త్యానందమును జూరుకొందురు. కావున నే నీవిషయమును గట్టిగఁ జెప్పుచున్నాను. అనేక సార్లు చెప్పెదను. ఈ జగత్తున కాద్యంతములం దేతత్త్వము కలదో, అది మధ్యలోను గలదు. మొదట సత్తొకటే యుండెను. సృష్ట్యంతమున నంతయును సంహరింపఁబడును. కేవలము సత్తే మిగులును. ఆదిలోను సత్తు, అంతము నను సత్తుండిన మధ్యలోన సత్తెట్లుండఁగలదు. మధ్యలోను నది ప్రకాశముగను, ఉపాదాన కారణరూపమునను నున్నది. ఈ విజ్ఞానము లేనివాఁడవివేకి. ఈవివేకము కలవాఁడేజ్ఞాని.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'స్వామీ! ఇట్టి 'జ్ఞానము చాల కఠినమైనది.

భగవానుఁడిట్లనెను:- 'నాయనా! కఠినమే కాదు. మంగలికత్తిమీఁద నడిచినట్లే. కాని గురువు కృపచే నీ జ్ఞానము ఉపాసనద్వారా లభింపఁగలదు. అట్లనేకులకు గలిగినది. జ్ఞానమున కనేకసాధనములు కలవు. వానిలో వేద పఠన, తపస్సుచేయుట, స్వధర్మపాలన మొనర్చుట, స్వాధ్యాయ ముగ సంసారముయొక్క అనిత్యతనుగాంచి తెలిసికొనుట. పౌరాణిక రాజులు మహారాజులును బ్రసిద్ధులును, యశము

నార్జించిన వారును భోగములనుభోగించి చివరకు నిర్ణయము చేసినారు. దీనినిగూర్చి మీమాంస నొనర్చుటయే ముఖ్య సాధనము. శాస్త్రములలోఁ బ్రత్యక్షానుమాన నుపభోగ, శబ్ద, ఐతిహ్యాది ప్రమాణములచే నీ సంసారము నణంచుటయే జ్ఞానసాధనము. సంసారమున నేనుగాక యింకొక సత్తు లేదు. బొమ్మలుగాఁ జేయుటకు ముందును జక్కెరకలదు. బొమ్మలు పగిలినతరువాతను జక్కెరయు కలదు. దానికనేక నామము లును, రూపములును నేర్పడినపుడును జక్కెరగాక యింకొకటి యేమియును లేదు. సత్వరజస్తమస్సులకు బూర్వమేమున్నది. నిర్గుణమే. ఆనిర్గుణుఁడను నేనే. జాగ్రత్స్వప్న సుషుప్తులకు బూర్వమేయవస్థకలదు. తురీయము కలదు. ఆ తురీయమును నేనే. కార్యకారణకర్తా వీని కన్నింటిని సమన్వయ వ్యతిరేక ములచే విచారించినచో, నేనొక్కఁడనే మిగిలి యుందును.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'స్వామీ! అన్నియును మీవల ననే ఉత్పన్నమైనవని అంగీకరించితిని. కాని ఉత్పన్నమై మీకు వేఱుగనుండును. తండ్రివలనఁ బుత్రుఁడు పుట్టును. ఆతని ఆస్తిత్వము వేఱుగనున్నట్లు గాంచుచున్నాముగదా'

భగవానుఁడిట్లనెను:- అట్లుకాదు. పుత్రుఁడు తండ్రికి వేఱుకాఁడు. శ్రుతి 'ఆత్మావై పుత్రనామాసి' ఆత్మయే (తానే) పుత్రరూపమున నుత్పన్న మగుచున్నాఁడని చెప్పు చున్నది. ప్రాణి తానే పత్నియొక్క గర్భమున మరలఁ

బుట్టుచున్నాఁడు. అందువలన నామెకు జాయయను పేరు వచ్చినది. పుత్రుఁడు తండ్రికన్న్యుఁడుకాఁడు. అగ్నిలోనుండి మిణుగురులు లేచిన నవి అగ్నికన్యముగ లేవు. జలమునుండి బుడగలు లేచును. తరంగము లుత్పన్నము లగును. అవి జలమున కన్యమైనవి కావు. బుడగ పుట్టుటకు ముందును జలము, బుడగ నశించినతరువాతను జలమే. ఈ మధ్యలో వచ్చిన నామరూపములు కేవలము చెప్పుకొనుటకే పనికి వచ్చును. అవి సత్యములు కావు. కావున శాస్త్రముయొక్క నిశ్చితసిద్ధాంత మేమనఁగా నుత్పన్నమైనవస్తువు తనకుత్పాదకమైనవస్తువు అయితీరును. మృత్తికనుండి పుట్టిన వస్తువులు మృత్తికకు అన్యమైనవి కావు. సూర్యుఁడు నేత్రములకు ప్రకాశప్రదానమును గావించుచున్నాఁడు. కనఁబడకుండినను సముదాయ రూపమున రాజస సృష్టిగ గోచరించునది. బ్రహ్మకు అతిరిక్తమైనది కాదు. అంతయును బ్రహ్మయే. ఇందులో నిసుమంతైన నానాత్వము లేదు. స్వయంప్రకాశమానమగు సచ్చిదానందరూపమే. ఇంద్రియ రూపమునఁ గనఁబడునదియును బ్రహ్మయే. ఇంద్రియోపభోగమునకై కనఁబడు నానావిషయములును బ్రహ్మయే. మనోరూపమున మనన మొనర్చునదియును బ్రహ్మయే. పంచభూతరూపమునఁ గనఁబడున దంతయును బ్రహ్మయే. ఉద్ధవా! నీకెంతని చెప్పఁగలను? చిత్రవిచిత్ర రూపమునఁ గనఁబడున

దంతయును బ్రహ్మయే. నాకన్యమైన దేదియును లేనే లేదు. అన్వయ వ్యతిరేకములద్వారా కనఁబడున దిదియంతయును నసత్తునియు నిది త్రికాలముల యందును లేదనియు సిద్ధాంత మొనర్పఁబడినది. ప్రత్యక్షాది ప్రమాణములద్వారా అనాత్మ నిరాకరణముచేఁ దన హృదయమందలి సందేహములను యుక్తులవలన నివారించుకొనవలయును. అంత విషయోపరతినిఁజెంది ఆత్మానందమున నిమగ్నుఁడు కావలయును?'

ఉద్ధవుఁడిట్లడిగెను :–'స్వామీ! నివారించుకొనుటెట్లు?

భగవానుఁడిట్లనెను:–'ఈ శరీరమాత్మ కాదని విచారించుము. ఏలననఁగా నిది నశ్వరము. ఆత్మ అవినాశి. ఇంద్రియములును నాత్మకాదు. ఏలననఁగా నివి పరప్రకాశితములు. ఆత్మ స్వయం ప్రకాశము. ఇంద్రియముల కధిష్ఠాతృదేవుఁడాత్మకాదు. ఏలననఁగా నవి పరతంత్రములు. ఆత్మ స్వతంత్రము. పృథివ్యప్తేజో వాయురాకాశములును, అన్నమయకోశమును, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, మహత్తత్త్వము, ప్రకృతి వీనిలో నేవియును నాత్మకాదు. ఏలననఁగా నివి యన్నియును జడములే.'

ఉద్ధవుఁడిట్లనెను:– స్వామీ మీరింద్రియములను,మనస్సును జడమనుచున్నారు. కాని యీ సమస్తమునకును మూలము లీ యింద్రియములే. ఇవి నానా విషయములను భోగించును. చిత్తమును జంచల మొనర్చును.'

భగవానుఁడిట్లనెను :–'నాయనా! అంతర్బాహ్యేంద్రియములు రెండును నజ్ఞానికే దుఃఖము నొసంగును. జ్ఞానయుక్తమగు నాత్మకలవాని నీ గుణమయములగు నీ యింద్రియము లేమియును జేయఁజాలవు. ఇవి విక్షిప్తమైనచో దానిని విచలితము గావింపఁజాలవు. సమాహితము లైనచో నది అధికమగు నానందము నొసఁగఁజాలదు. వేయించిన గింజలను మంచి తడిసిన నేలలోఁ జల్లినను నంకురింపఁ జాలవు. ఎన్ని ప్రయత్నము లొనర్చినను వానిని మొలిపింపఁ జాలరు. ఈ జడవస్తువు లజ్ఞానినే మాయలోఁ బడవేయును. ఆత్మ ఆకాశమువలె నిర్లేపమైనది. దాని మీఁద దుమ్ము జల్లినను, నీటినిఁ జిలకరించినను, అగ్నిని వైచినను, ఎంత వాయువును వీచినను, ఇవి తమ కార్యములచేతను, శీత వర్షాతపాది ఋతువులచే నాకాశము లిప్తముకాదు. ఆకాశము మీఁద వీని ప్రభావము పడదు. సూర్యుని మీఁదుగ నెన్ని మేఘములు పోయినను దానిచుట్టు చేరినను, దాని కెట్లు హానికలుగదో అట్లే ఈప్రాకృత పదార్థములు నా ఆత్మను నాచ్ఛాదితము చేయఁజాలవు. ఆత్మ అహంకార రహితమై నదియును నక్షరమును, నిర్వికారమును, జగత్కారణ భూతమును నయ్యుండ నీ త్రిగుణముల మలముతో నెట్లు కలియగలదు?

ఉద్ధవుడిట్లడిగెను :-‘ ఆత్మ నిత్య శుద్ధ బుద్ధమైనచో; దుస్సంగము చేయరాదను విధివచన మెందులకు ?’

భగవానుఁడిట్లనెను :-‘ఈ వచనములన్నియు సాధకులకు నాయందు దృఢానురాగము కలగనంతవఱకును మనోమలమును గావించు రజోగుణము నాభక్తిచే నివృత్తి చెందనంత వఱకును ఈ మాయారచిత గుణ సంగమును ద్యజింపవలయును. నిరంతరము సత్సంగము కథాశ్రవణాది సత్కర్మల యందు మనస్సును లగ్నముచేసి యుండవలయును. ఈ విధముగ శాస్త్రీయ విధిచే సాధనమొనర్చిన సిద్ధి ప్రాప్తించును. అట్టివానికి విధి నిషేధ బంధన ముండదు.’

ఉద్ధవుఁడిట్లడిగెను :-‘స్వామీ ! శాస్త్రీయ సాధనల ద్వారా సిద్ధి ప్రాప్తించినపుడు సాధకున కెట్టి యవస్థ కలుగును ? దయతో సాధన, సిద్ధావస్థలను గుఱించి నాకుఁ జెప్పుఁడు.’

సూతుఁడిట్లనెను :-‘మునులారా ! ఉద్ధవుఁడీవిధముగఁ బ్రశ్నింపఁగా భగవానుఁడు సాధనావస్థనుండి సిద్ధావస్థ నెట్లు ప్రాప్తింతురో సిద్ధావస్థయందెట్టి స్థితికలుగునో చెప్పెను. దానినంతను నేను మీకు జెప్పెదను. మీరు సావధానులరై శ్రవణ మొనర్పుఁడు.

# సాధనావస్థనుండి సిద్ధావస్థ

శ్లో॥ యథా మయోఽసాధుచికిత్సితో నృణామ్
పునః పునః సంతుదతి ప్రరోహన్ ।
ఏవం మనోఽపక్వకషాయ కర్మ
కుయోగినం విధ్యతి సర్వసంగమ్ ॥

శ్రీ భాగ. ౧౧స్కం. ౨౮అ. ౨౮శ్లో॥

వ. 'ఉద్ధవా! రోగమునకు బాగుగాఁ జికిత్సను జేయకుండినచో నది మాటిమాటికి నుప్పొంగి మానవులకుఁ గష్టమును గలిగించును. ఇదే విధముగ నపక్వ కషాయ కర్మములు గలవాని యన్నిటి యందును నాసక్తినిఁ జెందిన మనస్సు కుయోగినిఁ బతనము కావించును.'

ప్రజ్వలితాగ్నియందు తడిసిన, లేక యెండిన వస్తువులను వేనిని బడవేసినను వెంటనే భస్మములగును. కాని అగ్ని మందముగ నుండినచో నేతినిఁ బోసినను నదియాఱిపోవును. అదే విధముగ జ్ఞానికి శుభాశుభములు, పుణ్య పాపములు లేవు. విధి నిషేధములు కర్తవ్యాకర్తవ్యములు లేవు. వాని సమస్త శుభ కర్మలును జ్ఞానాగ్నియందు భస్మమైపోవును. కాని జ్ఞానము పరిపక్వము కానియెడల నిట్టి విధి నిషేధ వ్యవహారమొనర్చినచో వానికి తప్పక పతనము కలుగును. ఏలననఁగా ఇంద్రియ ద్వారములు బయటకు తెఱచుకొని యున్నవి. ఇంద్రియములకు విషయములందు స్వాభావికమగు

రుచియుండును. కొంచెము జ్ఞానాభ్యాసము కలుగఁగానే ప్రపంచమున మంచి చెడ్డలు లేవనియు, గమ్యాగమ్యములు లేవనియు, ఖాద్యాఖాద్యములుండవనియు, పేయాపేయములు లేవనియు నిశ్చయించినచోఁ బతనముకాక ఇంకేమి యుండఁ గలదు? కావున సాధనావస్థయందు విధి నిషేధములను బాటించుచు మనస్సును సంయమనమునందుంచవలయును. ఈ మనస్సు నీ వశమందున్నదని చివరవరకును నమ్మరాదు. సిద్ధావస్థ ప్రాప్తించినపుడుకూడ కేవలము లోక సంగ్రహ నిమిత్తమై సాధకులవలె వ్యవహరించిన హాని యేముండును? సిద్ధావస్థ ప్రాప్తించినపుడు శరీరభానముండదు. అప్పుడు శుభాశుభ కర్మల భానమేల యుండును? అయినను పూర్వ స్వభావానుసారముగ జ్ఞాని సాధారణముగా లోక విరుద్ధ దురాచరణమొనర్పఁడు. ఒకానొక వేళ అట్లు కలిగినను వానికి పాప పుణ్య స్పర్శ కలుగదు. ఏలననఁగా పాప పుణ్యములు కర్తయొక్క భావనానుసారముగనుండును. కర్తృత్వ భావము లేకుండిన కర్మ జనిత పుణ్య పాపము లెట్లుండును?

సూతుఁడిట్లనెను:- 'మునులారా! ఉద్ధవుఁడు సాధన ద్వారా సిద్ధి ప్రాప్తించిన తరువాత నెట్టి స్థితి యుండు' నని ప్రశ్నింపఁగా భగవానుఁడిట్లనెను 'ఉద్ధవా! జ్ఞానికి సత్సంగ దుస్సంగముల భేదము లేకుండినను సద సద్భేద భావము లుండవు. నాయందు పూర్ణభక్తి లభించువఱకు సత్సంగమును

జేయుచునే యుండవలయును. చెడ్డవారి సాంగత్యమును హఠ పూర్వకముగ వదలి సత్పురుషుల సన్నిధియందే కాలమును గడుపవలయును.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'ప్రపంచమున సదసత్తులు లేక సర్వత్ర ఆత్మయొక్కటియే యుండఁగా సత్సంగము చేయనేల?'

భగవానుఁడిట్లనెను:-'వాచికజ్ఞానము కలుగుట వేఱు. దానిని దృఢ మొనర్చుకొని ధారణచేసి నిత్యజీవితమునందు పరిణత మొనర్చుకొనుట వేఱు. నీవు కేవలము పిండితో జిలేబిని చేసి చక్కెర పాకములో ముంచియెత్తిన రుచిగానుండునను విషయమును వినుటచే జిలేబీ నీకు దక్కదు. దానిని పదార్థములతోఁ జేసిననే అది యగును. ఇదే విధమున నెవఁడు శాస్త్రమును గురువు చెప్పిన విధిననుసరించి అభ్యసింపక కేవలము అక్కడక్కడ చెప్పికొను 'బ్రహ్మ సత్యము, జగన్మిథ్యా' యను వాక్యములను వినుటచేతనే శుభాశుభములు కలుగవు. ఈ శ్రుత జ్ఞానమును నాధార మొనర్చుకొని వ్యవహరించినచో నిశ్చయముగ నాతఁడు విషయములలో బడిపోవును.'

ఉద్ధవుఁడిట్లడిగెను:-'స్వామీ! అట్లేల కలుగును? ఒక్కసారి నిశ్చయము కలిగినచోఁ నాతఁడు పతము కాఁగూడదు, సంసార బంధములో పడఁగూడదు.'

భగవానుఁడిట్లనెను:- 'ఆతఁడు విషయ భరితమగు మనస్సులో నిశ్చయ మొనర్చినాఁడు. ఒకానొక మురుగు కాలువలో దట్టమైన బురద పేరుకొనియుండెను. పైన నాతఁడు నీటినిఁ బ్రవహింపఁజేసి తన మురుగుకాలువ స్వచ్ఛమైనదని యనుకొనెను. ఆతఁడనుకొనుటచేతనే అది స్వచ్ఛము కాదు. దానిలో ఒకానొక పశువు కాలిడినను కఱ్ఱతోఁ గదిలించినను దుర్గంధమైపోవును. ఆ కాలువ శుభ్రముగా చేయఁబడనంతవఱకెపుడైనను దుర్గంధము వచ్చుటతప్పదు. ఒకానొకనికి కురుపు లేచి లోపలబాగుగా చీముపట్టియుండెను. పైకి దానిముఖము మూయఁబడి యుండెను. అప్పుడు కురుపు పోయినదని అనుకొనరాదు. అట్లూరక యనుకొనుటచేతనే అది నయముకాదు. దానిలో చీము పేరుకొని అది పగిలి చీము వెలువడినప్పుడు మాత్రమే అది నయమగు చున్నదని మనమనుకొనవలయును. ఇదే విధముగా నీవు విషయము లన్నియును మిథ్యయనుచు అవి మనస్సుయొక్క సమ్ముఖమునకు రాఁగానే వానివెంటఁ బరువిడినచో నాసక్తి వృద్ధి యగును. ఆసక్తిచే సంసారబంధనము కలుగును. కావున సగము సాధన చేసినవాఁడు తన మనస్సున కిష్టము వచ్చిన పనులను జేయుచుండినచో,విధినిషేధ శృంఖలములనుద్రుంచి వైచి విషయాసక్తుఁడైనచో నాతఁడవశ్యము పతనమైతీరును. భ్రష్టుఁడు కాఁగలడు.'

ఉద్ధవుఁడిట్లడిగెను:–'స్వామీ! సాధకుఁడు మీ భజన పూజనము లొనర్చుచుండును. మీ మంత్రమును జపించు చుండును. కథాకీర్తనము లందును చిత్తము లగ్నమొన ర్చును. అట్లయినను నాతని కహంకారము కలిగి విషయము లలో నేల పడుచున్నాఁడు?'

భగవానుఁడిట్లనెను:– 'ఉద్ధవా! సాధనలో త్రుటి కలుగును. పదిమంది కలసి ఈతఁడు మహానుభావుఁ డనిన నాతని కహంకారము కలిగితీరును. అహంకారమురాఁగానే దేవతలు విఘ్నమొనర్చెదరు. ముందుగ సాధారణప్రలోభన ములను గావించెదరు. ధనికులువచ్చి పాదముల మీఁదఁ బడెదరు. రాజులును మహారాజులు నాజ్ఞాబద్ధు లగుదురు. సుందరులగు యువతులు వచ్చి అత్యంతభక్తి భావమును ప్రకటించెదరు. ఇన్ని యుండినను సాధకుఁడు తన పథమును తప్పకుండినచో నంత స్వర్గమందలి అప్సరసలు వచ్చెదరు. సారాంశ మేమనఁగా వీఁడు నీమములలో నెంతటి దృఢత్వ ముగ నుండునో వానికి అంతటి యుత్తమోత్తమ ప్రలోభ ములు వచ్చును. ఇది దేవతలద్వారా విఘ్నరూపమున భోగ ములను సమకూర్చెదరు. దేవతల దోషమేమున్నది? సాధనా వస్థయం దుత్పన్నమగు శుభాశుభ సంకల్పములను నేనే ఏదో విధమున ఫలింపచేయుచున్నాను.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'అయితే స్వామీ! సాధనలో విఘ్నమువచ్చి ప్రలోభనము రాఁగా సాధకుఁడు సాధనను వదలి విషయములలోఁ బడి పోయినచో వానికి మరల సదా పతనమేనా? ఆతఁడిన్ని దినములనుండి చేసిన సాధన వ్యర్థమేనా? '

భగవానుఁడిట్లనెను:- 'కల్యాణ కృతమగుకార్యము వ్యర్థము కాఁజాలదు. నీవొక పుస్తమును సగముచదివి వదలి పెట్టుము. పుస్తకము చదువుటయందు నీకు మనస్సు లగ్న మైనది. కాని మధ్యలో నేదియో విఘ్నమువచ్చినది. చదు వాగిపోయెను. కాని విఘ్నము తొలఁగిపోఁగానే సంస్కార వశమున నీవు మరల నా పుస్తమును నాపిన చోటునుండి చదువ ప్రారంభించెదవు ఇదే విధముగా సాధనము చేయు చుండ నేదైన విఘ్నము వచ్చినచో నా విఘ్నము తొలఁగి పోఁగానే పూర్వాభ్యాస కారణమున సాధకుఁడు మరల యోగమందే ప్రవృత్తుఁడగును.'

ఉద్ధవుఁడిట్లడిగెను :- 'స్వామీ ! ఈసాధనములలో విఘ్నములే వచ్చుచుండును ?'

భగవానుఁడిట్లనెను :- 'ప్రపంచములో నేమి పను లయిననుజరుగుటకు నాయిచ్ఛయే కారణము. దానికేదియో నిమిత్తమేర్పడును. ఎవరిచేతనైన నే నేదైన పనినిఁ జేయింప దలఁచినచో వాని కిష్టము లేకుండినను నేను వానిచేఁ

జేయించెదను. అర్జునునకు యుద్ధముచేయుట కిష్టము లేదు. దానిని నేను జేయించితిని. ఏకార్యమందైనను పనిని జేయుటకు స్వేచ్ఛయు నుండును. బరేచ్ఛయు నుండును. విషయ మొక్కటియే. కాని ఒకదానిని స్వేచ్ఛాప్రారబ్ధమందురు. రెండవ దానిని పరేచ్ఛాప్రారబ్ధమందురు.

శౌనకుఁడిట్లడిగెను :–'సూతా! స్వేచ్ఛా ప్రారబ్ధమన నేమి ?'

సూతుఁడిట్లనెను :'ఏ పనియందు తనకు స్వేచ్ఛా ప్రవృత్తి కలుగునో దానిని స్వేచ్ఛా విఘ్నమందురు. విశ్వామిత్రుఁడు జప తపములను జేసికొనుచుండఁగాఁ దానే వచ్చిన మేనకను దన యాశ్రమమున నుంచుకొనెను. ఇది స్వేచ్ఛాప్రారబ్ధజనిత విఘ్నము. మృకండ, పరాశర, సౌబరి మహామునులందఱ కిట్టి ప్రారబ్ధమే సంభవించెను. పరేచ్ఛా విఘ్నమనఁగాఁ దనకిష్టము లేకుండినను బరులవలనఁ గలుగఁగా వివశులై పోయెదరు. కుంతికి ఇష్టము లేకుండినను సూర్యుని మంత్ర ప్రభావము వ్యర్థము కాకుండుటకై కర్ణునిఁ గనవలసి వచ్చెను. యయాతి శర్మిష్ఠయందు బుత్రోత్పత్తిని గలిగింపఁ దలఁపలేదు కాని వివశుఁడై అట్లు కావింపవలసి వచ్చినది. మానవుఁడు పరిస్థితులకు లోఁబడి తనకిష్టము లేకుండినను వివశుఁడై ప్రవృత్తి కలుగుచుండును. ఈ విషయమున మీకు నేనొక చక్కని దృష్టాంతము నొసంగెదను.

తేజస్వియగు నొక బ్రాహ్మణుఁడుండెను. ఆతఁడు గొప్ప సదాచారి. సుగుణుఁడు. కర్మనిష్ఠుఁడు. ఆతనికి సంతానము కావలయునని కోరిక. దానికై ఆతఁడు మహాత్ముల దర్శనమునకుఁ బోవుచుండును. చివరకొక మహాత్ముఁ డాశీర్వదింపఁగా నాతనికొక సుందరుఁడును, సుశీలుఁడునగు బుత్రుఁడు కలిగెను. వారాతని మిక్కిలి గారాబముగఁ బెంచుకొను చుండిరి. ఆతఁడు చూచుటకు రాజకుమారుని వలెఁ గనఁబడుచుండెను. ఆ బ్రాహ్మణునకు ధనమునకును గొదువలేదు. ఆతని తల్లి తనకు గోడలు వచ్చిన బాగుండు ననుకొనెను. కాని ఆపిల్లవాని కెనిమిదేండ్లు నిండకమునుపే ఆమె చనిపోయెను. ఇప్పుడు తండ్రి, కుమారు లిద్దరే యుండిరి. తండ్రి కుమారునకు చాల వ్యయమొనర్చి చదువును జెప్పించెను. వానికి వివాహ మొనర్చుకొను వయస్సురాఁగానే తండ్రి ఆతని వివాహ మొనర్చుకొను మనెను. ఆతఁ డిట్లనెను :–'తండ్రీ ! నేను వివాహమును జేసికొనను. మీరు నన్ను బలవంత మొనర్చినచో నేను గంగలోఁబడి చచ్చెదను' ఇట్లనఁగానే తండ్రి మెదలకుండెను. పదునెనిమిది వత్సరముల వయస్సురాఁగానే, ఆతఁడొక సన్న్యాసి కడకు బోయి సన్న్యాసమును బుచ్చుకొని, సన్న్యాసి సేవలోనుండెను. ఆతని యింటిపేరు వాసుదేవునివారు. ఆతని సన్న్యాసనామము వాసుదేవానందుఁడయ్యెను. ఆతని గురువు సాధన సంపన్నుఁ

డగుటచే నాతఁడు శిష్యునకు సమస్త సాధనలను, యోగా భ్యాసమును నేర్పెను. కొంత కాలమునకు వృద్ధుఁడగు దండ్రి యును చనిపోయెను. ఇప్పుడా యువక సన్న్యాసి నిర్ద్వంద్వుఁడై భజన పూజనములను, యోగాభ్యాసమును నొనర్చుచుం చుండెను. పది సంవత్సరములకు గురువును శరీరమును జాలిం చెను. గురు వియోగమున నాతఁడు మిక్కిలి దుఃఖించి తీర్థయాత్రలకు బయలుదేరెను.

తీర్థయాత్ర లొనర్చుచు నాతఁడొక రాజధానికి వచ్చెను. అచ్చట నొక చిన్నరాజు రాజ్య మొనర్చుచుం డెను. గంగ యొడ్డుననే ఆతనికొక ఆలయము కలదు. అందులో నతిథిశాలయును గలదు. వచ్చిన నతిథు లచ్చట నివసించు చుందురు. రాజు వారినందఱ నెక్కుడు శ్రద్ధతో నాదరించు చుండెడువాఁడు. ఆ యువక సన్న్యాసియును నచ్చ టికి వచ్చి నివసించు చుండెను. గంగాతీర మగుటచే నా స్థానమతి రమణీయముగ నుండెను. ఆతఁడిట్లనుకొనెను :— 'ఇచ్చట నైదాఱు రోజులుండెదను. భిక్షకు వీలునుగలదు.' చదివిన సన్న్యాసిని గాంచి పూజారి ఆతని నత్యాదరమున నందుంచెను.

రాజునకొక అందమైన కుమార్తె కలదు. ఆమెతప్ప ఆతని కింకొక సంతానము లేదు. ఆమెకు బదునాలుగు సంవ త్సరముల వయస్సు రాఁగానే ఆతఁడొక సుందరసుశీలుఁడగు

జమీందారు కుమారునకిచ్చి వివాహ మొనర్ప నిశ్చయించు కొనెను. రెండువత్సరములవఱకా కుమారుఁడచ్చటనుండెను. ఒకసారి కాశీనుండి కొందఱు సన్న్యాసులు వచ్చి, అచ్చట నుండి కొలదికాలముననే వెడలిపోయిరి. మఱునాఁడా పిల్ల వాఁడు లేఁడు. ఎంతగా వెదికినను నాతనిజాడ తెలియలేదు. ఆతఁడు సన్న్యాసమును గొనినాఁడనియు, శిష్యులను జేర్చు కొనినాఁడనియుఁ దెలిసెను. పది సంవత్సరముల కది పాత దయ్యెను.'

ఈ యువక సన్న్యాసియొక్క రూపు రేఖలును, వెడలి పోయినవాని రూపు రేఖలును నొక్కటిగనే యుండెను. ఈతఁడా జమీందారు కుమారుఁడని పూజారికి సందేహము కలిగెను. ఆతఁడిట్లడిగెను:- 'స్వామీ! మిమ్ముల నేమని పిలిచెదరు?'

స్వామి యిట్లనెను:-'వాసుదేవానందుఁడందురు'.

పూజారి యిట్లనెను:- 'మీ యింటి పేరేమి?'

స్వామి యిట్లనెను :- 'గృహనామమును వాసుదేవ నామమే.'

దైవవశమున నా జమీందారుని కుమారుని పేరును వాసుదేవుఁడే. పూజారి వెంటనే రాణికడకీ వర్తమానమును దెలిపెను. రాణి మెదలక తన కుమార్తెను దీసికొని స్వామిని దర్శింపవచ్చెను. ఆమెకును సందేహము కలిగెను. పిల్లవాఁడు గాఁగా బిల్లయును నిశ్చయముగ నాతఁడే యనెను.

ఆ జమీందారును వచ్చి సన్న్యాసిని గాంచి తన కుమారుఁడే యీతఁడనుకొని, సన్న్యాసిని బిక్షకు బిలిచెను. ఆతని భార్య చూడఁగా నీ సన్న్యాసి తన కొడుకు వలెనే యుండెను. ఆమెవచ్చి 'నాయనా! నీవేల సన్న్యాసమును దీసికొంటివిరా?' యని యేడువనారంభించెను. ఇప్పుడు స్వామిభయపడెను. అప్పుడు స్వామి యిట్లనెను:-'అమ్మా! నేను బ్రాహ్మణుఁడను. కాశీవాసిని.' కాని యా ముసలిది వినలేదు. ఆ పిల్లయును నేడ్చుచుండెను. ఆతఁడేయితఁడని అందఱకును నిశ్చయముకలిగెను. నామరూపములొక్కటిగనే యుండెను. తాను దెలియకుండుటకై బ్రాహ్మణుఁననుచున్నాఁడనుకొనిరి. రాజు బలవంతముగనాతని కాషాయవస్త్రములను దీయించివైచెను. ఆతఁడెట్లును బోకుండుటకై గట్టి కాపలానుంచెను. ఏమి చేయఁగలడు? ఎచ్చటకునుబోవుటకు వీలు లేకుండెను. మాయలోఁబడి గృహస్థుఁడై యుండెను. ఒక మగ పిల్లవాఁడును, నాడు పిల్లయును గలిగెను. ఒక దినమున నవకాశమునుజూచుకొని తప్పించుకొని వచ్చెను. వచ్చి మరల సన్న్యాసమును గ్రహించెను. ఇదియే పరేచ్ఛా ప్రారబ్ధము. ఇదంతియును భగవదేచ్ఛచే జరుగును.'

శౌనకుఁడిట్లనెను:- 'సూతా! నీవు చెప్పినది సత్యమే. మానవుఁడు కర్మయొనర్చుటకు వివశుఁడగును. చేయరాదను కొన్నను స్వభావవశమునఁ జేయును. వ్యాకరణశాస్త్రమునఁ

గ_ర్తను స్వతంత్రుఁడుగఁ జెప్పినను ప్రాణి కర్మయొనర్చుటలో
బరతంత్రుఁడని తోఁచుచున్నది. ఎవఁడో వీనిచేఁ గర్మ
రొనరింపఁజేయును. వీని నెవఁడో బలవంతముగఁ ద్రిప్పును.
మహాభాగా! ఉద్ధవుఁడనంతరమేమని ప్రశ్నించినాఁడు?'

సూతుఁడిట్లనెను :- 'స్వామీ! ఉద్ధవుఁడును నిట్లే
యడిగెను. 'ప్రభూ! ఈ ప్రాణి మంచికార్యములను, చెడ్డ
కార్యములను నేలఁ జేయును?'

అంత భగవానుఁడిట్లనెను :- 'ఉద్ధవా! జీవుఁడన్య
ప్రేరణముచే మరణపర్యంతమును గర్మలొనరించుచుండును.'

ఉద్ధవుఁడిట్లడిగెను :- 'అయితే స్వామీ! జ్ఞానికిని,
అజ్ఞానికిని భేదమేమున్నది? జ్ఞాని యెవని ప్రేరణమునో తపస్స్వా
ధ్యాయముల నొనర్చును. అజ్ఞాని జారత్వచోరత్వముల నొన
ర్చును. ఇద్దరును గర్మలొనర్చుటలోఁ బరతంత్రులే. అట్టియెడ
నజ్ఞానిని నిందింపనేల? జ్ఞానిని స్తుతింపనేల? ఇద్దరు నొక్కటిగనే
యుందురు. ఇద్దరునువివశులై పరప్రేరణముచేఁ గర్మలొనర్చు
వారే.'

భగవానుఁడిట్లనెను:- 'అవును, సత్యమే. జ్ఞానియును
నజ్ఞానియును బరప్రేరణముచేఁ గర్మలొనర్చువారే, కాని
వీరిద్దరికిని చాల గొప్ప భేదముకలదు. అజ్ఞాని ఆకర్మలకుఁ
గర్త తానని యే తలఁచును. బంధనమునకును, దుఃఖము
నకునుఁ గారణము కర్మకాదు. దానియందుగల మమకారమే

దుఃఖమునకుఁగారణమగును. బంధనదుఃఖములకుఁగారణము మృత్యువుకాదు. తాను దెచ్చుకొనిన మృత్యువే దుఃఖము నకుఁ గారణము. ధననాశనము దుఃఖమునకుఁ గారణము కాదు. నిత్యమును నెందఱ ధనమో నాశనమగు చుండును. మన నగరములలో నెందఱో లక్షాధికారులు భిక్షాధికారు లగుచున్నారు. వారి సర్వస్వమును నాశమగుచున్నది. దీని వలన నెవరికిని దుఃఖము కలుగుటలేదు. దాని మీఁద మమ కారమెవరికి కలదో వారికి దుఃఖము కలుగు చున్నది. జ్ఞానులును నజ్ఞానులును గర్మలను సమానభావ ముతోఁ జేయుచుందురు. కాని అజ్ఞాని తానే కర్తనను కొనును. జ్ఞాని తాను గర్తయని యనుకొనఁడు. జీవధర్మ మేదియో చేయుటయని యాతఁడు భావించును. కర్మలు చేయక యెవ్వడు నుండఁజాలడు. జరుగున దేమియో జరుగఁ గలదు. జరుగనిండు. తాను కర్తను గాననుకొనును. తాను గర్తకానపుడు బంధనములో నెట్లు పడఁగలఁడు. వానికి దుఃఖమేల కలుగును? ఒకానొక వ్యాపారి శరీరముతో నేమియును జేయఁడు. చేయునదంతయును నాతని నౌకరులే, గుమాస్తాయే. కాని దానికి దాను స్వామి ననుకొనుటచే, వ్యాపారమున నష్టము వచ్చిన నా దుఃఖము ననుభవింప వలసివచ్చుచున్నది. నౌకరులకు తమజీతము తోడనే పని. ఊరక లోకము కొఱకు చింతింప వలసినదేకాని ఆతనికి

నిజమునకు హర్షశోకము లుండవు. లాభనష్టములందు సమభావమున నుండును. ఇదే విధముగ నవివేకి కర్తృత్వాభిమానమున బంధమునఁబడును. జ్ఞానియు, వివేకియు నైనవాఁడు తాను గర్తను గానను కొనుటచే, లౌకిక విషయములలో నున్నను, దేహముతోఁ గర్మలొనర్చుచుండినను, తృష్ణావిహీనుఁడై నిత్యానంద సాగరమున నిమగ్నుఁడైయుండును. చింత వానికడకు రానేరాదు. దుఃఖము వానిని స్పర్శింపదు. విషయము లసత్తులు. ఆత్మయొక్కటియే సత్తని భావించుచుఁ దన స్వస్వరూపమున నిలిచియుండును. తాను గర్తృత్వభోక్తృత్వములకు దూరముగ సాక్షీమాత్రముగ నుండును.'

ఉద్ధవుఁడిట్లడిగెను:—'స్వామీ! ఇట్టి స్థితినిఁ బొందినవాఁ డేశారీరక కర్మను నొనర్పకుండునా?'

ఉద్ధవునితోఁ గృష్ణుడిట్లనెను:– 'ఏలచేయకుండును. ఆఁకలి దప్పికలు ప్రాణులధర్మము. ఇవి శరీరమున్నంత వఱకుండును, కాని యీ గుణముల నాతఁడాత్మపై నారోపింపడు. ఆతఁడు భోజన మొనర్చునుగాని ఆత్మచే భోజన మొనర్చినా ననుకొనఁడు. ఆతఁడు లేచును. కూర్చుండును, నడచును, తిరుగును, నిద్రించును, మలమూత్ర త్యాగ మొనర్చును. ఇంక నితర స్వాభావిక క్రియల నొనర్చును. కాని తాను శరీరమునకు భిన్నుఁడనని భావించును. ఆతని గర్మ బాధింపదు.

ఆతఁడు సుఖదుఃఖములకును, హాని లాభములకును, జీవన్మ రణములకును వేఱుగ నున్నానను కొనును.'

ఉద్ధవుఁ డిట్లడిగెను :— 'అయితే స్వామీ! జ్ఞానికి యింద్రియ జన్య విషయములు బొత్తుగా గోచరింపవా?'

భగవానుఁడిట్లనెను :— 'ఏలగోచరింపవు? శరీరమును నింద్రియము లున్నంతవఱకు విషయములు గోచరించుచునే యుండును. ఇది స్వాభావికము. కాని వానికి నిరంతరమును నీ దృశ్యమాన ప్రపంచమంతయును సత్యముకాదు, మిథ్య యను జ్ఞానముండును. ఒకఁడు స్వప్నమున సింహమును గాంచి భయపడెను. మేల్కాన్న తరువాతను శరీర రోమాంచమును, గన్నులనీరును, శరీరకంపమును గలవు. అయినను జాగ్రదవస్థలోనికి వచ్చుటచే స్వప్నములోఁ గాంచిన సింహమును గాంచుటచేఁ దనకీ దశ వచ్చినదనియు, నది మిథ్యయనియు, నది తన కేమియును హానిని గలిగింపఁ జాలదనియు నాతనికి దెలియును. అదే విధముగ జ్ఞానికి జ్ఞానము కలుగనంతవఱకు ప్రపంచము సత్యముగఁదోచును. ఈ సంఘటనముల వలన నాతనికి సుఖ దుఃఖములు కలుగు చుండినవి. ఇప్పుడాతనికి జ్ఞానము కలుగఁగానే, ఆతని దృష్టి సమ్ముఖమునఁ బ్రపంచము కలదుగాని ఆతఁడు దానినసత్తుగ భావించును. ఆతని సాంసారిక విషయము లేవియును బాధింపఁజాలవు. ఏదైన వస్తువు సద్వస్తువుగ గోచరించినచో,

నాతఁడనేక యుక్తులతోడను, ననుమానములతోడను నస త్తుగా సిద్ధాంత మొనర్చుకొనును. అది ఆత్మకు భిన్నమగు టచే నసత్తుగను, మిథ్యగను భావించును. ఏలననఁగా నాత్మకు అతిరిక్తమైన దంతయును నసత్తే.'

ఉద్ధవుఁడిట్లడిగెను :–'స్వామీ! ఆత్మజ్ఞానము కలిగిన తరువాత నాతడాత్మనుగాక మిగిలిన వాని నన్నిటిని వదలి వేయునా?'

భగవానుఁడిట్లనెను:–'ఆత్మలోఁ గలిసిననే త్యాగము సంభవమగును. ఓకానొకఁడు ముత్యపుచిప్పనుగాంచి వెండి యనుకొనెను. ఆతఁడా ముత్యపుచిప్పకడకు బోఁగా నచ్చట వెండిలేదు. ముత్యపుచిప్పయే కలదు. ఆతఁడు ముత్యపు చిప్పను దెచ్చెననిన నందు వెండిగాఁ గనఁబడుచుండిన దానిని వదలి ముత్యపు చిప్పను దెచ్చెననరాదు. ముత్యపుచిప్పలో వెండియుండినగదా దానిని విడిచివచ్చుటకు, జ్ఞానము కలుగఁ గానే ఆతని భ్రమనివారణమైనది. అదే విధముగ వివిధ గుణకర్మయుక్తమగు దేహేంద్రియ విషయాదులకు సంబం ధించిన నజ్ఞానజన్య పదార్థములను జ్ఞానము కల్గుటకు బూర్వము ఆత్మకంటుకొని యున్నట్లుగ భావించియుండెను. ఇప్పుడు జ్ఞానము కలిగిన తరువాత నాతఁడు మిథ్యగా భావించును. అవి ఆత్మకు వేఱై యెచ్చటికిని బోఁజాలవు. ఆత్మలోఁ గలిసియుండిన నవిపోఁగలవు. ఆత్మయందు గ్రహణ

త్యాగములు రెండును లేవు. అది నిత్య, శుద్ధ, బుద్ధ, అసంగ, నిర్లేపమైనది. ఒకానొక భవనమున నంధకారములో ననేక వస్తువులున్నను గనఁబడవు. సూర్యుఁడుదయించగనే ఆ భవనమున నన్నియును గనఁబడును. సూర్యుఁడు బయటనుండి తెచ్చి ఆవస్తువుల నచ్చటపెట్టలేదు. కేవలము నీకన్నులలోఁ గల తమావరణమును దొలఁగించెను. అది తొలఁగఁగానే అన్నియును స్పష్టముగఁ గనఁబడసాగెను. ఇదే విధమున నాత్మ జ్ఞానమున నంతఃకరణమం దావరించిన నజ్ఞానాంధకారము దూరమయ్యెను. ఆత్మయొక్క యథార్థస్వరూపము ప్రకాశించినది. ఏ విలక్షణ వస్తువును నెచ్చటినుండియును రాలేదు.'

ఉద్ధవుఁడిట్లడిగెను :- 'స్వామీ! ఆత్మనెవరు ప్రకాశింపఁజేసినారు?'

శ్రీకృష్ణుఁడిట్లనెను:- 'ఆత్మ స్వయంప్రకాశము. దానినెవరు ప్రకాశింపఁజేయఁగలరు? ప్రపంచమందలి ప్రకాశమంతను బ్రకాశింపఁజేయునదాత్మయే. ఇది యెచ్చటనైన నుత్పన్నమై వ్యాపించినదనరాదు. ఇది అనాది, అజము, అనంతము, అప్రమేయము. అద్వితీయము. మహానుభావము. సర్వానుభవ స్వరూపము. ఇది వాగ్విషయము కాకపోవుటచే శబ్దములతో వ్యక్తముచేయఁబడదు. మనోవాక్కులు దానినిఁ బొందఁజాలక తిరిగి వచ్చును. అయినను మనఃప్రాణేంద్రి

యములకచ్చటనుండియే ప్రేరణము ప్రాప్తించును. దాని ప్రేరణము చేతనే అవన్నియును దమతమ కార్యము లొనర్చు చున్నవి.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'ఆత్మలోనివి యన్నియును లేనప్పుడు నిరాధారమునకు ధారణ యెట్లు వచ్చినది? ఈ వికల్పమున కవలంబనమేమి?'

భగవానుఁ డిట్లనెను :- 'నాయనా! దీనికవలంబన మేమియును లేదనియును, నిరాలంబమైనదనియు ననేకసార్లు చెప్పియుంటిని. ఇది చిత్తముయొక్క మోహము, మనోభ్రమ. రజ్జు సర్పభ్రాంతి. బాలకులకు ఎండమావులున్నవని భయపెట్టు చుందుము. మా యమ్మ యశోదయును నా చిన్నతనమున నట్లేభయపెట్టినది, ఒంటరిగావనములకుబోవలదనుచుండెడిది. కాని నేను పెద్దవాఁడనైనతరువాత వనములన్నిటిని వెదకితిని. నాకెచ్చటను నట్టియెండమావులు కనఁబడలేదు. ఇదేవిధముగ నీ ప్రపంచమంతయును నెండమావులవంటిదే. ఇది పరంపరాగతమగు వ్యర్థమగు రూఢి. ఆత్మయందు వికల్పమునుగాంచు వానికి తన యాత్మస్వరూపమునకు మనస్సునకంటె వేఱాశ్రయము లేకుండును.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'స్వామీ! ఈ ప్రపంచము ప్రత్యక్షముగఁగన్పడుచున్నది. వ్యవహారమంతయును నీ ప్రపంచమువలననే జరుగుచున్నది. పురాణములలో నానా

విధములుగ సృష్టినిగూర్చి వర్ణింపఁబడినది. ఈ సృష్టిని రక్షించుటకై మీరవతరించెదరనియును, దుష్టులను స హరించి ధర్మమును స్థాపించెదరనియుఁ జెప్పబడినది. ఈ ప్రపంచ మసత్తైనచో నీ కార్యములెట్లుజరుగును? ఆత్మ కాక జీవులును, జగత్తును సత్యము కాకున్నచో సమస్త సాధనములు వ్యర్థము కావలయును. ద్వైతము లేక ఉపాసన జరుగనే జరుగదు. ఉపాస్యమును, నుపాసకుఁడును లేకున్నచో నుపాసనమెట్లు జరుగగలదు?'

భగవానుఁడిట్లనెను :- 'నీకు వేద వాక్యములందు విశ్వాసములేదు. వేదములందంతటను నాత్మ అద్వితీయమని చెప్పఁబడినది.'

ఉద్ధవుఁడిట్లడిగెను :- 'స్వామీ! విశ్వాసమేల లేదు? విశ్వాసముకలదు. వేదము పరోక్షరూపమునఁ జెప్పినది. వేదములందు రోచక, భయానక, యథార్థ, అర్థవాదములకు సంబంధించిన నానావాక్యములు కలవు. స్త్రీని చంద్రముఖి యందురు. ఏ స్త్రీ ముఖమునఁ జంద్రుఁడున్నాడు? ఇచ్చట చంద్రుఁడనగాఁ జంద్రునివలెఁ జక్కనిదనియే భావము. అట్లే వేదములలో నీ యూపమే ఆదిత్యుఁడని కలదు. కొయ్యతోఁ జేయబడిన యూపము ఆదిత్యుడెట్లు కాఁగలదు. స్తంభము సూర్యుఁడు కాఁడని చిన్న పిల్లలకును దెలియును. ఇచ్చట యూపము నాదిత్యుడనుటలో సూర్యునివలె నీ

స్తంభము ప్రకాశమానముగ నున్నదనియే. కేవలము ప్రశంసాపరకమే ఉపమానమందుండును. ఒకానొక ధనికుని నీ వింద్రుఁడవు, చంద్రుఁడవు, కుబేరుఁడవను చుందురు. సాధారణ పురుషుఁడింద్రుని వలెను, జంద్రుని వలెను, కుబేరుని వలెను నైశ్వర్యశాలి యెట్లు కాఁగలఁడు. కేవలమాతని బ్రశంసించుటకే యిట్టి శ్రుత మధుర వచనములను బలుకుచుందురు. అదే విధముగ యజ్ఞమొనర్చు యజమానిని 'నీవాత్మ' వని. ఆతని నుత్సాహ పరచుటకు బలుకుచుందురు. జీవుఁడాత్మ యెట్లు కాఁగలఁడు ? ఇట్టి వచనము లన్నియును బ్రశంసా పరకములు. అర్థవాదములు. వీనివలన జగన్మిథ్యాత్వము ఋజువుకాదు.'

అంత నవ్వుచు భగవానుఁడిట్లనెను :-'ఉద్ధవా ! మీమాంసకులును నిట్లే యనుచుందురు. వారీ వాక్యములు ప్రశంసా పరకములనుచుందురు. జ్ఞానులును సకామకర్మలను శ్రుతమధుర ప్రశంసా పరకములందురు, వాస్తవమున నీ నామరూపముల ద్వారా గ్రహింపఁబడు పాంచభౌతిక ద్వైతము బాధతమగును. ఈ లౌకిక అచిత్ అసత్ పదార్థము లన్నియును మిథ్యలు. నిరానందములు. పరిణామమున దుఃఖమును గలిగించును. కావున శాస్త్రోక్త సాధనముల ద్వారా నన్ను మాత్రమే సత్యముగ భావించు భక్తి యోగముద్వారా నన్నే ప్రాప్తించుటకు సదా సాధకుఁడు

భజన మొనర్చుచుండ వలయును. సాధనములలో విఘ్నము లందఱకును గలుగుచుండును. ఆ విఘ్నములనుగాంచి హతోత్సాహము కారాదు. సాధన మొనర్చునపుడు విఘ్నములు కలిగినచో, నా విఘ్నములను ననేకోపాయముల ద్వారా శాంతింపఁ జేయవలెను.'

అంతనుద్ధవుఁడుదీనతతోనిట్లనెను :-'స్వామీ! సాధకు లందఱకును సాధనకాలమున విఘ్నములు తప్పక వచ్చుచుండును. ఎవఁడెంత గొప్పగా సాధన మొనర్చుచుండునో వానికంతటి గొప్ప విఘ్నములు వచ్చుచుండును. సాధనకాలమున విఘ్నములు రానివాఁడు జన్మసిద్ధజీవన్ముక్తుఁ డైనను గావలయును. లేదా దంభమాత్రమగు సాధనమైనను గావలయును. సాధనక్షేత్రము విఘ్నముల తోడనే ప్రారంభమగును. విఘ్నము లంతమైన చోటుననే సాధనయును నంతమగును. కావున దయతో విఘ్నములు వచ్చినచో నే విధముగ విఘ్నములను శాంతింపఁజేసి కొనవలయునో చెప్ప వేఁడుచున్నాను.'

భగవానుఁడిట్లనెను :-'ఉద్ధవా! సాధన విఘ్నములకు లెక్కయే లేదు. అనేక విఘ్నములు వచ్చుచుండును. వానిని శాంతింపఁజేయుట కనేకోపాయములు కలవు. వానిలోఁ గొన్నిటిని నీకు నేను జెప్పెదను. వానినిఁబట్టి నీ వితర విఘ్నములను గూడ శాంతింపఁ జేసికొను నుపాయములను దెలిసి

కొనుము. సాధన కంటకాకీర్ణము. సాధన మార్గమునందు వచ్చు విఘ్నములును తీక్ష్ణమగు కంటకములే. ధైర్యముకల వాఁడే యీక్షురస్యధారవలె నుండు మార్గమును దాటఁ గలఁడు. కావున సాధనమందు విఘ్నములు వచ్చినచో హతోత్సాహుఁడవు కారాదు. గుఱ్ఱము నెక్కినవాఁడే క్రింద పడును. ఇంటిలోఁ గూర్చుండి పిండిని విసరుకొను స్త్రీలు గుఱ్ఱము మీఁదనుండి పడిరని వినియున్నావా? ఒక విఘ్నము వచ్చిన దానిని తొలిగించుకొనఁగానే ఇంకొకటి వచ్చును. దానితోఁ బోరాడుము. విచలితుఁడవు కారాదు. ఇప్పుడు నీకు నేను సాధన విఘ్నములను నివారించుకొను నుపాయ మును గూర్చి చెప్పెదను.'

సూతుఁడిట్లనెను :-'మునులారా! ఇప్పు డే విధముగ భగవానుఁడు విఘ్నములను శాంతింపఁ జేసికొను నుపాయ మును జెప్పెనో, దానిని మీకు జెప్పెదను.'

---

## యోగసాధన విఘ్నములు - నివారణము

శ్లో॥ యోగధారణయా కాంశ్చిదాసనై ర్ధారణాన్వితైః ।
తపోమంత్రౌషధైః కాంశ్చిదుపసర్గాన్ వినిర్దహేత్ ॥

శ్రీభాగ. ౧౧స్కం. ౨౮అ. ౩౯శ్లో॥

వ. ఉద్ధవా! యోగసాధనలోఁ గలుగు విఘ్నములు గొన్నిటిని యోగధారణచేతను, గొన్నిటిని ధారణసహితమగు నాసనముల చేతను, గొన్నిటిని తపస్సుచేతను, మంత్రౌషధములచేతను సాధకుఁడు శాంతింపఁ జేసికొనవలయును.

— శ్రీ మదాంధ్ర భాగవతము.

ఇష్టవస్తుప్రాప్తికై చేయఁబడు ప్రయత్నమునకును, దేనిచే సాధ్యప్రాప్తి కలుగునో దానిని సాధనమందురు. ఉపకరణముల సమావేశమును సాధనములోనే కలదు. పంటను పండించుటకై భూమిని దున్నుటయును, వెద పెట్టుటయును, నీరు పట్టుటయును సాధనములు. దీనికి గావలసిన నెద్దులు మొదలగువానికి సాధన సంజ్ఞ కలదు. సాధన సముచితముగఁ జేసి అదృష్టమనుకూలముగ నుండినచో నాసాధనములవలన సిద్ధి తప్పక కలుగును. సాధన మొనర్చునపుడు సాధ్యము ప్రాప్తింపక ముందే కొన్ని విఘ్నములు సంభవించినచో, సాధనమును శిథిలము కావింపరా. అట్టి విఘ్నములను నివారించు కొనుటకై శక్తి కొలది ప్రయత్న మొనర్పవలయును. బీజములను వెదపెట్టుటలోనే పని తీఱిపోలేదు. అవి అంకురింపవలయును, పెరుగవలయును, కంకులు వేయవలెను, గింజలు ముదరవలయును, కోఁత కోయవలయును. ఇంటికి రావలయును, ఇట్లు వచ్చుట కనేకవిఘ్నములుకలవు. గింజలను పక్షులేరుకొని తినవచ్చును, అంకురములకు బురుగు

పట్టవచ్చును, పైరునకు దెగుళ్ళుబట్టవచ్చును. ఎలుకలు తిన వచ్చును. వీనినుండి రక్షించుటకు సర్వవిధములఁ బ్రయత్న మొనరింప వలయును. అట్లే విఘ్నములను దొలిగించుటకు బూనుకొనక పాటిపోయినచో నిష్టవస్తువు ప్రాప్తింపదు.

సూతుఁడిట్లనెను:- 'మునులారా! ఉద్ధవుఁడు భగవానుని సాధన విఘ్నములను గూర్చి ప్రశ్నింపఁగా?'

భగవానుఁడిట్లనెను:-'ఉద్ధవా! సాధనకాలముననేక విఘ్నములు వచ్చుచుండును. శరీరమునకు వ్యాధులు వచ్చుటయును, సంశయములు కలుగుటయును, కామ క్రోధాది వికారములు కలుగుటయును, దైహిక, దైవిక, భౌతిక, మానసిక విఘ్నములు కలుగుటయు నను నిట్టి విఘ్నములను వివిధోపాయములచే నాశన మొనర్పవలయును.

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'స్వామీ! ఏ యుపాయములచే నే యే రోగములను నాశమొనర్చుకొనవలయును?'

భగవానుఁడిట్లనెను:- సాధనమున మొదటి విఘ్నము రోగాదులు వచ్చుట. సాధన కాలమున భయంకరములగు రోగములు లేని సాధకులు చాల కొద్దిగ నుందురు. అందు వలన సాధారణులు సాధనము వలన రోగములు కలుగునని పలుకుచుందురు.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'స్వామీ! సాధకుఁడు సాధనము వంటి పరమ పవిత్రకర్మ మొనర్చుచుండ వానికి రోగములు

రానేల? పూర్వజన్మమునం గావించిన పాపములే వ్యాధిరూప మున బాధించును.'

భగవానుఁడిట్లనెను:- 'శ్రేయః కర్మమున విఘ్నము లధికముగఁ గల్గుచుండును. ఈ శరీరముతో సంబంధ మీ జన్మము మాత్రమునకు సంబంధించినది కాదు. జన్మ జన్మాంతర కర్మ సంచిత మొనర్పఁబడును. ప్రారబ్ధమున ననుభవింపవలసిన సుఖదుఃఖముల ననుభవించి తీరవలసినదే. సంచితకర్మ జ్ఞానమున భస్మము కావచ్చును. ఆగామికర్మ సంచయ మొనర్పక పోవచ్చును. కాని ప్రారబ్ధము మాత్రము భోగింపక నశింపదు. కావున ప్రారబ్ధ కర్మాను సారముగ రోగములు వచ్చుచుండును. మురుగుగుంట యెట్టిదో శరీర మును నట్టిదియే. మురుగు కాలువయందు మురుగు బురద పేరుకొని తీరును. ముందీ మురుగు గుంటలో బురద పేరుకొన కుండునట్లు చేయఁదలఁచుకొనినచో ముందు దాని ద్వారము నరికట్టవలయును. తరువాత నిదివఱలోఁ జేరుకొనిన పదార్థ మును దొలఁగింపవలయును. ఇది యుండినచో ధ్యానము నిలువదు. దుర్గంధము నెంతగాఁ దొలఁగించుచుండిన నంతగా దుర్గంధము వెలువడుచుండును. ఇట్లు చేయఁగాఁ జేయగాఁ జివరకది స్వచ్ఛమగును. మనస్సు ప్రపంచమునం దున్నంత వఱకు తనదోషములు కనఁబడవు. బాగుగా మంచములోఁ బడునంతవఱకు వేలకొలఁది రోగము లున్నను వానిని లక్ష్య

పెట్టము. కడుపులో అజీర్ణమును, ఆమమున్నను తినకమానుట లేదు. తలనొప్పి, కడుపుబ్బరముగ నుండినను బనులనొనర్చుచునే యుండును. ఏమియును జేయకుండిన మనస్సున కేమియును దోచదు. మనస్సును సంసారమునుండి తొలిగించినచో శరీరముననన్నియును దోషములే గోచరించుచుండును. ప్రతి యంగమునను దోషములు కనఁబడుచుండును. మురికి వస్త్రము నుదుకనంతవఱకు దానిమురికి తోచదు. దానిని క్షారజలములతో నుదుకుటకుఁ బ్రారంభించినచో నుదికిన కొలఁది మురికి వెలువడుచుండును. సాధనకాలమున వచ్చు రోగములను గూర్చి భయపడరాదు. ముందుగా నాహారమును శుద్ధముగను, సాత్వికముగను, హితముగను, మితముగను సేవింపవలయును. అన్నము నౌషధివలెఁ దినవలయును. శరీరము వాతప్రకోపముగ నుండినచోఁ గఫపిత్త పదార్థములను దినవలయును. కఫ ప్రధానముగ నుండినచో వేడి వస్తువులను దేలికగ, వాతపిత్త ప్రధానములగు బదార్థములను నధికముగ సేవింపవలయును. ఇతరములగు మందులను గూడ వాడవలసి వచ్చును. ఇవి సాధారణ విఘ్ననివారణోపాయములు. ధారణాస్థితికి వచ్చినచో శీతోష్ణాది ద్వంద్వములకు సంబంధించిన విఘ్నములను ధారణచేతనే నివారించుకొనవలయును.'

ఉద్ధవుఁడిట్లడిగెను :- 'స్వామీ! ధారణచే విఘ్నములను నివారించుకొను టెట్లు?'

భగవానుఁడిట్లనెను :– 'ఏదైనఁ బర్వతములందు సాధన మొనర్చిన నచ్చట హిమప్రకోపమధికముగ నుండును. శీతలమువలన సాధన జరుగదు. కావున నచ్చట సూర్యుని ధారణ మొనర్పవలయును. దేనిని ధారణ మొనర్చిన దాని స్వభావమట్లే కాగలదు. స్త్రీ పురుషునిగాని, పురుషుఁడు స్త్రీనిగాని ధారణ మొనర్చినచో వారి మనస్సులును గామ యుక్తములగును. అట్లే సూర్యధారణ మొనర్చినచో హిమ కణములు కఱఁగిపోయి శరీరము వేడియెక్కును. ఇట్లే చంద్ర ధారణముచే నెట్టి యుష్ణశరీరమైనను జల్లఁబడిపోవును. శాంతి లభించును. ఇదే విధముగ సమస్తధారణలవలన సమస్త విఘ్నములను దొలఁగించుకొనవచ్చును. ధారణాయుక్తమగు నొక్కొక్క యాసనము చేతను దోషము నివృత్తి కాఁగలదు. ఏదైన కార్యము సిద్ధింపకుండినచో మనస్సు ఉద్విగ్నము కాఁగలదు. అప్పుడు సిద్ధాసనము మీఁదఁ గూర్చుండి యేదైన సిద్ధుని ధారణ మొనర్చినచోఁ గార్యము సిద్ధించును. మనస్సు శాంతించును. తన శరీరమునుండిగాని, పరిసరముల నుండిగాని దుర్గంధము వచ్చుచుండినచోఁ బద్మాసనమునఁ గూర్చుండి పద్మమునందు ధారణ మొనర్చినచో దుర్గంధము పోవును. కమలమువలె సుగంధముతో నిండిపోవును. ఈ విధముగ ననేక ధారణలొనర్చుటచే నట్టి ఆసనములను వేయుటచే ననేక విఘ్నములు తొలఁగిపోవును. ఏదైన

పాపము సంభవించినచో వ్రతోపవాసములచేఁ బ్రాయశ్చిత్త మొనర్చుకొని నాశనమొనర్పవలెను.'

ఉద్ధవుఁడిట్లడిగెను:-'స్వామీ! యోగసాధనయందనాహారమును అత్యాహారమును వర్జితములే. అట్టియెడ నుపవాసాదులచే యోగవిఘ్నములను శాంతింపఁజేయుటెట్లు?'

భగవానుఁడిట్లనెను:- 'ప్రాయశ్చిత్తాదులొనర్చుకొనునపుడు యోగసాధనమునాపి వ్రతాదులచేఁ బాపములను శాంతింపఁజేసికొనవలయును. ఇది ఆరంభసాధకుల విషయమే. సాధన వృద్ధిపొందినట్టి వారలు తమ యోగసాధనముచేతనే తాను జేసిన నియమవిరుద్ధ పాపములకుఁ బ్రాయశ్చిత్త మొనర్చుకొనవలయును. అట్టివానికన్య వ్రతాది ప్రాయశ్చిత్తములవసరము లేదు. వాస్తవమున సాంసారిక భోగత్యాగమే తపస్సు. యోగులకు యుక్తాహారవిహారమే శ్రేష్ఠమగు తపస్సు.

కొన్నివిఘ్నములు మంత్రజపములచేతనేశాంతించును. తన గురువొసంగిన మంత్రము, గాయత్రీ మంత్రము, సిద్ధులొసంగిన మంత్రముల వలన వెంటనే విఘ్నములు శాంతించును. సాధనమున నన్నిటికంటె గొప్పవిఘ్నము కామము. కామమును జయించిన నన్నిటిని జయించినట్లే.

ఉద్ధవుఁడిట్లడిగెను:-'ఈ దుష్టకామమే సమస్తానర్థములకును మూలము. ఈ కామము గొప్పగొప్ప మునులను,

జ్ఞానులను, ధ్యాన నిష్ఠులను, యోగులను బడఁగొట్టు చుండును. ఈ కామము క్రోధరూపమునుగూడ ధరించును. దీనికి తృష్ణ యెక్కువ. దీనిని జయించుటెట్లు?'

భగవానుఁడిట్లనెను :– 'నాయనా! ఈ కామము బ్రహ్మాది దేవతలనుగూడ విచలితులఁ గావించినది. శివుఁడు దీనిని జయించెను గాని అది క్రోధరూపమును జెందినది. బదరిలో వచ్చినపుడు దీనిని నేను దూషింపలేదు. దీనిపైఁ గోపపడలేదు. అప్పుడు సిగ్గును జెంది నాకు కొడుకయ్యెను. ఇది వచ్చినపుడు నా ధ్యానము నొనర్చినచో సిగ్గుపడి, అచ్చటినుండి వెడలిపోవును. విఘ్నములకు రాజగు దీనిని జయించుటకు నా ధ్యానమునకు మించిన నుపాయములేదు. మనస్సులో జెడ్డ సంకల్పములుద్భవించినచో, సాంసారిక విషయములు స్మరణమునకు వచ్చినచో వీతరాగి యగు మహాత్ముని స్మరింపవలయును. ఇట్టి మహాత్ముని దర్శించినచో నట్టివానిమీఁద భక్తి కలిగినచో నాతనిమూర్తిని ధ్యానింప వలయును. లేదా ప్రాచీన యోగేశ్వరులగు నారద, కపిల, షనక, సనందన, సనాతన, సనత్కుమార, వ్యాస, శుకాదు లను స్మరింపవలయును.'

ఉద్ధవుఁడిట్లడిగెను :– 'స్వామీ! నాకు సమస్త విఘ్నములను నాశమొనర్చు సరళోపాయమును జెప్పగలరా?'

భగవానుఁడిట్లనెను:– 'ఉద్ధవా! నా నామసంకీర్తనము నకుమించిన సరళ సుగమ సాధనమింకొకటి లేనే లేదు. ఏదైన విఘ్నములు తటస్థించినచో నుచ్చైస్స్వరమున నా సుమధుర నామములను సంకీర్తనమొనర్పవలయును. నా నామ సంకీర్తనముచే సమస్తవిఘ్నములును బటాపంచలగును. సింహమును గాంచగనే సమస్తమృగములెట్లు పాఱిపోవునో అట్లే నా నామసంకీర్తనము వలన సమస్త విఘ్నములును బాఱిపోఁగలవు.'

రోగములు వచ్చుటకు పూర్వమే శరీరము నారోగ్యముగనుంచుకొని రోగములురాకుండునట్లెట్లుచేసికొందువో, అట్లే సాధనచేయుటకు పూర్వమే మంత్రౌషధములద్వారా శరీరమును సుదృఢమొనర్చుకొని యితర సాధనములొనర్చినచో నింక విఘ్నములు రావు.'

భగవానుఁడిట్లనెను:– 'అవును. అందఱు నట్లే చేయుచుందురు. ముందుగా షట్కర్మలద్వారా శరీరమును శుద్ధమొనర్చుకొందురు. కొందఱు రసాయనిక చికిత్సల చేతను, కాయకల్ప చికిత్సల చేతను దెల్లగ నున్నవారిని నల్లగ నొనర్చెదరు. ముసలితనమును బోగొట్టుకొని యువకులగుచుందురు. శరీరము రోగరహితముకాఁగానే, వారు అణిమా, మహిమా, లఘిమా, గరిమా, ఈశిత్వ, వశిత్వాద్యష్ట సిద్ధులను బొందఁ బ్రయత్నించెదరు. ఒక్కొక్క సిద్ధినిఁ

బొందుటకు కనీసమిరువది సంవత్సరములు పట్టును. కాని బుద్ధిమంతులగువారు దానినిఁ బ్రశంసింపరు.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'బుద్ధిమంతులు దీనినేల ప్రశంసింపరు? ఆకాశమున నెగురుటయును, జలముపై నేలపై నడిచినట్లు నడచుటయును, అగ్నినుత్పన్నము కావించుటయును, అదృశ్యమగుటయును సాధారణ విషయములు కావు.'

భగవానుఁడిట్లనెను:- 'అవును. అవి అసాధారణ విషయములు కావు. కాని వానివలన నా ప్రాప్తి యెట్లు కలుగఁగలదు? ఆకాశమున నెగిరిననే సిద్ధిలభించిన నీ పక్షులన్నియును సిద్ధిని బొందవలయును. నీటిలో నడిచిన సిద్ధిని బొందినచోఁ జేఁపలు మొదలగు జలజంతువులు నీటి కెదురీదును. వానిలోనే తిని నివసించును, నిద్రించును. ఈ విషయమున నొక రోచకమగు దృష్టాంతము కలదు.'

ఒకానొక కుఱ్ఱవానికి యోగమును నేర్చుకొనవలయుననుకోరిక కలిగెను. అతఁడొక యోగికడకు బోయి యోగమును నేర్చుకొనెను. అతఁడు తన గ్రామమునకు రాఁగానే ఫలానివాఁడు యోగసిద్ధిని బొంది వచ్చినాఁడను గోలపుట్టెను. అందఱును నాతనిఁ గాంచుటకువచ్చి సిద్ధులను జూపింపుమని కోరఁగాఁ గొన్నిసిద్ధులను జూపించెను. అతఁడు పాదుకలను దొడుగుకొని నీటిపైనడిచెను. ఇంకొకఁడు పడవమీఁద నెక్కి దాటెను.

అంత నాతఁడెండు కట్టెలపై నీటినిఁ జిలకరించెను. ఆ కట్టెలు మండెను. ఇంకొకఁడు చెకుముకిరాయిని నినుప ముక్కతోఁగొట్టి అగ్నిని వెలిఁగించెను. అందఱును యోగిని నద్భుత సిద్ధులను బ్రాప్తించెనని మిక్కిలి ప్రశంసించిరి.'

బుద్ధిమంతుఁడగువాఁడిట్లనెను :-'మూఁడు పైసలతో సిద్ధి కలిగినది.'

అందఱిట్లనిరి :- 'మూఁడు పైసలతో సిద్ధి కలుగు టెమిటి?'

బుద్ధిమంతుఁడగు వాఁడిట్లనెను :-'ఆతఁడు పాదుకలు తొడుగుకొని నడిచెను. నేను రెండు పైసలనిచ్చి ఆవలికి బోయితిని. ఇద్దరమును నావలికి దాటితిమి. ఆతఁడు నీటినిఁ జల్లి యెండు కట్టెలను వెలగించెను. నేనొక పైసచకుముకుతో నగ్నిని వెలిగించితిని. ఆతఁడు చేసిన నగ్నితో నేకార్యము జరిగినదో నేను వెలిఁగించిన దానితోడను నాపనియే జరిగి నది. కావున నాతని సిద్ధులు మూఁడు పైసలకంటె నెక్కువ విలువ చేయునవి కావు.'

భగవానుఁ డిట్లనెను:-'ఉద్ధవా! కావునబుద్ధిమంతుఁ డగు వాఁడీ సిద్ధుల నపేక్షించువాని నాదరింపఁడు. ఇప్పుడు నీవే యాలోచించుకొనుము. ఈ శరీరమును వేయి, రెండు వేల సంవత్సరముల వఱకు నిలువఁబెట్టు కొనుటచే నేమి ప్రయోజనము? పుట్టినవాఁడు గిట్టితీరును. చెట్టును బుట్టిన

పండు పచ్చిది కానిండు పండుది కానిండు రాలితీరును, కావున బుద్ధిమంతుఁడగు యోగి శరీరసిద్ధులను గూర్చి చింతింపఁడు. విధ్యుక్తముగ యమ నియమములను బాటించినచో వానికి గాయకల్పము కలిగితీరును. ఆతని శరీరము స్వతః దివ్యమైనది కాగలదు. కాని యిట్లు జరిగినను నాకు సిద్ధి కలిగినదను నభిమానమును జెందరాదు. శరీరము పుష్పమువలెఁ దేలికయగుటయును, రోగరహితమైన దగుటయును, జిహ్వాలోలుపత లుప్తమగుటయును, శరీరమాకర్షకముగ నుండుటయు నివి యన్నియును యోగారంభమున గలవెట్లు. ఇట్టి వన్నియును యోగసాధన మొనర్చుచుండ మొదటనే కలుగును. సర్వము నిదే యనుకొనినచో నట్టి వాని యున్నతి ఆగిపోఁగలదు. ఆతఁడిఁక ముందునకుఁ బోఁజాలఁడు. కావున నీ క్షుద్ర సిద్ధులవైపు విశేషముగ లక్ష్యముంచరాదు.'

ఉద్ధవుఁడిట్లడిగెను:-'స్వామీ! విఘ్నములు రాకుండు నట్టి ఉపాయమును గూర్చి చెప్పుఁడు.'

భగవానుఁడిట్లనెను:-'ఉద్ధవా! కామనచే విఘ్నములు కలుగుచుండును. ఏ సాధకుఁడు నిష్కామ భావముతో నా భజన మొనర్చునో, స్వానందానుభవమున మగ్నుఁడై యుండునో, అట్టివానికి విఘ్నములు రానేరావు. ఒకవేళ సంభవించినను నాతఁడు లక్ష్యపెట్టఁడు. కావున సదా సర్వదా

వా యాశ్రయమున నుండి యోగసాధన మొనరింప వలయును ?

సూతుఁడిట్లనెను:-'మునులారా! ఇట్లు చెప్పిభగవానుఁ డూరకుండెను.'

శౌనకుఁడిట్లనెను :-' సూతా ! ఆ తరువాత నుద్ధవుఁడు భగవానునేమి యడిగెను ?'

సూతుఁడిట్లనెను:-'స్వామీ ! ఆ తరువాత నుద్ధవుఁడు మిక్కిలి వినయ భావముతో భాగవత ధర్మములను గూర్చి ప్రశ్నించెను. భగవానుఁడు దానికేమి ప్రత్యుత్తర మొసంగెనో దానిని నేను మీకు ముందు చెప్పెదను.'

---

## ఉద్ధవుఁడు భక్తినిగూర్చి మరల నడుగుట

శ్లో॥ నైవోపయన్త్యపచితం కవయస్తవేశ
బ్రహ్మాయుషాపి కృతమృద్ధముదః స్మరంతః ।
యోఽన్తర్బహిస్తనుభృతామశుభం విధున్వ
న్నాచార్య చైత్త్యవపుషా స్వగతిం వ్యనక్తి ॥

వ. దేవా! మనీషులగు ఋషులు నీ యుపకారములకు ప్రత్యుపకారమును జేయఁ దలఁచినను బ్రహ్మాయువును బొందినను జేయఁజాలరు. ఏలననఁగా నీవు ప్రాణుల

యొక్క బాహ్యాభ్యంతర మలములను నాచార్య, అంత ర్యామి రూపమునఁబోగొట్టి, నీ స్వరూప సాక్షాత్కార మును గావింపఁ జేసెదవు. కావున నీ యుపకారములను మాత్రము స్మరించి లోలోనఁ బ్రముదిత లగుచుందురు''

—శ్రీమదాంధ్ర భాగవతము.

ప్రశ్నలు రెండు విధములు. ఒకటి ముఖ్యప్రశ్న. రెండ వది పూరకప్రశ్న. పూరకప్రశ్నయందు ముఖ్యప్రశ్న కత్యంత సమీప సంబంధమును, దూర సంబంధమునగు విషయము లుండును. ఈ విషయములను దెలిసి కొనినచో, ముఖ్య ప్రశ్నను దెలిసికొనుటకు వీలుకలుగును. కాని పూరకప్రశ్న లచే ముఖ్యప్రశ్న స్పష్టము కావలయునను నియమము లేదు. ఒక్కొక్కప్పుడు పూరక ప్రశ్నలవలననే ముఖ్య ప్రశ్నకు సమాధానము లభించును. ఒక్కొక్కప్పుడు పూరక ప్రశ్న లను వినినమీఁదట మరల ముఖ్యప్రశ్నను వినుటకు జిజ్ఞాస కలుగును. భక్తియోగాధికారియొక్క ప్రశ్న భక్తియోగము నకు సంబంధించి యుండును. వక్త కర్థమగునట్లు చెప్పు టకు జ్ఞానయోగము, లయయోగము, కుండలినీ యోగము, హఠయోగము, ఇతర యోగములు వర్ణింపఁ బడును. ఆ యోగములనుగూర్చి తెలిసికొనుటకై ప్రశ్నకర్త, ఆయోగ ములలో వచ్చు సందేహములనుగూడ అడుగును. వక్త ఆ సందేహములకు సమాధాన మొసంగియుండును. అన్ని యోగములను వర్ణించి నపుడు భక్తి యోగమును గూడ

వర్ణించియుండెను. ఆతఁడు కేవలము యోగములను దెలిసికొనఁదలఁచినవాఁడే యైనచో నాతఁడు మరలఁ బ్రశ్నింపవలసిన పనియుండదు. కాని యీతఁడు భక్తుఁడు. భక్తి విషయమున నీతఁడు బాగుగాఁ దెలిసికొనఁ గోరును. ఈ ప్రసంగోపాత్త యోగములనుగూర్చి విని, యిప్పుడుద్ధవుఁడు భక్తివిషయమునకు సంబంధించిన దన ముఖ్యప్రశ్నను మరల నడుగుచుండెను. ఉద్ధవుఁడు భగవద్భక్తుఁడు. అందువలన సమస్త ధర్మములనుగూర్చి వినిన తరువాత నాతఁడు భాగవత ధర్మములనుగూర్చి ప్రశ్నించెను.

సూతుఁడిట్లనెను:- 'మునులారా! భగవానుఁ డుద్ధవునకు యోగచర్యోపదేశము నొసంగి యూరకొనఁగా నుద్ధవుఁ డత్యంతదీనుఁడై గద్గదవాక్కులతోడను, నత్యంత నమ్రతతోడను జేతులనుజోడించుకొని యిట్లనెను:- 'ప్రభూ! మీరీ యత్యంత దీన, హీన, మతిమలిన, పతితదాసుని యెడల నత్యంతానుగ్రహమును జూపించి నా కెన్నియో రహస్యములను జెప్పితిరి. కాని మీరు చెప్పిన యోగచర్యను యమ నియమాద్యాచరణముగల జితేంద్రియములే ఆచరింపఁగలవు. నావంటి అజితేంద్రియమున కీయోగచర్య దుస్సాధ్యమైనదే కాఁగలదు. నాకు సరళ, సుగమ, సర్వోపయోగకరమగు సాధారణమగు సాధనము కావలయును. దానివలన నేనే శ్రమను జెందకయే సుగమముగను, ననాయాసముగను సిద్ధిని బొందవలయును.'

భగవానుఁడిట్లనెను:- 'అన్నిటికిని గారణమీమనస్సే. ఇది ప్రపంచమున లగ్నమైయుండిన నానావిధములగు సంకల్ప వికల్పములొనర్చు చుండును. చిత్తమునకు విభిన్న నానావృత్తు లుండును. అది విషయముల మీఁదకు బరువిడు చుండును. చిత్తవృత్తుల నన్నిటిని నిరోధించి నాయందాచిత్తము నుంచ వలయును. ఇదియే సమస్తయోగములయొక్క లక్ష్యము. ఇది సమస్తసాధనల సారము.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'స్వామీ! ఇదియే నాకత్యంత కఠినముగఁ దోఁచుచున్నది. చాలమంది యోగులు మనస్సును వశమందుంచుకొనుటకు నిరంతరము ప్రయత్నించుచుందురు; కాని గాలిని మూటగట్టుటెంతటి కష్టమో, మనస్సునేకాగ్ర మొనర్చి నిగ్రహించుటంతటికష్టమే. ప్రయత్నము చేయఁగాఁ చేయఁగాఁ జాలమంది సాధకులు దుర్బలులగుచుందురు. అది వశపడకపోవుటచే నుదాసీను లగుచుందురు. వారు కింకర్త వ్యతావిమూఢులై సాధనరహితు లగుచుందురు. దీనికి విపరీత ముగ సారగ్రాహులగు భక్తులు చిత్తమునకై వ్యగ్రతను జెందక విశ్వనాథుఁడవునుగమలనయనుఁడవునగుమీచరణార విందముల నాశ్రయించెదరు. ఆ మీపాద పద్మములనే సర్వస్వ మని భావించి, వానినిఁ జింతించు చుందురు. అట్టివారికి ప్రయాసమేమియును గలుగదు. వారనాయాసముగనే మీ మాయను దాటుచుందురు. కాని మేము షట్కర్మలను

జేసితిమి, నాడీశుద్ధినిఁ గావించితిమి, ఖేచరీ ముద్రద్వారా అమృతపాన మొనర్చెదము, మాకు భక్తియును, గిక్తియు నక్కఱలేదు, అది కావలసినది స్త్రీలకును, మూర్ఖులకును మాత్రమేయను నహంకారుల మనస్సు మీ మాయాకారణ మున విపరీతముగఁ గాఁగలదు. వారి కాంతరిక శాంతియును గలుగదు, బాహ్యసుఖమును గలుగదు. సదా ఉద్విగ్ను లగుచుందురు.'

భగవానుఁడిట్లనెను:-'నాయనా! భక్తులకు నేను విక్రీతదాసుఁడను. నాభక్తులు నన్నాడించుచుందురు. నేనును వారికధీనుఁడనై ఆడుచుందును.'

కన్నుల నీరును గార్చుచు గద్గద కంఠముతో నుద్ధవుఁ డిట్లడిగెను:-'స్వామీ! మీరు భక్తవత్సలురు. మీరు మీ శరణాగతుల కాత్మసమర్పణ మొనర్చెదరు.' సర్వసుహృదా! వారి కుల, శీల, చరిత్రలవైపు ధ్యానముంచరు. బ్రహ్మేంద్రాది దేవగణమును వారి మణిమయ కిరీటరత్న కాంతులచే మీ పాదపద్మములను ప్రకాశింపఁ జేయుచుందురు. మీకు భయపడు చుందురు, అట్టి అచింత్య, ఐశ్వర్యశాలు రగు మీరు రామావతారము నందు వానర భల్లూకము లతో మిత్రత్వమును గావించితిరి. మీరు చెట్ల మొదటఁ గూర్చుంటిరి, వారు మీ శిరస్సుమీఁదఁ గూర్చుండిరి. ఇంతాశ్చర్యమును జెందఁబనిలేదు. మీరు మీ యనన్య

సేవకుల కధీనులగు చుందురు. కావుననే భక్తగణము భోగే
చ్ఛను జెందక మీ చరణములను జింతించు చుందురు.'

భగవానుఁడిట్లనెను:-'ఉద్ధవా! భక్తులు చాలదుష్కర్మ
లొనర్చుచుందురు. వారు సాంసారిక బంధువులను జింతింపక
నన్ను మాత్రమే చింతించు చుందురు.'

ఉద్ధవుఁడిట్లడిగెను:-'ప్రభూ! మీకు మించిన సుహృ
దుఁడు జీవికింకెవఁడుండును. మీరే సమస్త చరాచరప్రాణుల
కాత్మ స్వరూపులరు.సర్వప్రియులరు మీరే.మీరే అందఱకును
దల్లివి, తండ్రివి, సోదరుఁడవు. గురుఁడవు. సుహృదుఁడవు.
స్వామివి, సర్వస్వమును, మీ శరణు జొచ్చిన వారందఱ
కోరికల నన్నిటిని నెఱవేర్చు చుందురు. వారి యోగక్షేమము
లను మీరే చూచు చుందురు. ఇట్టి పరమోపకారినిమఱచి,
యే మూర్ఖుఁడీ నశ్వర, క్షణభంగుర సంబంధులతో స్నేహ
మొనర్చును. ఈ సాంసారిక సంబంధులకంటె నధికముగ
సాంసారిక భోగములు ప్రాప్తింపఁగలవు. ఈ సాంసారిక
భోగములు మోహమును గలుగఁజేయును. పరిణామమున
దుఃఖదములు. ఈ యనిత్య భోగములను మీవలన నవి
వేకియే కోరును. ఏ మాత్రము వివేకముండినను మీ పాద
పద్మ పావన పరాగమును బొంది పరమ ప్రముదితుఁడగును.
మేము మీచరణ కమలములనే ఆశ్రయించితిమి. ఇప్పుడు
మాకు దుర్లభమైన దేది కలదు?'

భగవానుఁడిట్లనెను:–'నాయనా! భక్తులు తమకుటుంబ పరివార గృహద్వారాదుల నన్నిటిని వీడి నా చింతనమునే చేయుచుందురు. వారు తమ నిస్వార్థ నిష్కపట ప్రేమచే నన్నుఁగొని వైచిరి. వారి ఉపకారమునకుఁ బ్రత్యుపకార మేమి యొనర్పఁగలను ?'

ఉద్ధవుఁడిట్లడిగెను:–ప్రభూ! ఇదియే మీభగవత్త్వము. భక్తులయెడల నిట్టికృతజ్ఞతను బ్రకటించుటయే మీకృపాళు తకు పరాకాష్ఠ. కాకున్న సచ్చిదానంద ఘనుఁడవును, సర్వ సమర్థుడవునగు నో జగదీశ్వరా! అజ్ఞుల విషయమును వదలి వేయుఁడు. విజ్ఞులును, వివేకులును, బ్రహ్మ వేత్తలును, ననంత బ్రహ్మాయుస్సును బొందినను మీ యుపకారమునకు ఋణమును దీర్చుకొనఁజాలరు. మీ యనంతోపకారములకు మేఱలేదు. మీరెంతో సుందర సర్వసాధన సంపన్నమగు శరీరమును బ్రసాదించితిరి. జీవులు పాపవృత్తులైనచో నంత ర్యామిరూపమగు మీరుదాని నాపెదరు. గురు రూపమున దీక్ష నొసంగెదరు. దేహధారుల అంతర్బాహ్య మలములను గడిగివైచి స్వచ్ఛముగను, నిర్మలముగను నొనర్చెదరు. వారిచే మీ యనుపమాద్భుత గుణనామకీర్తన మొనరింపఁ జేయించెదవు. మీ యుపకారము లొకటి రెండైనచో లెక్కింపవచ్చును. భక్తులు మీ యుపకారములను దలఁచు కొని రోదనమొనర్చెదరు. అందులో బ్రహ్మానందానుభవ మును జెందుదురు.

భగవానుఁడిట్లనెను :– 'ఇంత జరిగినది. ఇప్పుడు నీకేమి కావలయునో చెప్పుము. ఇంకేమైన నడిగెదవా?'

అంత నుద్ధవుఁడిట్లడిగెను:– 'స్వామీ! మీరంతయును నుపదేశించితిరి. యోగ, సాంఖ్య, భగవద్భక్తి, భాగవత ధర్మములను గూడ నిరూపించితిరి. కాని ప్రభూ! అన్ని ధర్మములును గలిసియుండుటచే భాగవత ధర్మములను విడదీయుటకు వీలు లేకున్నది. అన్నిటికిని నధికారులు వేఱు వేఱుగ నుందురు. ఎవరే సాధనమునకు యోగ్యుఁడగునో, వానికా సాధనము సులువుగ నుండును. అన్య సాధనలు కఠినముగ నుండును. యోగమునకు యోగ్యుఁడైనవానికి యోగసాధనమే సరళముగను, సౌకర్యముగను నుండును. ప్రభూ! నాకు మాత్రము మీ చరణారవిందాశ్రయము తప్పయింకేమియును దెలియదు. మీ భక్తులైనవారును, సదా మీయందనురక్తి కలవారును నెట్టి వ్యవహారమొనర్చెదరు? ఏ సాధనమొనర్చెదరు? దయతో నాకు స్పష్టముగ భాగవత ధర్మములను గూర్చి చెప్పవలయును. విశుద్ధ భాగవత ధర్మములను సంక్షిప్తముగఁ జెప్పవలయును. మీ భక్తిని జేయువానికిఁ గర్తవ్యమేమి? చివరకు సార సిద్ధాంతమును దత్త్వరూపమున నుపదేశించెప్పను. ఉపసంహారమునఁ గర్తవ్యము యొక్క యథార్థమర్మమును జెప్పను. ఇప్పుడు మీరు నాకుపసంహారమున భాగవత ధర్మములను జెప్పవలెను.'

భగవానుఁడిట్లనెను :–'ఉద్ధవా! నేను నీక నేక సారులు భాగవత ధర్మములను గూర్చి చెప్పితిని. కాని చూడఁగా జూడఁగా భాగవత ధర్మముల నెంతగా విన్నను నీకు దృప్తి కలిగినట్లు లేదు. నీకు భాగవత ధర్మములందత్యంతాభిరుచి యును, బ్రీతియును కలిగినది. ఇది అదృష్టము. నాయందు భక్తి కలుగుటకుఁ బ్రధాన లక్షణము. నా కథలను వినిన కొలఁది తృప్తి జనింపకుండుటయే. మంచిది, నేనిప్పుడు నీకు మరల నత్యంత సంక్షేపముగ భాగవతధర్మములను గూర్చి చెప్పెదను. వీనిని నీవు దత్తచిత్తుఁడవై శ్రవణమొనర్చుము.

సూతుఁడిట్లనెను :– 'మునులారా ! భగవానుఁడే విధముగ నుద్ధవునకు భాగవత ధర్మములను జెప్పెనో, ఆ ప్రసంగమును మీకు నేను జెప్పెదను.'

---

## భాగవత ధర్మ నిరూపణము

శ్లో॥ హంత తే కథయిష్యామి మమ ధర్మాన్సుమంగళాన్।
యాన్ శ్రద్ధయా చరన్మర్త్యో మృత్యుం జయతి దుర్జయమ్॥
— శ్రీ భాగ. ౧౧ స్కం. ౨౯ అ. ౮ శ్లో॥

వ. ఉద్ధవా ! మంచిది. నేను నీకు భాగవత ధర్మములను గూర్చి చెప్పెదను. అవి అత్యంత మంగళమయములు.

వానిని శ్రద్ధగా నాచరించినచోఁ బ్రాణి దుర్జయమగు మృత్యువును జయింప వచ్చును.'

—శ్రీ మదాంధ్ర మహాభాగవతము.

భగవంతునకు సేవా పూజలొనర్చుటయును, భాగవత ధర్మముల నాచరించుటయును నెంతో సుఖకరమగు కార్యము. భాగవత ధర్మము విశాలమగు ధర్మము. ఇందులో సంకీర్ణత లేదు. అనుదారత లేదు, ఇది సార్వభౌమ ధర్మము. మానవ స్వభావమునకు సర్వథా అనుకూలము. ఇందులో మన, ఇంద్రియ, ప్రాణముల కన్నిటికిని సంతోషము కలుగును. ఇందులో భోగములను వదలవలసిన పనియును లేదు. నోరు, ముక్కు, చెవులు, కండ్లు వీనిని మూసికొని ఉక్కిరి బిక్కిరి కావలసిన పనియును లేదు. ఇందులోఁ గేవలము భావమును మార్చుకొనవలసిన అవసరమున్నది. నీవు నీ కర్మల నన్నిటిని భగవంతునకు బ్రీతిగ నొనర్పవలయును. భగవత్సంబంధము చేతనే కార్యములందు ప్రవృత్తిని గలిగి యుండును. రసనేంద్రియమును జయించుటకై నీవు చేదు వస్తువులను గొంతులో వైచుకొని మ్రింగవలసిన పని లేదు. భాగవత ధర్మము ప్రకృతికి విరుద్ధమగు నాచరణమును జేయుమని చెప్పదు. నీవు మంచి పదార్థములను జేసికొన వచ్చును. ఉత్తమోత్తమ వ్యంజనములను జేసికొనవచ్చును, కాని వానిని భగవానుని కొఱకు చేయవలయును. వానిని

శ్రద్ధాభక్తులతో భగవానునకు నివేదింపవలయును. నైవేద్య మైన తరువాత యథేష్టముగ గడుపునిండ బ్రసాదమును గైకొనుము. జన సంసర్గమునకు సదా దూరముగ నుండుము ఎవ్వని ముఖమును జూడఁగూడదు, సర్వసంగ పరిత్యాగ మొనర్చువానిని భాగవత ధర్మము చెప్పదు. వనమునకు బొమ్మనదు. వివిక్తదేశమును జూచుకొనుమనదు. నీయిష్టము వచ్చినట్లు జనసంసర్గ మొనర్చుము. ఎంతమందితో నైనను గలిసి యుండవచ్చును. కాని కథా, కీర్తన, ఉత్సవాదు లలోఁ గలిసియుండుము. కథా కీర్తనములును, ఉత్సవము లును లేనిచోటున నీ వడుగైనను బెట్టవలదు. భాగవత ధర్మముయొక్క సారసిద్ధాంతము సమస్త చేష్టలను భగవం తుని కొఱకు చేయుటయే.

సూతుఁడిట్లనెను :—'మునులారా! ఉద్ధవుఁ డత్యంత దీనతతో ప్రేమ పూర్వకముగఁ బ్రభువును బ్రశ్నింపఁగా జగత్తునందు నిత్యనూతన క్రీడ నొనర్చువాఁడును, సర్వేశ్వ రేశ్వరుఁడును, త్రిమూర్తి స్వరూపుఁడును, నటనాగరుఁడు నగు కృష్ణుఁడు మిక్కిలి యానందమును బ్రకటించుచు నిట్లనెను :—'ఉద్ధవా! మంచిది. ఇప్పుడు నేను మరల నీకు భాగవత ధర్మములను గూర్చి చెప్పెదను. భక్తులగువారే కార్యము నొనర్చినను నాకొఱకే చేయవలయును. సమస్త కర్మములను నా సేవాభావముతో నొనర్పవలయును.

ఉద్ధవుఁడిట్లడిగెను:–'స్వామీ! చెప్పుట చాల సుల భము. కాని ఆచరించుట చాల కష్టము. ఈ మానవుఁడభి మానముతో నిండి యుండును. కొంచెము చేయఁగనే అభి మానము వచ్చిపడును. ఇదినేను జేసినాను. ఇది నాది. దీనిని నాసుఖము కొఱకేర్పఱచు కొంటిని. ఆ సమయమున మీరు జ్ఞాపకమునకురారు.'

భగవానుఁడిట్లనెను:–'ఉద్ధవా! నీవు చెప్పునది సత్యము. కాని క్రమక్రమముగ నభ్యాస మొనర్చినచోఁ జిత్తము నాయందు లగ్నము కాగలదు. మనస్సును నాయందుంచి నన్నే చింతింపవలెను. మనఃపూర్వకముగ నాయందను రాగము కలిగినచో నాసేవార్చనాదులు చాల బాగుండును. అంత నీ భావమును వృద్ధిని బొందించుకొను ప్రయత్న మొనర్పవలయును.'

ఉద్ధవుఁడిట్లడిగెను:–'స్వామీ! ఈ భావము వృద్ధి బొందుటెట్లు?'

భగవానుఁడిట్లనెను :–'సంగముయొక్క ప్రభావమధిక ముగ నుండును. తన తోటివాఁడు గౌరవముగఁ దినుచుండి నచోఁ దానును నట్లే తినఁ గోరిక కలుగును. వస్త్రములను ధరించిన వానినిఁ గాంచి అట్టి వస్త్రములనే ధరింపఁ గోరిక కలుగును. ఎవఁడైన నేదైనఁ బనిచేయుచుండినఁ దానును నట్టి పనినే చేయఁదలఁచును. విషయాసక్తులకు విషయము

లంచే ప్రీతియుండును. భోగవిలాసవస్తువు లెక్కువుగ నుండు టయే తమకు గౌరవమని భావించెదరు. అందువలన వారి దగ్గఱ నుండువారును వైషయిక వస్తువుల కొఱకు సతతము ప్రయత్నించుచుందురు. కావునభాగవత ధర్మములందనురాగము కలవారు విషయాసక్తుల సహవాసమును బొరపాటుననైనఁ జేయరాదు. భగవత్సేవా నిరతులును, ఆతని పూజాదులందు ప్రీతి నలవారునగు భాగవతు లెచ్చట నుండెదరో, వారి మధ్యనుండి కాలమును గడుపవలయును. వారికి తోడ్పడుట చేతను, వారి దినచర్యను గాంచుటచేతను వారి ననుక రించుటకు స్వాభావికమగు కోరిక పొడమును. అచ్చట నూరక కూర్చుండరాదు. నా కథలను నా భక్తులయొక్క కథలను వినుచుండ వలయును.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'స్వామీ! మీ కథలను వినుట ఉచితమే. కాని మీభక్తులు మనుష్యులుకదా! చాలమంది అసురులును, రాక్షసులును మీభక్తులైనారు. వారి కథలను వినుటచే లాభమేమున్నది?

భగవానుఁడిట్లనెను:- 'ఉద్ధవా! నా భక్తులు నా కంటెను శ్రేష్ఠులు. నేను భక్తుల పాదధూళికొఱకు సదా వారి వెనువెంటఁ దిరుగుచుందును. నా భక్తులు మానవు లగుగాక, దేవతలగుగాక, అసుర రాక్షసులగుగాక! వారి చరిత్రలను శ్రద్ధాభక్తులతో వినవలెను. వారి భక్తిమయ

చరిత్రముల ననుకరింపవలయును. వారు నన్నుఁబొందుట కేమిచేసిరో అట్లుచేయవలెను. నాకొఱకై మహోత్సవముల నొనర్పవలయును.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'స్వామీ! మీ యుత్సవము లెట్లొనర్పవలెను?'

భగవానుఁడిట్లనెను:-'నాకృష్ణాష్టమీ, రామనవమీ, నృసింహాచతుర్దశీ, వామనద్వాదశీ, మొదలగు పర్వములను మిక్కిలి వైభవముగ నొనర్పవలయును. నగరమున నూరేగింపు లొనర్పవలయును. ఉపన్యాస, నాటక, నృత్య, గానాద్యుత్సవముల నొనర్పవలయును. నానావాద్యములఁబ్రయోగింపవలెను. రాజమహారాజులవలె నూరేగింపు లొనర్పవలయును. నగరకీర్తన మొనర్పవలెను. ఈవిధమగు భగవత్సంబంధకార్యములచే నందఱకును లాభము కలుగును. దేశము పావనమగును. మనస్సును శుద్ధమొనర్చుకొనవలెను. భేదభావమునకు హృదయమున స్థానమీయరాదు.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'స్వామీ! దీనికేమి చేయవలసియుండును?'

భగవానుఁడిట్లనెను :- 'దీనికొఱకై అన్నింట సమభావ ముంచవలెను. నీచిత్తమును భక్తిభావముచే స్వచ్ఛముగను, నిర్మలముగను నుంచుకొనవలయును. నీలోను, అన్నిప్రాణులలోను నొకేయాత్మ యున్నదను భావన చేయుము.

అన్నిటియందు నన్ను భావించుము. ఆకాశమువలె సర్వత్ర నేను వ్యాపించియున్నానని భావించుము. లోపలను బయటను నిరావరణముగ నెట్లాకాశమున్నదో అట్లే నేను సర్వత్ర అంతర్బాహ్యములయం దున్నట్లు భావింపుము. జ్ఞానదృష్టిచే విచారణచే నందఱిలో నన్నుఁగాంచుము. అందఱను నా భావముతో నాదరించుము. ఇది ఉచ్చమైనది, ఇది నీచమైనది. ఈతఁడు బ్రాహ్మణుఁడు, ఈతఁడు చోరుఁడు, ఈతఁడు సదాచారి, ఈతఁడు భక్తుడు. ఇది సూర్యుఁడు, ఇది విస్ఫులింగము వీఁడు క్రూరుఁడు, వీఁడు కృపాళుఁడు ఇవన్నియును బాహ్యభేదములు. ఆత్మరూపమున నన్నిటియందును నొకే తత్త్వము కలదు. నా శక్తి సర్వత్ర సమానముగఁ గార్యమొనర్చుచున్నది. కావున నెవరిని నిందింపరాదు. నీకంటెఁ దక్కువవాఁడని భావించి యెవరినిఁ దిరస్కరింప రాదు. అహంకారమును జెందరాదు.'

ఉద్ధవుఁడిట్లడిగెను:–'స్వామీ! ఎంత ప్రయత్న మొనర్చినను నహంకారము వచ్చుచునే యుండును. ఇతరులను హేయముగఁ జూచుచుందుము. దీనికేమి యుపాయము కలదు?'

భగవానుఁడిట్లనెను:– 'స్వభావవశమున నట్లే జరుగుచుండును: కాని అట్లుకారాదు. నిరంతరము నన్నింటిలో నొకేయాత్మ కలదని జ్ఞాపక ముంచుకొనవలయును. అన్ని

టిలో సదానన్నే భావించుటచేఁ గ్రమక్రమముగ భేదభావము తొలఁగుచుండును. మనుష్యునియొక్క స్పర్ధ, అసూయ తిర స్కారభావములును, అహంకారాదులును దొలఁగి పోవును. నీవు చేయఁగలిగినచో సమభావమును జెందుటకై అత్యంత సుగమోపాయము నొకదానినిఁ జెప్పెదను.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'స్వామీ! అట్టి యుపాయమునే చెప్పుఁడు. ఈమనస్సతి చంచలమైనది. మనస్సుతో భావిం చెదము. మరల నిమిషములో మఱచిపోవుదుము. మనస్సు మీఁద భావములయొక్క స్థిరమగు ప్రభావము పడదు.'

భగవానుఁడిట్లనెను:- 'జీవితమున సమత్వము నభ్యా సము చేయఁదలఁచినవాఁడు దేనినిఁ గాంచినను ఆతఁడు పండితుఁడు కానిండు, మూర్ఖుఁడు కానిండు, బ్రాహ్మణుఁడు కానిండు అంత్యజుఁడు కానిండు, స్వజనుఁడు కానిండు, అన్యుఁడు కానిండు, సజ్జనుఁడు కానిండు, దుర్జనుఁడు కానిండు, తన్ను దూషించువాఁడు కానిండు, స్తుతించువాఁడు కానిండు. కేవ లము మానవుల విషయముననే కాదు, కుక్క, పిల్లి, గోవు, ఖరములలో నేదైనఁ గానిండు భేదభావము లేక అందఱకును సాష్టాంగ నమస్కార మొనర్ప వలయును. నమస్కార మొనర్చునపుడందు పరమాత్మ కలఁడని భావింపవలయును. ఖరరూపుఁడగు భగవానునకు నమస్కారము. చండాల రూపుఁడగు భగవానునకు నమస్కారము. విప్రరూపుఁడగు

భగవానునకు ప్రణామము.' అని యీ విధముగ మనో-వాక్కాయములచే నాత్మభావన మొనర్చుచు నందఱకును నమస్కరింప వలయును. ఇట్లు చేసినచో నతి శీఘ్రముగ సమత్వభావము నిలిచిపోవును.'

ఉద్ధవుఁడిట్లడిగెను:-'స్వామీ! దినమంతయును ప్రణామము లొనర్చుటకే సరిపోవును.'

భగవానుఁడిట్లనెను:- 'ఉద్ధవా! ఇది యింకను జాల మంచిదియే. మానవుఁడు తనయిష్టప్రాప్తికొఱకేమి చేయఁడు? భృత్యుఁడు తనపొట్టకొఱకు శరీరము నమ్ముకొనును. దినమంతయును, ఎనిమిది జాములును స్వామిసేవలో నుండును. రాజకర్మచారి ధనము కొఱకట్లే కూర్చుండి పని చేయుచుండును. వ్యాపారి ధనముకొఱకు ఉదయమునుండి అర్ధరాత్రివఱకు దుకాణమునఁ గూర్చుండియుండును. అచ్చటకే అన్నమును దెప్పించుకొనును. అసత్యములు పలుకును. విశ్రాంతి లేక అట్లే కూర్చుండును. పరీక్షా దినములలో విద్యార్థి శయన భోజనములను మఱచి చదువును. క్షుద్ర స్వార్థముకొఱకు జనులు వ్యర్థములగు సాంసారిక కార్యములలో నిమగ్నులై యుందురు. ఇది యా మహాత్కార్యము. ఏ సమయమున నే జీవునిఁగాంచిన భగవత్స్వరూపమని భావించి సాష్టాంగ మొనర్పవలయును. లోకులు తన్నుఁగాంచి నవ్వెదరనుకొనరాదు. పిచ్చివాఁడనుకొందు రనుకొనరాదు.

నవ్విన నవ్వనిమ్ము. పిచ్చివాఁడనిన ననినిమ్ము. జూదరుల నందఱును దూషించెదరు. ప్రభుత్వము దండించును. కారాగృహమునకును బంపించెదరు. కాని వాఁడు మరలబోయి ఆడుచునే యుండును. ఎవరిమాటను వినఁడు. ఒకానొక క్షుద్రవ్యసనమునకై యింతటి ప్రమత్తుఁడైనాఁడుకదా! ఇది గొప్పదికదా! లోక లజ్జకు తిలాంజలి నొసంగి అన్నిటికి ప్రణామ మొనరించుము.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'స్వామీ! సాష్టాంగ ప్రణామ మెంతవఱ కొనర్పవలెను?'

భగవానుఁడిట్లనెను :-'సమస్తచరాచర ప్రపంచము నారూపమని దృఢపడు వఱకు ప్రణామ మొనరించు చుండవలెను. ఇట్టి భావన దృఢము కాఁగానే, సర్వత్ర ఆత్మ భావము కలుఁగగానే వానికి ప్రపపంచ మంతయును బ్రహ్మమయముగఁదోచును. వాని కాత్మ బుద్ధి రూపమగు బ్రహ్మవిద్య ప్రాప్తించును. వానికి సర్వత్ర శాంతి సుఖానుభవము కలుగును. ఆతఁడు పూర్ణముగ నిర్భయుఁడగును. ఏలననఁగా నాతనికి భయము దూరముగనే యుండును. అందఱియం దాత్మబుద్ధి కలవాఁడెవరిని ద్వేషించును. ఎవరికి భయపడును. చిత్తమున సందేహ మేమియును లేకుండు నంత వఱకిట్లు చేయవలయును. అప్పుడు విరమించవలెను. అప్పుడన్నిటి యందాత్మభావము నుంచవలయును. ఇట్టి ఆత్మ

జ్ఞానికి లౌకిక, వైదిక కర్మలందేవిధమగు విధి నిషేధము లుండవు. ఆత్మ భావనా బలమున నాతఁడు త్రిగుణాతీతుఁడగును. నన్నుఁబొందుట కింతకంటె సరళసుగమోపాయము లేదు. ఏ విధముగనైనఁ గానిమ్ము, ఏ సాధనచేనైనఁ గానిమ్ము మనోవాక్కాయములందలి సమస్త వృత్తులచే సమస్త ప్రాణులందును నన్ను భావించుచు, సర్వత్ర నా యస్తిత్వమును గుర్తింపవలయును. ఇదియే నన్నుఁబొందుటకు సర్వసుగమ, సుందర శ్రేష్ఠసాధనము.'

ఉద్ధవుఁడిట్లడిగెను :- 'స్వామీ! సమత్వ భావమును భావింపుచుండ, మధ్యలో విఘ్నము కలిగినచో నేమిచేయ వలయును.'

భగవానుఁడిట్లనెను:-'నాయనా! విఘ్నములనుగూడ నా స్వరూపముగనే భావింపుము. మనము దొంగనుజూచి యేల భయపడుచుందుము. మన దగ్గఱ వస్తువులు మనవని యును, దొంగకడ నున్న వస్తువులు వేఱనియు భావించె దము. అన్ని వస్తువులును దనవేయనుకొనినచో దొంగకు భయపడవలసిన పనియే లేదు. ఏ వస్తు వెచ్చట నుండినను దనదే. గొప్ప గొప్ప వ్యాపారస్థులకు చాల నగరము లందు శాఖలుండును. ఆ శాఖలలోఁ జాల వస్తువులుండును. వాని నన్నిటిని వారుపయోగింపరు. చాలవస్తువుల నాతఁడు చూడనైనఁ జూడలేదు. కేవలము భావనావశమునఁ దన

వనుకొనును. ఆ భావనను వ్యాపక మొనర్చినచో నన్నియును దనవే. ఇట్లెచ్చటనైనను మనోభావనయొనర్చినచో విఘ్నము లుండవలసిన పనిలేదు. ఈ నాధర్మమును బ్రారంభము చేసిన తరువాత విఘ్నములవలన నిది యే మాత్రమును జెడి పోదు. విఘ్నములు బ్రకృతి గుణముల వలన సంభవించును. నేను బ్రకృతి గుణములకుఁ బరుఁడను. కావున నాధర్మ మును నప్రాకృతిక చిన్మయమైనదే. కావున దీనిలో నేవిధమగు విఘ్నబాధలు నుండఁజాలవు.'

ఉద్ధవుఁడిట్లడిగెను:–'స్వామీ! జరా, మృత్యు,వి రోగాదులను, ఆధి వ్యాధులును నావశ్యంభావులని అందఱకును దెలియును. వీనిచే దుఃఖము కలుగును. దీనినుండి బయట పడుటకు మార్గమేమున్నది?'

భగవానుఁడిట్లనెను:– 'నే నిదివఱకనేక సార్లు చెప్పి యుంటిని. సమస్త విఘ్నములను, దుఃఖములను దాటుట కొక్కటే ఉపాయము కలదు. అది అన్నిటియందును బ్రహ్మ భావముంచుటయే. ఎవఁడే కర్మనైనను ఇచ్ఛతోఁగాని, అనిచ్ఛతోఁగాని చేసిన దానిని నాకర్పణ మొనరింపవల యును. సదసద్భావములు అనఁగా మంచి చెడ్డ భావములు, సార్థక నిరర్థక భావములుద్భవించిన వానిని నిష్కామభావ ముతో నాకర్పణ మొనరింపవలయును. అసద్భావముల సమర్పణమును నాప్రాప్తికి సాధనము కాఁగలదు. అట్టి యెడ సద్భావముల విషయమున నీకేఁ జెప్పవలసిన పని

యేమున్నది. ఉద్ధవా! ఈ మానవ దేహమనిత్యము, నశ్వ
రము. ఇది ఒకానొకదినము నశించితీరును. నావి నావి యను
కొనుచుండిన వస్తువులన్నియు నిచ్చటనే నిలిచిపోవును. ఏ
దేహమును నిత్యమును దోమి తోమి కడుగుచుంటిమో,
అది ఒకానొక దినమున భస్మమైతీరును. లేదా మలముగ
వగును. ఇట్టి క్షణభంగుర, నశ్వర శరీరముచే, నిత్యుండను,
అవినాశియు, శాశ్వతుండను, బరమాత్మనగు నన్నెవండు
ప్రాప్తించునో, ఆతండే బుద్ధిమంతుండు. అట్టివాండే చతురుం
డును, పండితుండును. నాలుగు శ్వేతమృత్తికా ఖండము
(వెండిరూపాయ) లును బోవుచేయుటేమంత తెలివిగల
తనము? అనిత్యము వలన ననిత్యమే లభించును. అనిత్య
ముచే నిత్యమును బ్రాప్తించుట తెలివిగలవాని లక్షణము.
ఈ విధముగ నేను నీకిట్టి అత్యంత దుర్లభమగు జ్ఞానము
నొసంగితిని. ఇప్పుడు నీవేమి విననిందలంచితివి?'

సూతుండిట్లనెను :- 'మునులారా' భగవానుండీ
విధముగ నడుగంగా నుద్ధవుం డేడువ నారంభించెను. ఆతండు
భగవానునింకేమియు నడుగలేదు. ఇప్పుడు భగవానుం
డేవిధముగ నుద్ధవగీతోపసంహార మొనర్చెనో, దానిని మీకు
నేను జెప్పంబోవుచున్నాను. వినుండు.''

---

# ఉద్ధవ గీతోపసంహారము.

శ్లో. స ఏవ మాశిక్షితయోగ మార్గ
స్తదోత్తమ శ్లోకవచో నిశమ్య।
బద్ధాంజలిః ప్రీత్యుపరుద్ధ కంఠో
న కించి దూచేఽశ్రు పరిప్లుతాక్షః॥

—శ్రీ భాగ. ౧౧ స్కం. ౨౯ అ. ౩౮ శ్లో॥

వ. రాజా ! ఉత్తమ శ్లోకుఁడగు వాసుదేవ భగవానునివలన నుద్ధవుఁ డీ విధముగ యోగమార్గోపదేశమును బొంది, ఆతని చరణామృతపానము గావించి మౌనముగనుండెను. ఆతని నేత్రములనుండి ప్రేమాశ్రువులు ప్రవహించు చుండెను. ప్రేమాధిక్యమున నాతని కంఠము గద్గదిక మయ్యెను. ఆతఁడు మాటలాడఁజాలక చేతులనుజోడించి కొని అట్లే నిలుచుండెను.

—శ్రీ మదాంధ్ర భాగవతము.

సద్గురువు శిష్యుని సంశయముల నన్నిటిని నివారించి, చివరకాతనితో నిట్లనును :- 'నీ ప్రశ్న లన్నిటికిని సమాధానము నీకు లభించినదా? ఈ నా ప్రత్యుత్తరములచే నీకు సంతోషము కలిగినదా? నీ శోకమోహములు విడిపోయి నవా?' అంత శిష్యుఁడు సంతోషమగు శ్వాసను దీసికొని సహర్షముగ 'నామోహము నశించినది, ప్రశ్నలకు ప్రత్యుత్తరము లభించినద'నిన సద్గురువు తన శ్రమ సఫలమైనదను కొనును. సంవాద సమాప్తి యీ స్థలముననే కాఁగలదు. కాని

దీని తరువాతను నొక సదాచారము మిగిలిపోవును. సద్గురు వీ జ్ఞానమున కధికారిని నిరూపించును, ఈ జ్ఞాన మెట్టి యధికారి కీయవలెను. ఎవని కీయఁగూడదు. దీనికి దోడుగా నీ జ్ఞాన పరంపరా సంప్రదాయమును, మాహాత్మ్యమును గూడ జెప్పును. గురు శిష్యుల యొక్క అంతిమ ప్రశ్నోత్తరములు, ఉపదేశ మాహాత్మ్యము, అధికారి నిరూపణము వీనికే ఉపసంహారమందురు. ఉపసంహారమున శాస్త్రముయొక్క సార సిద్ధాంతము వచ్చును.'

సూతుఁ డిట్లనెను :- 'మునులారా! సమస్తోపదేశము నొసంగి భగవానుఁ డుద్ధవు నిట్లడిగెను:- 'ఉద్ధవా నీ వింకే మైన నడిగెదవా?' ఈ ప్రశ్నను విని యుద్ధవుఁడింకేమియును ప్రశ్నడుగక ఆతఁడు కన్నుల ప్రేమాశ్రు ప్రవాహమును గార్చుచుండ భగవానుఁడు తన యుపదేశము నుపసంహరించుచు, మునుముందుగా నీ జ్ఞానమాహాత్మ్యమునుగూర్చి చెప్పుచు నిట్లనెను:- 'ఉద్ధవా! నేను నీకు బ్రహ్మవాదము యొక్క సంపూర్ణసారసంగ్రహమును నొక్కయెడసంక్షేపముగాను, నొక్కయెడ విస్తారముగను జెప్పితిని. నేనీ జ్ఞాన బీజమును మత్తమాధికారియొక్క కర్ణములద్వారా విశుద్ధ హృదయ క్షేత్రమున నాటితినను సంతోషము మిక్కిలిగ గలుగుచున్నది. ఉపదేశ మొసంగు సమయమున నేనధీరతను గనుపఱచ లేదు. నీవడిగినదానికి నేను ధైర్యముతోఁ ప్రత్యు

త్తర మొసంగితిని. ఒకే ప్రశ్నను నీవనేక సారులడిగితివి. నీవెన్ని సారులడిగిననన్నిసార్లు నేను బ్రత్యుత్తర మొసంగితిని. మాటిమాటికి జెప్పుటచేఁ బునరుక్తి దోషము వచ్చు చుండును. కాని భాగవత ధర్మమందు పునరుక్తి దూషణము కాక భూషణమే యగుచున్నది. ఎవఁడెంతటి పునరుక్తి యొనర్చునో, ఆతఁడంతటి భక్తుఁడు. భగవంతుని ఓకే నామము నెన్నిసారులు పలికిన నంత యుత్తమము. భగవత్కథల నెన్నిసారులు వినిన, నెన్నిసారులు పఠించిన, నెన్ని మారులడిగిన నంత యెక్కువ లాభప్రదము. నీవు నన్ను జాల ప్రశ్నల ననేక మారులడిగితివి. నేనును మాటిమాటికిని వానికిఁ బ్రత్యుత్తర మొసంగితిని. నాయీ జ్ఞానమును దెలిసికొనిన మానవుఁడువిముక్తుఁడగును. ఇప్పుడు చివరకు నేనొక యాశీర్వాదము నొసంగెదను.'

ఎవఁడు మన సంవాదమును శ్రద్ధా సంయమపూర్వకముగ వినునో, వినిపించునో, చదువునో, చదివించుకొనునో, ప్రచార మొనర్చునో, ప్రచారమును జేయించునో, భక్తిపూర్వకముగ హృదయంగమ మొనర్చునో, విని మనన నిదిధ్యాసనములొనర్చునో, ఆతఁడు వేదములకును బరమ రహస్యమయ ముక్తి సనాతన పరబ్రహ్మను నవస్యము ప్రాప్తించును. ఇందణుమాత్రమైన సందేహము లేదు. స్వాయముగఁ జదువుకొనువానికంటెఁ జదువఁజాలని వారికి జదివి

వినిపించు జ్ఞానదాతలకు నేను ఋణపడి యుండెదను. అట్టి వారు నాకాత్మ సమర్పణ, వారికి నేనాత్మ సమర్పణ మొన రించెదను. నిత్యపాఠ మొనర్చిన ఫలమును జెప్పెదను.

ఏ భక్తుఁడు మన సంవాద రూపమగు గీతను నిత్యమును నియమముతోఁ బఠించునో, అట్టివానిహృదయమందలి తమస్సంతయును బారిపోఁగలదు. వానికి జ్ఞానరూపమగు దీపము ప్రాప్తించును. ఆ దీపముయొక్క పుణ్య ప్రకాశమున నాతఁడు నా సాక్షాత్కారమును బొంది పరమపావనుఁడగును. పాఠ మొనర్పఁజాలనివాఁడు శ్రద్ధాభక్తులతో శ్రవణ మొనర్చునెడల నాతఁడును నతి దుర్లభమగు పరాభక్తినిఁ బ్రాప్తించి సమస్త కర్మబంధనములనుండి శాశ్వతముగ విడివడును'

ఉద్ధవుఁడేడ్చుచు నిట్లడిగెను:- 'ప్రభూ! హృదయగ్రంథులను విప్పు నీ యీ పరమపావన జ్ఞానము నెవనికీయవలయును? దీనినిఁ బొందుట కధికారి యెవఁడు?'

భగవానుఁడిట్లనెను:-'ఉద్ధవా! నా యీ వచనమును ముడివైచుకొనుము. శుద్ధహృదయుఁడును, ప్రేమియు, సాధుస్వభావముకలవాఁడును, మృదులుఁడును, చరిత్రవంతుఁడును, శ్రద్ధాచరణము కలవాఁడును దీనినిఁబొందనర్హుఁడు.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'స్వామీ! వేదోపదేశము స్త్రీ శూద్రులకెట్లులేదో, అట్లే యీ జ్ఞానమునకును నియమము కలదా?'

భగవానుఁ డిట్లనెను :- 'ఉద్ధవా! నా వాక్కునకే వేదమని పేరు. ఇదియును నేను జెప్పిన జ్ఞానమే. వేద సదృశమైనదే. చాల విషయములలో నిది వేదములకంటెను గొప్పది. ఏలననఁగా వేద ప్రకాశమును నేను బరంపరాగత ఋషులద్వారా కావించితిని. ధ్యానమందు ఋషుల హృదయములలో వేదబుక్కు లుద్భవించును. ఈ జ్ఞానమును నేను స్వయముగ నా నోటితో జెప్పితిని. కాని యిది వీరికి పనికి వచ్చును, వీరికి పనికిరాదను నియమమేమియును లేదు. స్త్రీ కానిండు, శూద్రుఁడు కానిండు అందఱకీయవచ్చును. అధికారి కాకుండినచో నాతఁడు ద్విజుఁడగుగాక, వానికీ జ్ఞానము నుపదేశింపఁజనదు.'

ఉద్ధవుఁడిట్లడిగెను :- ''స్వామీ! ఈ జ్ఞానమును బొందఁదగని వాఁడెవఁడు? దీని నెవరికీయరాదో దయతోఁ జెప్పుఁడు.''

భగవానుఁడిట్లనెను: _ 'దాంభికునకును, తన స్వార్థసిద్ధికొఱకు మిథ్యావేషములను వేయువాఁడును, తానింకొకవిధముగఁ గనఁబడువాఁడును, వేదమునందును, ఈశ్వరుని యందును విశ్వాసము లేనివాఁడును, దుష్టప్రకృతి కలవాఁడును, వినఁదలఁపని వాఁడును, నాయందును, నాభక్తుల యందును, గోబ్రాహ్మణుల యందును, వేదశాస్త్రము లందును భక్తి లేనివాఁడును, మిథ్యాభిమానియు నిట్టివారి

యుపదేశమును బొందననర్హులు. ఇట్టివారి కుపదేశించుట ఊసరక్షేత్రమునందు బీజములను నాటుటయే కాఁగలదు. అచ్చట నవి అంకురింపవు సరిగదాబీజములును నశించును. కావున శ్రద్ధలేనివాఁ డెంతటి గొప్పవాఁడైనను వానికి దీనిని వినిపింపరాదు. బుద్ధిమంతుఁడైనవాఁ డెట్టివాఁడైనను వానికిఁ బ్రేమ పూర్వకమున దీనిని వినిపింపవలయును. ఏలననఁగా నా భక్తి శ్వపచునైనను బావన మొనర్చును. ఇది నా పని పూర్ణతమ జ్ఞానము.'

ఉద్ధవుఁడిట్లడిగెను :-'స్వామీ! పరిపూర్ణతమమనఁగా నేమి ?'

భగవానుఁడిట్లనెను:- 'కొంత జ్ఞాన మింకొక శాస్త్రమును వినక పూర్ణముకాదు. కాని యీ జ్ఞానమును వినిన తరువాత నింకొక జ్ఞానమును వినవలసిన పనియుండదు. అమృతపాన మొనర్చిన తరువాత నింకొకటి త్రాగనవసరముండదుగదా! జ్ఞానయోగము ద్వారా మోక్షము ప్రాప్తించును. కర్మయోగము ద్వారా ధర్మము ప్రాప్తించును, వాణిజ్యముద్వారా అర్థము ప్రాప్తించును, యశము, ఐశ్వర్యము, రాజ్యము వలనఁ గామాది సుఖములు ప్రాప్తించును. కాని నీవంటి నా యనన్య భక్తుఁడు నన్నే సర్వస్వముగ భావించును. నా కొఱకై అతఁడు త్రివర్గములనేకాదు ముక్తినైనఁ గాలదన్నును, వాఱు ముక్తినే కాదు సమస్త

మును త్యజించి నన్నే యుపాసించును. నాకాత్మా సమర్పణ మొనర్చుటచే నాతఁడు సమస్త జీవులలో విశిష్టుఁడగును. ఆతనికి జనన మరణములు శాశ్వతముగ నిలిచిపోవును. వారు నావార య్యెదరు. నాలోఁ గలిసిపోదురు. నేను నీ కిప్పు డత్యంత సంక్షేపముగ నీ జ్ఞాన మాహాత్మ్యమును జెప్పితిని. నీవు నాలో బ్రహ్మయొక్క సత్యస్వరూపమును బాగుగా గ్రహించితివా? నీ మనస్సులో నింక శంకను లేవుకదా! నీ మనస్సునందలి మోహము నశించినదా? నీ సమస్తశోక సంతాపములు శాంతించినవా?'

సూతుఁడిట్లనెను:–'మునులారా! భగవానునియొక్క స్నేహభరితములగు నీ వాక్యములను వినఁగానే ఉద్ధవుని హృదయ ముప్పొంగెను. ఆతని శరీరమంతయును బులక రించెను. కంఠమవరుద్ధమయ్యెను. ఆతఁడేదో మాటలాడఁ దలఁచెను గాని నోట మాటరాలేదు. ఆతఁడు చాలసేపటి వఱకు వెక్కి వెక్కి ఏడ్చుచుండెను. చిత్తము శాంతింపఁగనే హృదయము తేలిక యయ్యెను. అప్పుడు ధైర్యముగఁ బ్రేమావేశముచే విహ్వలుఁడై, తన చిత్తమును నిగ్రహించి, ప్రభుపాదపద్మములందుబడి, తన ప్రేమాశ్రువులచే నాతని చరణకమలములఁ దడుపుచు నిట్లనెను.'

భగవానుఁడిట్లనెను:– 'సర్వసమర్థుఁడవగు నో ప్రభూ! మీ వచనామృతములచే నా మోహము దూరమైనది,

మహామోహమయ ఘోరతిమిరము నాశ్రయించి నేను గింకర్తవ్య విమూఢుఁడనైతిని. ఆ అజ్ఞానాంధకారము మీ జ్ఞానభాస్కరోదయముచే నశించినది. మీ సుఖద సహవాస ముచే సమస్త సంశయములు శాంతించినవి.'

భగవానుఁడిట్లనెను :- 'ఇప్పటికిని నేదైన సంశయ ముండినచో నీవు నన్ను నిర్భయముగ నడుగవచ్చును.'

ఉద్ధవుఁడిట్లడిగెను:- 'స్వామీ ! చలికాలములో ఘోరాంధకారమయ వనమునందగ్ని వెలుఁగుచున్నచో శీత, భయాంధకారము లొక్కసారిగా నెట్లు పాఱిపోవునో, మీ జ్ఞానస్వరూపాశ్రయముచే నశాంతి, భయ, అజ్ఞానము ఈమూఁడును విలీనమైనవి. ఇప్పుడు నేను శాంతుఁడను, స్వస్థుఁడను, నిర్భయుఁడను, నిర్ద్వంద్వుఁడను, ఆనందమయుఁడ నైనాను. నే నిదివఱకే జ్ఞానస్వరూపుఁడను, కాని మధ్యలో నే కారణముననో అనిర్వచనీయమగు మాయ స్వాభావిక మగు నా జ్ఞానము నపహరించినది. అట్టి జ్ఞానరహితుఁడనై నేను నీ పాదముల నాశ్రయించితిని. మీరహైతుక కృపా ళురు. మీరు నాపై దయను జూపి మాయచే నపహరింపఁ బడిన జ్ఞానమును మరల నాకు బ్రసాదించితిరి. సంసార సాగ రమును సహజముగ దాటించు నీ మృదుల చరణములను వీడి యే కృతఘ్నుఁ డితరము నాశ్రయించును. మీ మాయచే మోహితుఁడనై నేను నా స్వరూపమును మఱచి

తిని. నేను దాశార్హ, వృష్ణి, అంధక, సాత్వత కులములోని వాఁడ ననుకొంటిని. వీరందఱును సుహృదులే కాని, చరాచర ప్రాణుల కేకైక సుహృదుఁడును, సంబంధియును, సఖుఁడును, సర్వస్వమును నీవేయని తెలిసికొంటిని. ఈమధుభోజ, దాశార్హ, కుకురాది కులములందలి వారిమీఁదఁగల మోహము విడిపోయినది. మీ మాయద్వారా యేర్పడిన నే స్నేహపాశము కలదో, అది నేఁడు మీచే ఖండితమైనది. ఆత్మబోధయను తీక్ష్ణఖడ్గముచే దానిని మూలమట్టముగ ఖండించితిని. ఇఁక స్వామీ! నాకేమి యాజ్ఞ నొసంగెదరు? ఈ మోహినీ మాయ యింక నామీఁదకు రాకుండు నట్లేదైన యుక్తినిఁ జెప్పుఁడు. మీ చరణారవిందములందు నాకవిరళభక్తి యుండున ట్లనుగ్రహింపుఁడు.'

సూతుఁడిట్లనెను :–'మునులారా! ఉద్ధవుఁడిట్లు ప్రశ్నింపఁగా భగవానుఁడు మౌనియై, ఉద్ధవుని విషయమై ఆలోచింప నారంభించెను.'

---

## ఉద్ధవుని వీడ్కోలు

శ్లో॥ నుదు స్త్యజ స్నేహ వియోగ కాతరో
న శక్నువ స్తం పరిహాతుమాతురః।
కృచ్ఛ్రం యయౌ మూర్ధని భర్తృపాదుకే
బిభ్రన్నమస్కృత్య యయౌ పునః పునః॥

—శ్రీభాగ. ౧౧ స్కం. ౨౯ అ. ౪౭ శ్లో॥

వ. ఉద్ధవుఁడు వియోగ కాతరుఁడై మిక్కిలి వ్యాకులమును జెందెను. ఏలననఁగా భగవానుని స్నేహ మత్యంత దుస్త్యజమైనది. వెంటనే చరణములను వీడిపోవుటకు శక్తుఁడు కాక, అత్యంతాతురుఁడై తన స్వామి చరణ పాదుకలను దీసికొని శిరస్సున ధరించెను. వానినిఁగైకొని మరల మరలఁ బ్రణామ మొనరించుచుఁ జాలకష్టముతో ద్వారకకుఁబోయెను.'

—శ్రీ మదాంధ్ర మహా భాగవతము.

ఎంతటి జ్ఞానియును వైరాగ్యవంతుఁడైనప్పటికిని భావుకుఁడును, సరసుఁడును, సహృదయుడగు వాఁడు స్నేహ పాత్రుఁడును, భగవద్భక్తుఁడు నగు వాని వియోగమున దుఃఖము వచ్చితీరును. నేత్రములనుండి ప్రేమాశ్రువులు నిరంతరము ప్రవహించు చుండును. చిత్తమున వికలత కలుగును. కాని యివి మోహ చిహ్నములు కావు. విశుద్ధ ప్రేమ చిహ్నములు. భక్త వియోగముననే యిట్టి స్థితియుండఁగా సౌందర్యధాముఁడగు సాక్షాద్భగవానుని వియోగమున నెట్టిస్థితి కలుగునో, అది అనుభవించిన వారికే తెలియవలయునుగాని అన్యులకు దెలియదు. తనయందనురాగము కలవాఁడు తన్ను విడిచి వెడలి పోవుచుండ హృదయమున నొక విచిత్రదశ కలుగును. హృదయమున నొక విధమగు మధురబాధ కలుగును, దానిని మీరు సుఖమనుఁడు, దుఃఖ

మనుఁడు. అట్టి అనిర్వచనీయమగు దుఃఖము పరమభాగ్య శాలురకే లభించును.

సూతుఁడిట్లనెను:–'మునులారా! ఉద్ధవుఁడు భగవానునితో నంతిమ కర్తవ్యమును గూర్చి ప్రశ్నింపఁగా భగవానుఁడిట్లనెను:–'ఉద్ధవా! యదుకులమునకు బ్రాహ్మణ శాపము సంభవించినది. ఇప్పుడీ కులమతి శీఘ్రముగ వినాశము చెందఁగలదు.'

ఉద్ధవుఁడేడ్చుచు నిట్లనెను:–'ప్రభూ! నాకు యదు కులముతో నేమిపని? రేపనక నేఁడే వినాశము కావింపుఁడు, నాకు కావసినది మీరే. మీరెన్నటికిని నాశముకారాదు. కారు. ఏలననఁగా మీరవినాశులరు.'

భగవానుఁడిట్లనెను:–'నాకు నాశమేమున్నది. నేను గాలకాలుఁడను. అయినను నేనీ ధరాధామమును ద్యజించి స్వధామ గమన మొనర్చెదను.'

దీనముగ నశ్రువిమోచన మొనర్చుచు నుద్ధవుఁడిట్లు ప్రార్థించెను. 'ప్రభూ! నన్నును మీరు మీవెంట స్వధామమునకుఁ గొనిపొండు.'

అత్యంత మమకారముతోఁ దన ప్రేమనంతను గుమ్మరించుచు నుద్ధవునితో భగవానుఁ డిట్లనెను:– ''అట్లు కాదు నాయనా! నీవలన నీ పృథివియందు కావలసిన పని

చాలకలదు. నీవు కొన్నాళ్లిచ్చట నీ ధరాధామముననే యుండుము''

ఏడ్చుచు నుద్ధవుఁడిట్లనెను:-'స్వామీ! మీరు వదలివైచిన నీ ధరాధామమున నేనెట్లుండఁగలను! మీయాజ్ఞను గాదనువారెవరు నుండఁజాలరు? నేనెచ్చట నుందును?'

భగవానుఁడిట్లనెను:-'నాయనా! నీవధీరుఁడవు గాకుము. నీవు బదరీ వనమునకుఁ బొమ్ము. అచ్చట నతి పవిత్రమును, శాంతమును, గోలాహల - రహితమునగు నాశ్రమము కలదు. అచ్చట నాపాదములనుండి యుద్భవించిన నలకనందయను గంగకలదు. దానిలోని జలమత్యంత నిర్మలమును, స్వచ్ఛమును, నమృతోపమానముగను నుండును. వానిని యథేష్టముగఁ బాన మొనర్పవచ్చును. దానిలో స్నానమొనర్చి అచ్చట లభించు కందమూల, ఫలాదులను దినుచు ధ్యాన మొనర్చుచుండుము. పరమపావనమగు నలకనందా స్నాన పానాదుల విషయమట్లుంచి, దానిని దర్శించుట చేతనే సమస్త పాపములు పటాపంచలగును.'

ఉద్ధవుఁడిట్లడిగెను:-'స్వామీ! అచ్చట మంచుపడి చాలచలిగా నుండునుగదా!'

భగవానుడిట్లనెను:-'అయితేనేమి? శీతోష్ణములను సహించుటకే తపస్సని పేరు. శీతోష్ణ, సుఖ దుఃఖాది ద్వంద్వములను సహించుచు నచ్చటనే నివసించుము. సుశీల

శాంత చిత్తముతో జితేంద్రియుఁడవై, బుద్ధిని సమాహితము గను, స్థిరముగను నొనర్చుకొని నన్ను ధ్యానించుచుండుము. జ్ఞాన, విజ్ఞాన యుక్తుఁడవై, నిర్ద్వంద్వ భావముతో నచ్చట వనములలోఁ దిరుగుచుండుము. అచ్చటి సమస్తౌషధులనుండి గంధము వచ్చుచుండును. అందువలన నాపర్వతమునకు గంధమాదనమను పేరు వచ్చినది. ఆ పర్వతమున నివసించుచు, నేను నీకు జెప్పిన భాగవత ధర్మములను పాలించుచు, మనస్సుతో నా మనోహర రూపమును మనన మొనర్చుచుండుము. వాక్కులతో నాసుమధుర పావన నామములను గీర్తన మొనరించు చుండుము. నేను నీకుపదేశించిన విషయమును స్మరించుచు, నిరంతరము దాని ననుభవ మొనర్చుకొనుము. నీవిట్లు చేయుచుండినచోఁ ద్రిగుణాతీతుఁడవై పరబ్రహ్మ పరాత్పరుఁడనగు నన్నుఁబొందఁగలవు. నీ మూలమును నేను జెప్పిన సాధనములను బ్రచారప్రసార మొనర్పవలసి యున్నది.'

ఏడ్చుచు నుద్ధవుఁడిట్లనెను:-'ప్రభూ! దీన హీనుఁడ నగు నన్ను మీరేల త్యజించుచున్నారు? నాకు సర్వస్వము మీరే కదా! ప్రభూ! నేను మీరు లేక ఒక్క నిమిషమైనను జీవింపఁజాలను.'

భగవానుఁడత్యంత ప్రేమతో నిట్లనెను:- 'ఓయీ! నేను నిన్నెచ్చట వదలిపోవుచున్నాను? బదరీవనము నా

నివాసస్థానము, భూవైకుంఠము, నిత్యధామము. అచ్చట నీ వెల్లప్పుడును నన్ను స్మరించుచు నుండవలయును.'

ఉద్ధవుఁడధీరతతో నిట్లనెను:- 'అశరణశరణా! భక్తవత్సలా! అంతయును సత్యమే. కాని అచ్చట నాకీచరణారవిందము లెచ్చట లభింపఁగలవు? నాకీ పరమపావన చరణరజమును శిరస్సు నలఁదుకొను భాగ్య మెచ్చటనుండి లభింపఁగలదు? నేను పుట్టినప్పటినుండి యీ చరణ సన్నిధిని నివసించి యుంటిని. వీనిని నేనెట్లు పరిత్యజింపఁగలను?'

ఉద్ధవుఁడత్యంత అధీరుఁడై, వెక్కి వెక్కి యేడ్చుచుండ, నాతని నోదార్చుచు, నాతని వీపుపై బరమమృదుల వరద హస్తముచే నిమురుచు, అత్యంత మమకారముతో బుజ్జగించుచు భగవానుఁడిట్లనెను:-'నాయనా! నీ వీ విధముగ నధీరుఁడవు కారాదు. నీకు నా చరణారవిందములందు మోహ ముండినచో నివిగో, కొనిపొమ్మా చరణపీఠములను. వీనినిఁ బ్రతిదినమును బూజించుకొనుచుండుము.'

సూతుఁడిట్లనెను:-'మునులారా! భగవానుఁడు చరణపాదుకలనుదీసి ఉద్ధవున కొసంగఁగా నాతఁడత్యంత ప్రేమ మమకారములతో వానిని శిరమున ధరించి, మాటిమాటికిని గన్నుల కద్దుకొనుచుఁ బ్రేమాశ్రువులచే వానికి పాద్యార్ఘ్యముల నొసంగెను. చరణపాదుకలను బొంది భగవానుని జిన్మయ స్వరూపమునకు రెండు ఉపాంగములు లభించినట్లు

భావించెను. భగవానుఁడు పాదుక లొసంగినాఁడు, బదరీ వనమునకుఁ బోవుట కాజ్ఞ యొసంగినాఁడను సంగతిని దెలిసి కొని ఉద్ధవుఁడు చాల కష్టముతో లేచెను. భగవానుఁడీ ధరాధామమును వదలిపోయిన నింక ద్వారకానగరమును నుండదనుకొని ఉద్ధవుఁడు విహ్వలుఁడై బాలునివలె బిగ్గఱగ నేడ్వనారంభించెను. అట్లేడ్చుచు భగవానునకుఁ బ్రదక్షిణములు కావించుచు మాటిమాటికి జరణములపైఁ బ్రణామములు కావించుచుండెను. భగవానునియొక్క దివ్యోపదేశముచే నాతనికి జ్ఞానముకలిగినను, వియోగమునుస్మరింపఁగనే ఆతని హృదయము బ్రద్దలగుచుండెను. ప్రేమాతిరేకమున నాతఁడాత్మవిస్మృతిని జెందెను. శ్రావణ భాద్రపదములందువలె నాతని కన్నులనుండి యశ్రువులు ధారలుగఁ బడుచుండెను. నిద్రించినను మేల్కొన్నను, కూర్చుండినను నిలుచుండినను క్షణమైనను విడువక నిరంతరము ఛాయవలె ననుసరించుచుండిన శ్రీకృష్ణుని ప్రేమస్వరూపమగు నుద్ధవునకు కాతరత పరాకాష్ఠ నందుకొనెను. ఆతఁడు భగవానుని చరణపాదుకలను కృపణుఁడు ధనమును దాచుకొని నటుల శిరస్సున ధరించి, ఆతఁడు దూరముగఁ బోవుచుండినకొలఁది ఆతనికధికముగ మానసిక కలియక కలుగుచుండెను. ఆతఁడొక్కొక్క అడుగు వేయుచు నేడ్చుచుండెను. ఆతనిఁ

గాంచుచు వెనుకకు నడుచుచుండెను. ఈవిధముగ నాతఁడు ద్వారకనుండి వెడలిపోయెను.

ఆతని మనస్సునఁ బోవలయునని లేదు. కాని ప్రభువాజ్ఞ యగుటచేఁ బోవలసివచ్చెను. అందువలనఁ నాతఁడు పోవుచుఁ గొంచెము సేపేదో ఆలోచించుకొని ఆగిపోవుచుండెను. ఎంతగాఁ బ్రయత్నించినను నాతఁడు ముందునకుఁ బోఁజాలకుండెను. చాటుచాటుగా భగవానుని వెనువెంటఁ బ్రభాసమువఱకు పోయి, మరల భగవానునకుఁ గనఁబడి మరల నుపదేశమునుబొంది వ్రజమునకు వచ్చెను. అచ్చట విదుర సందర్శనము లభించెను. ఒకరాత్రి ఆతనితోఁ గలిసియుండెను. రాత్రి యంతయు శ్రీకృష్ణకథలో నిమగ్నులై యుండిరి. ప్రాతఃకాలమున విదురుఁడు దుఃఖించుచు మైత్రేయుని వలన భాగవతశ్రవణమొనర్చుటకు హరిద్వారమునకు బోయెను, ఉద్ధవుఁడింకను ముందునకుఁ బోయెను.

ఉద్ధవుఁ డిట్లనుకొనెను:- 'నేను శ్యామ సుందరుని యాజ్ఞచే, గోపికలకు జ్ఞానోపదేశమొనర్చుటకు బృందావనమునకు బోఁగా, నచ్చట వారి యద్భుతప్రేమను గాంచి, వారికి శిష్యుఁడను, సేవకుఁడనైతిని. అప్పుడు నేనిట్లు ప్రార్థించితిని :- 'ప్రభూ! నన్ను బృందావనమున నేదైన లతగనో, గుల్మముగనో నొనర్పుము. ఏలననఁగా నీ మహాభాగులకు వ్రజవాసినుల పాదధూళి నామీఁదఁ బడవలయును. " నా

యభిలాష యిట్లుండఁగా భగవానుఁడు నన్ను బదరీ వనము నకుఁబోయి సాధన చేయుమనినాఁడు. భక్తవత్సలుఁడగు భగవానుఁడు భక్తులయొక్క చిన్నకోరికలను, గొప్పకోరిక లను దీర్చుచుండును. ఇప్పుడు నాకాతఁడు వ్రజమందలి దివ్య రసమును రుచిచూపించునో, పర్వతములలో సాధన చేయు మనునో, తెలియకున్నది.'

ఉద్ధవుఁడు గోవర్ధన పాదమునఁ గుసుమసరోవర నికట మునఁ గల సఖీ స్థలమునఁ గూర్చుండి యిట్లాలోచించు చుండఁగనే, ఆతనికి రెండురూపము లయ్యెను. అందులో నొకటి రసరూపమును, రెండవది సాధన రూపమును. బృందావనము రసభూమి. కావున రసాస్వాదన మొనర్చు టకై ఆతని రసరూపము లతారూపమునందు ప్రవేశించెను. ఇప్పటికిని గోవర్ధన రాధాకుండమునకు మధ్య కుసుమ సరో వర ప్రాంతమున నా యుద్ధవలతయున్నది. అచ్చటనే ఆలతా రూపమున నా యుద్ధవుఁడుండును. ఏ భక్తు లచ్చటికిఁబోయి భాగవత సప్తాహ మొనరించెదరో, వారికి దర్శనమును నిచ్చుచుండును. రెండవ రూపమగు సాధన రూపమున బదరీవనమునకుబోయి, యిప్పటికిని భగవంతుని యుపాసక రూపమున నున్నాఁడు. ఉద్ధవునకు ఉత్సవమే స్వరూపము. కావున నాతఁ డుత్సవ విగ్రహరూపమునఁ బూజింపఁబడు చుండును. వర్ష కాలమున నొకదినమందు ఉత్సవరూపమున

వామన ద్వాదశీ దినమున మూర్తిమాత దగ్గఱకు బోవును. ఉద్ధవుఁడు తెచ్చిన శ్రీకృష్ణచరణపాదుక లిప్పటికిని బదరీనాథ దేవాలయమునఁ గలవు. కాలప్రభావమున వాని యాకృతులు చిన్నవైనవి. యాత్రికులకు కుంకుమపూవుతో నూఱిన చందనము చరణపాదుకా ప్రసాద రూపమున లభించును. ఇప్పటికిని నుద్ధవుఁడు తపోమయాచరణ మొనర్చుచు భగవానుని యొక్క దివ్యఛవిని ధ్యానించుచుండును. ఈ విధముగ నాతఁడు భగవత్ప్రాప్తినిఁ జెందెను. ఆతఁడు నిర్ద్వంద్వుఁడును నిరామయుఁడు నయ్యెను.

మునులారా! నేను మాగురుదేవుని వలన వినిన నుద్ధవగీతను మీకుఁ జెప్పితిని. ఈ జ్ఞానము నే ఋషులుగాని మునులుగాని చెప్పినది కాదు. కేవలము భగవానుఁడగు శ్యామసుందరుఁడు ఉద్ధవునకు దన నోటఁ జెప్పినది. భగవానుఁడు యోగేశ్వరేశ్వరుఁడును, ఆనంద నిలయుఁడునై యున్నాఁడు. ఇఁక శ్రోతయో పరమ భాగవతోత్తముఁడును, నైకాంతికుఁడును, భగవద్భక్తుఁడగు నుద్ధవుఁడు. ఈ జ్ఞానము నే కొలఁదిగ విన్నను, ఈ ధర్మ మెంత స్వల్పముగ నాచరించినను ఘోరాతిఘోర భయములను దాటిపోవచ్చును. వారు తరించుటయే కాదు, వారి సాంగత్యమున నందఱును దరించెదరు. వారికి ప్రపంచముండదు. మునులారా! తిలలందు గల తైలమును గానుగాడినఁగాని లభింపదు. పాల

యందలి వెన్న మథించినఁ గాని బయట పడదు. ప్రతి పుష్ప మందును మధువుండును. తేనెటీఁగ దానిని దీసి ఒకచోట కూడఁబెట్టిన నది మనకు లభించును. అటులనే వేదములలో సమస్త జ్ఞానమును గలదు. కాని దానిని మథించి తత్త్వ మును భగవంతుఁడే తీయవలయును. అందువలన భగవానుఁడు రెండుసారులు సముద్రమంథనమును గావించెను.

శౌనకుఁ డిట్లడిగెను:- 'సూతా ! ఒకసారి క్షీరసాగ రమునందు మందరమునుంచి, వాసుకిని త్రాడుగా నొనర్చి అజితభగవానుఁడు సముద్రమును మథించెను. రెండవసారి సముద్రమును మథించిన దెప్పుడో ?'

సూతుఁడిట్లనెను :-'స్వామీ ! ఒకసారి సముద్రమును మథించుట ప్రసిద్ధమే. దానిలోనుండి ధన్వంతరి అమృతకలశ మును బట్టుకొని రాఁగా నసురులు లాగుకొని పరువిడిరి. భగవానుఁడు మిక్కిలి యుక్తితో నసురులనుండి అమృత మును లాగుకొని, తన భక్తులగు దేవతల కొసంగెను. రెండవసారి సమస్త వేద వేదాంత రూపమగు జ్ఞానసముద్ర మును మథించి జ్ఞాన విజ్ఞాన సారమగు సిద్ధాంత రూపమగు నుద్ధవగీతామృతమును దీసిరి. దానిని భగవానుఁడు తన భక్తుఁడగు నుద్ధవునకు ఉద్ధవగీతామృత రూపమున నొసంగి నను దానిని భక్తుల కొఱకు ఆతని ద్వారా ప్రకటపరచెను.

వ భక్తులీ యుద్ధవగీతరూపమగు జ్ఞానామృతపాన మొన
రించెదరో వారు తప్పక అమరులు కాఁగలరు. నేనిప్పుడు
మీకు ఉద్ధవగీతను జెప్పితిని. ఇప్పుడు మీరింక నేమి విన
దలఁచుచున్నారు ?''

అంత శౌనకుఁడిట్లడిగెను :– 'సూతా! పరమ భాగ
వతుఁడగు నుద్ధవుఁడు ద్వారకనుండి బదరీవనమునకు
బోఁగానే భగవానుఁడు మరల నేమి యొనర్చెను ?' భగ
వాఁడు బ్రాహ్మణశాపము నన్యథా యొనర్పఁజాలఁడా?
భగవానుఁడు బ్రాహ్మణ శాపమును స్వీకరించి తన కుల
సంహారమును స్వయముగఁ జేయించెను. సమస్తేంద్రియ
ములకును, మనస్సునకును బరమ సుఖప్రదానము కావించు
దన విశ్వవిమోహన వాయువును నాతఁడెట్లు త్యజించినాఁడు.
ఆహా! శ్యామసుందరుని దివ్యమోహన రూపమునం దొక్క
సారి మనస్సు లగ్నమయ్యెనా, ఇంకఁ దిరిగిరాదు. అది
అట్లంటుకొని పోవలసినదే. కామినీ కటాక్షవీక్షణమున
బురుషుఁడు తగుల్కొనెనా, ఇంక నట్టివాఁడ సన్న్యా
సము సంగతి యెత్తనేయెత్తఁడు. కన్నులతోఁ జూడ నక్కఱ
లేదు. చెవులద్వారా హృదయములోఁ బ్రవేశించినఁజాలును.
అచ్చటనే నిలిచిపోవును. ఇంక బయట పడఁడు. అట్లే భక్తులు
కవిగణము యొక్క వాక్కులతో నా భగవానుని వర్ణించి
నచో వారి వాక్కులు కృతార్థములగును. వానిలో నొక

విధమగు మాదకత కలుగును. అత్యధికాకర్షము కలుగును. మహాభారత యుద్ధమున నర్జునుని రథమందుండిన దివ్య మంగళ మోహాకరూపమును గాంచిన నర్జునిచేఁ జచ్చిన వారందఱును సారూప్యముక్తినిఁ జెందిరి. అట్టి రూపము నేల తిరోహితము కావించినాఁడు? ఆతఁడెట్లంతర్హితుఁ డయ్యెను. ఆతఁడు తన చరణస్పర్శచే నీ క్షితిని వంచిత నొనర్చి స్వధామమున కెట్లు పోయెనో దానిని మాకుఁ జెప్ప వలయును. సూతా! నీవు చిరంజీవి వగుగాక! అనుపమాన మగు నమృతపానమును గావింపఁ జేయుచున్నావు. మహా భాగా! నీవు మాకు శ్రీ కృష్ణ చరిత్రను వినిపించి కృతా ర్థుల నొనరించితివి.'

సూతుఁడిట్లనెను:- 'మునులారా! నాలో శ్రీకృష్ణ చరితమును జెప్పగల శక్తి యెచ్చట నున్నది? సూర్యుఁడు చక్షుర్గోళము నందుండి తన్నుఁ జూచుశక్తి యిచ్చునట్లు, మీరు నాహృదయమునందు ప్రేరణమును గలిగించి జ్ఞానము నుత్పన్న మొనర్చుచున్నారు. తానే శ్రోతలుగనై దాని నాస్వాదించుచుండును. మీరే నాచేఁ జెప్పించుచున్నారు. వినుచున్నారు. శ్రోతలును, వక్తయును మీరే. నన్నూరక నిమిత్త మొనర్చినారు. మీరు నన్నేమని ప్రశ్నించితిరో, అట్టి ప్రశ్ననే పరీక్షిన్మహారాజు మాగురువగు శుకమహర్షినిఁ బ్రశ్నించినాఁడు. దాని కాతఁడెట్టి ప్రత్యుత్తర మొసంగెనో, నేనును మీకు యథావిధిగఁ జెప్పెదను. మీరు దానిని సావధానులరై వినుఁడు.'

---

# యదువంశ వినాశసూచన

శ్లో॥ దివి భువ్యంతరిక్షే చ మహోత్పాతాన్సముత్థితాన్।
దృష్ట్వాసీనాన్ సుధర్మాయాం కృష్ణః ప్రాహ యదూనిదమ్॥

—శ్రీ భాగ. ౧౧ స్కం. ౩౦అ. ౪శ్లో.

వ. 'రాజా! శ్రీకృష్ణభగవానుఁడు పృథివి, ఆకాశము, అంతరిక్షము వీనియందు మహోత్పాతములు కలుగుటను గాంచి, ఆతఁడు సుధర్మసభయందు గూర్చుండి యాదవులతో నిట్లనెను.'

—శ్రీ మదాంధ్ర మహా భాగవతము.

ఎట్లు జరుగనున్నదో, దానికి దగిన సూచనలు కనఁబడుచుండును. అహంకార మదమత్తులైన వారపశకునములను గాంచి అవహేళన మొనరించెదరు. వారహంకారమునకు వశీభూతులై ఆవైపునకు జూడనే చూడరు. చివరకు పశుపక్ష్యాదులను రాఁబోవు అపశకునములను గాంచి తమ తమ స్థానములను వదలిపోవును. కావలసిన దేదియో అయి తీరును. ప్రారబ్ధము నెవఁడును దాటఁజాలఁడు. దాన ధర్మము లొనర్చుటచేతను, తీర్థాది పవిత్ర స్థానములందుండుట చేతను నశుభగతులుండవందురు. కావున విపత్తులు వచ్చినపుడు సాధుసంగమున నుండవలయును. దాన ధర్మాది పుణ్యకార్యములందు మనస్సును లగ్న మొనర్ప వలయును. పుణ్య తీర్థ స్థలములకును, ఉత్తమ పుణ్యక్షేత్రములకును

బోయి కాలమును గడుపవలయును. ఈ కార్యములచే నశుభనాశము కాఁగలదు. సద్గతిప్రాప్తియును గలుఁగగలదు.

సూతుఁడిట్లనెను:–'మునులారా! ఉద్ధవుఁడు వెడలి పోఁగానే ద్వారకాపురి యందు నిత్యమును నూతనోత్పాతములు కలుగుచుండుటను భగవానుఁడు గమనించెను. మేఘములు లేకయే పిడుగులు పడుచుండెను. వనమునందుండు పక్షులు నగరములోనికి వచ్చి యేడ్చుచుండెను. దేవతా విగ్రహములకు చెమట పోయుచుండెను. రక్తమాంసములు వర్షించుచుండెను. రూక్షమగు వాయువు వీచుచుండెను. ఇంకను నిట్టివే అనేకములగు నుత్పాతములు కలుగుచుండెను. ప్రళయ సూచకములగు నీ యుత్పాతములను గాంచి, భగవానుఁడు యాదవుల నందఱనుబిలిపించి వారితోనిట్లనెను:– 'నాయనలారా! మీరు చూచుచుంటిరికదా! ప్రతిదినమును నిత్యనూతన భయంకరోత్పాతములు కలుగుచున్నవి. అసంఖ్యాకములగు నపశకునములు కలుగుచుండును. దీనిపరిణామ మేమి కాఁగలదో?'

ఆకులతతో యాదవులిట్లనిరి :– 'ప్రభూ! మా కేమియును దోఁచుటలేదు. దీనిఫలమేమో మీరే చెప్పవలయును.'

భగవానుఁడిట్లనెను:– 'ఇవన్నియును ప్రళయ లక్షణములు. ఈ లక్షణములనుబట్టి యదుకులమునకు గొప్పవిపత్తు రానున్నదని తోఁచుచున్నది.'

అత్యంత భయభీతులై అందఱిట్లనిరి :- 'స్వామీ! ఇప్పుడు మాకు కర్తవ్యమేమి?'

భగవానుఁడిట్లనెను:- 'ద్వారకలోని యీ యుత్పాతముల వలన యముఁడు మనలను బిలుచుచున్నట్లున్నది. ఇట్టి స్థితిలో మనమిచ్చట నొక్క క్షణమైనను నుండఁజనదు.'

తడబడపడుచు ద్వారకాపురిని వదలి యెచ్చటికి పోఁగలము ?

భగవానుఁడిట్లనెను:-'పిల్లలను, స్త్రీలను, వృద్ధులను శంఖోద్ధారక తీర్థమునకుఁ బంపివేయవలయును. మనమందఱు మును గలిసి ప్రభాసతీర్థమునకుఁ బోవుదము. అది గొప్ప పవిత్రక్షేత్రము. పావనమైనది. అచ్చట పశ్చిమముగాఁ బ్రవహించు సరస్వతీ పుణ్యనదికలదు. అచ్చటనే మనమనిష్ట శమనార్థము ప్రయత్నించెదము.'

యాదవులిట్లడిగిరి:- 'అచ్చటికి బోయి మన మందఱు మేమిచేయవలెను?'

శ్రీకృష్ణుఁడిట్లనెను:- 'ఇట్టి యనిష్ట సూచకములగు నపశకునములు కనఁబడినపుడు, అందఱమును గలిసి దాన, పుణ్య, వ్రతోపవాసాది శుభకర్మానుష్ఠాన మొనర్పవలయును. దేవతాపూజన మొనర్పవలయును. బ్రాహ్మణ సంతర్పణ మొనర్చవలయును. పవిత్ర మంత్రములను జపింపవలయును. ప్రభాస క్షేత్రమునకుఁ బోయి మనము ముందు సంకల్ప

పూర్వకముగ స్నానమొనర్పవలయును. తీర్థమునకుం బోయిన దినమున నుపవాస ముండవలయును. అట్లే ఉపవాసముండం గలము. తీర్థ దేవతలను బూజించెదము. మఱునాండు మరల తీర్థస్నానముచే శుద్ధులమై ఆవాహన, ఆసన, పాద్య, అర్ఘ్య, ఆచమన, స్నాన, యజ్ఞోపవీత, వస్త్ర, ఆభూషణ, చందన, ధూప, దీప, సుగంధితద్రవ్య, పుష్ప, మాలా, నైవేద్యఫల, తాంబూల, పూగీఫల, శయ్యా, ప్రార్థనా, ప్రదక్షిణా, నమస్కార, క్షమాపణాదులచే దేవతాపూజలొనర్చెదము. నానావిధములగు సుందర స్వాదిష్ట రసయుక్తములగు షడ్రస యుక్త పదార్థములను జేయించెదము. వానితో బ్రాహ్మణు లకు దృప్తిగా భోజనమును బెట్టెదము. వారికి విధ్యుక్తముగ సువర్ణ, గో, వస్త్రాభూషణ ప్రియపదార్థములను, హస్త్యశ్వ, రథ, భూ, గృహోపవనాది దానము లొసంగెదము, వారి పాదములమీఁదఁబడి వారిచేనాశీర్వచనములను బొందెదము, ఇట్టి కార్యములచే. రోగశోకాద్యరిష్టములు శాంతింపఁగలవు. ఈ మంగళమయ కార్యములచే నాంతరంగిక శాంతి కలుగఁ గలదు. ధర్మము, గో, బ్రాహ్మణుల వలననే నిలుచును. బ్రాహ్మణగణము సదా ఉపదేశ మొనర్చుచుందురు. ఆ యుపదేశమువలన మానవుఁడు పశుత్వజడత్వములనుండి పైకి పోయి, పరమార్థ పథమునుగూర్చి ఆలోచించు చుండును. గోవులు శుద్ధములును బవిత్రములునగు క్షీరములనొసంగును.

వానివలన యజ్ఞయాగాదు లొనర్పవచ్చును. దాని వలన దేవతలును, పితరులును దృప్తి నొందెదరు. పరలోకము లభించును. జనులు భౌతికతను హేయముగ భావించి ఆధ్యాత్మికత వైపునకు బోఁగలరు. కావున కల్యాణమును గోరువారీ యిద్దరియెడల సదా ఆదరము కలిగి యుండవలయును. కావున క్షత్రియ రాజులు కానిండు, ఇతర రాజులు కానిండు, వారి రాజ్యమందీ యిద్దరిని వధింపరాదు. మ్లేచ్ఛరాజ్యములకీ నియమము లేదు. గో బ్రాహ్మణుల వధ యెచ్చట నుండునో అదియే మ్లేచ్ఛరాజ్యము. వీరిద్దరినిఁ బూజించుటయే ప్రాణుల జీవనమునకు పరమలాభము.

సూతుఁడిట్లనెను:- 'మునులారా! ఇది వినఁగానే సమస్త వృద్ధ యాదవులు సాధుసాధు అని పలికి భగవానుని వాక్యముల ననుమోదించిరి. సేనాపతుల కాజ్ఞయీయఁబడెను. ముందుగా స్త్రీలకు సవారీలేర్పాటు గావించి సముద్రమును దాటించిరి. సమస్త స్త్రీజనమును, బాలురను, వృద్ధులను దాటగనే వారిని రథములపైఁ గూర్చుండఁబెట్టి శంఖోద్ధారక తీర్థమునకుఁ బంపివైచిరి. తరువాత యువకులును, పెద్దవారును తమ తమ ఆయుధాదులను గైకొని సమస్త యుద్ధసామగ్రితో బయలు దేరిరి.'

శౌనకుఁడిట్లడిగెను:- 'సూతా! తీర్థయాత్రలకు అస్త్ర శస్త్రములతోఁ బోవలసిన పని యేమున్నది? అధార్మిక

రాశైనను దీర్ఘయాత్రికులమీఁద దాడిచేయఁడు. అట్టియెడ యాదవులు యుద్ధసామగ్రిని గొనిపోనేల?'

సూతుఁడిట్లనెను:-'స్వామీ! వినాశకాలమున విపరీత బుద్ధులు పుట్టును. వారు పరస్పరము కొట్టుకొని చావవలసి యున్నది కావున నందఱకు నిట్టి బుద్ధి పుట్టెను. అందఱును మిక్కిలి యుత్సాహముతో సముద్రమును దాటిరి. అంత తమతమ వాహనముల నెక్కిరి. యువకుల రక్తమందు చంచలత యుండును. అందువలన వారు పందెములు వేసి కొని గుఱ్ఱములను బరుగెత్తించుచుండిరి. ఒకరికంటె నొకరు ముందు పోవలయునను బందెములు పడెను. అందువలన వారు ప్రభాసక్షేత్రమునకతిశీఘ్రముగఁ జేరుకొనిరి. అచ్చటికి జేరి అందఱును దమ తమ గుడారములను నిర్మించుకొనిరి. యాదవులందఱును సముద్ర తీరమునకుఁ జేరుకొనిరి. భగ వానుఁడు తన బంధువులతోడను, బాంధవులతోడను దీర్ఘ యాత్రకు వచ్చినాఁడని అందఱును దెలిసికొని పరమ ప్రము దితులైరి. భగవదాజ్ఞచే నందఱును నాదినమున నుపవాస ముండిరి.'

మఱునాఁడు గొప్పగొప్ప వేదజ్ఞులగు బ్రాహ్మణులను బిలిపించిరి. గొప్ప గొప్ప మూఁపురములు కలిగి, హృష్టపుష్టములైయుండి బాగుగాఁ జాల నొసంగు నావులను దెప్పించిరి. వానిని బ్రాహ్మణులచేఁ బూజింపఁ జేసిరి. వాని

శృంగములకు బంగారు తొడుపులను వేయించిరి. గిట్టలకు వెండి తొడుపులను దొడిగిరి. తోఁకలకు ముత్యముల పేరులను వ్రేలాడఁగట్టిరి. వాని వీఁపుల మీఁద దుశ్శాలువలు కప్పఁబడెను. కంచుపాత్రలను పాలుపిండుట కేర్పఱచిరి. ఇంకను ననేక వస్తువులును నచ్చట నుండెను. అట్టి గోవుల నసంఖ్యాకములుగ దానమొనర్చిరి. రత్నములను బంచి పెట్టిరి. అచ్చటనుండిన బ్రాహ్మణులందరకును షడ్రసోపేతములగు బదార్థములతో భోజనము నొసంగిరి. వారికి మణిమాణిక్య రత్నభూషణాదులను, సువర్ణమును, వాహనములను నొసంగిరి. ఈ విధముగ యథేష్టముగ దానము లొసంగఁబడెను.'

బ్రాహ్మణులు తుష్టిగ భోజనము చేసిన తరువాత భోజనములు చేయవచ్చునని యాదవుల కాజ్ఞ నొసంగిరి.

ఇదివిని అందఱును భోజనమొనర్చుటకు నిశ్చయించుకొనిరి. క్రిందటి దినమున నుపవాసముగుటచే నందఱకును దెల్లవారకముందే ఆఁకలి వైచెను. అందఱును మిక్కిలి ప్రేమతోఁగలిసికొని కడుపులునిండ భోజనమొనర్చిరి. అధిక భోజనమొనర్చుటచే నింద్రియములకుఁ జంచలత కలిగెను. వారిలోఁ జాలమందికి సురాపాన వ్యసనము కలదు. మానవులకు ధర్మబంధనము శిథిలముకాఁగాను తన కిష్టమువచ్చినట్లు చేయనారంభించుచుండును. స్త్రీ పరపురుషుల నేల గాంచదు!

కాంక్షింపదు ? ధర్మ బంధనమునకు గట్టుపడియే కదా ! పురుషుఁడు పరస్త్రీలవైపేల కుదృష్టితోఁ గాంచఁడు? ధర్మ మట్లు చెప్పుచున్నది కాబట్టియే. ఇతరుల తోఁబుట్టువులును, కూఁతుండ్రవంటివారే. పరస్త్రీ తల్లివంటిది. ఎవరి ధర్మ బంధనము శిథిలమగునో, వారు పాప ప్రవృత్తులయ్యెదరు. సురాపానము వలన ధర్మబంధనము శిథిలమైతీరును. సురా పానమొనర్చు వాఁడెంతటి గొప్ప విజ్ఞానియు, విచారశీలుఁ డైనను సదసద్వివేకమును గోల్పోవును. వ్యసనముకలవాఁడు తన వ్యసనమే సర్వశ్రేష్ఠమగు సుఖమని భావించును. యాదవు లింతఱకును ధార్మిక విధులను నెఱవేర్చవలసి యుండెను. అందువలన వారి వృత్తులన్నియును నచ్చటనే లగ్నమై యుండెను. ఇప్పుడు వారు భోజనమొనర్చి నిశ్చింతులు కాఁగానే, వారికి వారి వ్యసనములు జ్ఞాపకము నకువచ్చెను. ఏకాంత స్థలము, సముద్రతీరము. యాదవ యువకులందఱును నొక్క స్థానమునఁ గూర్చుండిరి.'

వారిలో నొకఁడిట్లనెను :- 'ఓయీ! పూజా పారాయణములై పోయినవి. ఇప్పుడు శక్తిని గూడ ఉపాసింప వలయును.'

ఇంకొకఁ డిట్లనెను :- 'శక్త్యుపాసన మేమి?'

ఆతఁడు నవ్వి యిట్లనెను :- 'ఓయీ! నీవు వట్టి అమాయకుఁడవుగ నున్నావే. కొంచెముగ నర్థము చేసికొన

వలయును. సురాభవానిని సేవింపకుండిన శక్తి సంచారము కలుగదు. మనస్సునకు సంతోష ముండదు.'

అంత నొక్కఁడు కసరుచు నిట్లనెను:— 'ఓరీ! ఏమి మాటలాడుచున్నావు? ఎచ్చటనైనను దీర్థస్థలమందు సురాపాన మొనరించెదరటరా? అన్యక్షేత్రములందలి పాపములు తీర్థక్షేత్రములలో నశించును. తీర్థక్షేత్రములందు జేసిన పాపము వజ్రలేపమై అంటుకొనియే యుండును.'

అంత నొక యువకుఁ డుత్తేజితుఁడై యిట్లనెను: — 'తీర్థ మెచ్చటలేదు. ద్వారక తీర్థము కాదా? తీర్థకృత్యము లన్నియును సమాప్తములైనవి. ఇఁక నిష్పూ డానందానుభవము కలదు. శక్తి లేక ఆనందముండదు.'

సూతుఁడిట్లనెను :— 'మునులారా! యాదవులకు బ్రాహ్మణశాప మిదివఱకే కలదు. అందు వలన వారెవరును గాదనలేదు. వారు తమ వెంట, మిక్కిలి మాదకమును నుత్తేజకమును నగు మైరేయమను వారుణినిఁ గొనివచ్చిరి. ఆకలశము మధ్యనుంచుకొని అందఱును బంగారుదొప్పలతోఁ గడుపునిండ వారుణినిఁ ద్రావ నారంభించిరి. ఇప్పు డందఱి యొక్క సంయమము శిథిలమయ్యెను. అందఱును దమకిష్టము వచ్చినట్లు సురాపాన మొనర్చిరి. దీని వలనఁ గలిగిన బరిణామ మేమియో నేను దానిని వర్ణించెదను. సావధానులరై వినుఁడు.'

దేచ్ఛ చేతనే పుట్టుచుండురు. అట్లే గిట్టుచుండురు. అవశ్యము జరుగు దానినిఁ గూర్చి చింతించిన లాభ మేమున్నది? నీ శోకము వలనను, నీ చింత వలనను గాఁదగిన దేదియును లేదు. జరుగనున్నది జరిగియే తీరును. విస్మయమును జెందుట యును, నాశ్చర్యమును జెందుటయును వ్యర్థము. మాయలో నసంభవమనునది లేదు. సన్నావగింజకంటెను నతి సూక్ష్మ మగు వటబీజమువలన నెంతటి విశాల వటవృక్షము వచ్చు చున్నదో చూడుఁడు. అంతటి సూక్ష్మబీజమునం దెంతో విశాలవృక్షము దాగియున్నది. ఇది సామాన్యపు టాశ్చ ర్యమా ? ఒక సూక్ష్మమగు వీర్యకణముచే నెంతో జవ సత్వముల కలిగిన విశాలమగు గజముత్పన్న మగుచున్నది. అది అత్యంత విస్మయోత్పాదకమగు వస్తువు కాదా ? భగ వానుని మాయయందు సమస్తాశ్చర్య జనకమగు వ్యాపార మిమిడియున్నది. మాయలో నన్నియును సంభవములే. నీ వాశ్చర్యమును జెంది యేమి చేయఁగలవు ?'

ఇంక నిప్పుడు సాధన, భజనము లన్నియును, బురుష ప్రయత్నమును వ్యర్థమని నీ వనవచ్చును. జరుగవలసిన దేమియో జరిగినచో మనము సాధన భజనము లన్నియును జేయవలసిన పనియే మున్నది ? చేతులు నలుపుకొనుచుఁ గూర్చుండవచ్చును. దీనికి బ్రత్యుత్తరమును నే నిదివఱకే యిచ్చియుంటిని. ప్రాణులేవియును జేయకుండ నుండఁజాలరు. కర్మలను వివశులై చేయవలసి వచ్చును.'

అందఱును కర్మలొనర్చుటకు వివశులైనచో జ్ఞానికి నజ్ఞానికి భేదమేమున్నది ? ఒకఁడు గడ్డికోసికొని అమ్ముకొని బ్రదుకును. ఇంకొకఁడు బుద్ధిద్వారా అందఱను శాసించుచు జీవించును. ఇద్దరును కర్మలొనర్చుటకు వివశులైయున్నారు. ఇద్దరు నొక్కటిగనే యున్నారు. అట్టియెడ జ్ఞానిని ప్రశంసించుట యెందులకు, అజ్ఞానిని నిందించు టెందులకు ? పని యిద్దరకును నొక్క విధముగనే యున్నది.' ఇప్పుడందఱపని ఒక్కటే యనునది సత్యమే. బుద్ధి జీవియగు శాసకుఁడును, లేఖకుఁడును నజ్ఞాని కావచ్చును. శ్రమజీవియగు సాధారణముగ గడ్డినిఁ గోసికొనువాఁడు బ్రహ్మజ్ఞాని కావచ్చును. పనులను బట్టి జ్ఞానియనియును, నజ్ఞాని యనియును నిర్ణయించుటకు వీలులేదు, జరుగునది యంతయును ప్రభు ప్రేరణముచే జరుగుచున్నదను కొనువాఁడు జ్ఞాని. తాను జేయుటచేతనే యిదియంతయును జరుగుచున్న దనుకొనువాఁ డజ్ఞాని. సమస్త సాధనలు, పురుషార్థముల ఫలము సమస్త సంఘటనముల యందును సమభావము కలిగి యుండ వలయును. యదుకుల సంహారము వలన భగవంతుఁడు సమస్తా వస్థలయందు నను సమభావ ముంచవలయును. శిక్షణ నొసంగెఁనాఁడు. జరుగవలసిన దేమియో జరిగితీరును.

సూతుఁడిట్లనెను:-'మునులారా ! ప్రభాసక్షేత్రమున యాదవులందఱును మైరేయమను నొక సురస మాదక ద్రవ్య

మును ద్రావి మదోన్మత్తులైరి. యువకుల రక్తమునందు స్వాభావికముగ నున్నతయుండును. పైఁగా యథేష్టముగ సురాపానమును గావించి యుండిరి. అసలే క్రోఁతి అతి చంచలమైనది. దానికిఁ దేలుకుట్టినది. అది సురను ద్రావినదిఁ దయ్యముకూడ పట్టినది. ఇఁక దాని చంచలత యెట్లుండునో, ఈ యుద్ధతగల యువక యాదవుల యుద్ధత పరాకాష్ఠనందు కొనినది. మదిరాపానముచే నందఱ నేత్రము లెఱ్ఱనయ్యెను. మదిరోన్మాదమున నొకరి నొకరు తిట్టుకొనుచుండిరి. అంత నింకొకఁడు కోపముతో నిట్లనెను:-'ఓయీ! నీవు ధనికుఁడవైనచో మీయింటికే ధనకుఁడవయ్యెదవు. కొంచెము జాగ్రత్తగా మాటలాడుము.'

ఆతఁడు గర్జించి యిట్లనెను:- 'ఓయీ! నే నింతవఱకెవరి ఋణమునకు బోలేదు. నాకెవ్వరి భయమును లేదు. నీవే శూరవీరుఁడవను కొనుచున్నావు. నీవు మగవాఁడవై నీలో సామర్థ్యముండినచో రారమ్ము. తలబడెదము.'

రెండవవాడు ఖడ్గమును దూసి యిట్లనెను:-'నేనుతగ్గి పోవువాఁడనుగాను. రమ్ము. సిద్ధముగ నున్నాను.'

ఇట్లు పలుకుచు నాతనిపై విఱుచుకొని పడెను. కొంచెముగ నటు నిటు బెనుగులాడిరి. ఇఁక సంగ్రామము సాగినది. అందఱును ధనుస్సులపై బాణముల నెక్కుపెట్టి పరస్పరము కొట్టుకొన నారంభించిరి. వారందఱును భగవన్మాయా

మోహితులైరి. అందఱును సురామదమునఁ దమ్ముఁదామే మఱచిరి. అందఱును దమ తమ యస్త్ర శస్త్రములను సవరించుకొని రథములకు గుఱ్ఱములను బూన్చి తరలించిరి. ముడిచిన పతాకములను విడదీసిరి. అవి ఆకాశమున వాయువుచేఁ గదలుచుండెను. అందఱియొక్క ధ్వజ చిహ్నములు స్పష్టముగఁ గనఁబడు చుండెను. ధనుర్బాణ, ఖడ్గ, తోమర, శూల, గదా, ఋష్ట్యాద్యాయుధములను, అస్త్ర శస్త్రములను గైకొని, అందఱును యుద్ధభూమికి వెడలిరి. ఇప్పుడు యుద్ధమునకు నియమమేమియును లేకుండెను. ఎవరికే పక్షమిష్టముగ నుండిన వారా పక్షమునకు జేరుకొనిరి. వారందఱును బంధువులే. వారి అస్త్రశస్త్రములన్నియును గుఱ్ఱములు, రథములు, కంచర గాడిదలు, ఎద్దుల మీఁద వేయఁబడి యుండెను. వారందఱును సుసజ్జితులై వనములలో మదపుటేనుఁగులు పరస్పరము తలపడి పోరాడుకొనునట్లు పోరాడుకొనుచుండిరి. వారందఱును సంబంధులైనను వారి బుద్ధి భ్రష్టమగుటచేఁ బ్రారబ్ధవశమునఁ బరస్పరము ఆఁబోతులవలె శత్రువులతోఁ బోరాడినట్లు పోరాడుకొను చుండిరి. ప్రద్యుమ్నుడు తన సోదరుఁడగు సాంబునితోడను, అక్రూరుఁడు భోజునితోడను, అనిరుద్ధుఁడు సాత్యకితోడను, సుభద్రుఁడు తన పిన తండ్రియగు సంగ్రామజిత్తుని తోడను పోరాడుచుండిరి. ఇద్దరును గదలను దీసికొని సుమిత్ర,

సురథులు పోరాడుచుండిరి. ఆ సమయమున భగవన్మాయ వలన నందఱును నంధప్రాయులైరి. వారందఱును దమ సంబంధులని యెవరికినిఁ దెలియుట లేదు. నిశఠ, ఉల్ముక, శతజిత్, సహస్రజిత్, భాను మొదలగువారు బావలు బావమఱఁదులును, సంబంధులును బోరాడ నారంభించిరి. అన్నదమ్ములిద్దరును నొకరిమీఁదనొకరు పరశువులను విసురుచుండిరి. తండ్రి కొడుకును జంపుచుండెను. పుత్రుఁడు తండ్రిని మర్దించుచుండెను. మామ అల్లునిఁ జంపుచుండెను. అల్లుఁడు మామను గొట్టుచుండెను. మనుమఁడు తాతను మర్దించుచుండెను. తాత తన సంబంధమును మఱచి, ప్రేమనువీడి వానిని వధించుట కుద్యమించుచుండెను. పిన తండ్రి అన్న కొడుకు మీఁద బాణములవర్షమును గురిపించుచుండెను. కొడుకు పినతండ్రిని యమలోకమునకుఁ బంపుచుండెను. సారాంశమేమనఁగా నిందులో నెవరును నెవరిని గూర్చియు సందేహించుట లేదు. అందఱును నుద్దండులైరి. దాశార్హ, వృష్ణి, అంధక, కుకుర, భోజ, సాత్వత, మధు, అర్బుద, మాధుర, శూరసేన, విసర్జన, కుంతిభోజాది యాదవ కులములందెవరును బోరాడనివారు లేరు. ఆ సమయమున నందఱును సంగ్రామమొనర్చుటయే శ్రేయస్సుగ భావించిరి. మిత్రులు పరస్పరము పోరాడుచుండిరి. బంధువులు బంధువులతోఁ బోరాడుచుండిరి. ఏక గోత్రీకులు పరస్పరము

నణకుకొనుచుండిరి. యుద్ధము ఘోరమై యెవ్వరును నాపుటకు వీలులేకుండునట్లుండెను. అందఱకడ నుండిన బాణము లన్నియును సమాప్త మగునంతవఱకు పోరాడిరి. ధనుస్సులు విఱిగిపోయెను. ఇతర అస్త్రశస్త్రములన్నియును నేఁడు మోఘములయ్యెను. ఇంత జరుగుచుండినను నెవ్వారికిని క్రోధము తీర లేదు సరికదా యింకను బెరుగుచుండెను.'

అస్త్రశస్త్రము లన్నియును సమాప్తము కాఁగానే వారు యుద్ధమొనర్చుటకై అన్యవస్తువుల నన్వేషింప నారంభించిరి. ఎదుట సముద్రపుటొడ్డుననే వారికి రెల్లు పొదలు దట్టముగ నుండుటను గాంచిరి. అప్పుడు వారందఱును వానిపైఁబడి పెరికి వానితోఁ బోరాడ నారంభించిరి.

అంత శౌనకుఁడిట్లడిగెను:– 'సూతా! శరపత్రములు అనఁగా రెల్లు పోచలు చాల తీక్ష్ణముగ నుండును. వానిని లాగిన వ్రేళ్ళు తెగిపోవును. రక్తము కారును. కాని వానితో యుద్ధము చేసికొందురనుట వలన మాకేమియును నర్థమగుట లేదు. యుద్ధమందలి అస్త్రశస్త్రములవలెఁ బనిచేయు నా శరపత్రము లెట్టివి?'

సూతుఁడిట్లనెను :– 'స్వామీ! ఎవరి కెవరివలన మృత్యువు వ్రాయబడియున్నదో, అది సాధారణమైనదైనను వజ్రము కాఁగలదు. ఎవరి కెవరివలననైన మృత్యువు లేకున్నచో నది వజ్రమైనను గుంఠితమగును. వజ్రమాతని

నేమియును జేయఁజాలదు. దేవేంద్రుని వజ్రము మోఘము. దానిచే నాతఁడు నముచినిఁ గొట్టెను. కాని ఆతఁడు చావ లేదు. కాని ఆతఁడు సముద్రపు నురుగును వజ్రముగ నొనర్పఁగా నాతఁడు చచ్చెను. పరమ కఠినమగు నీ వజ్ర మెక్కడ. పరమ మృదులమగు నా ఫేన మెక్కడ? మృత్యువు యోగము కొఱకు చూచుచుండును. యాదవులు కైకొని పోరాడు రెల్లు సాధారణపు రెల్లు కాదు. సాంబుని యుదరము నుండి బ్రాహ్మణశాపమునఁ బుట్టిన కులశాపమునకు సంబం ధించిన ముసలమును చాదిచాది ఉగ్రసేనుని ఆజ్ఞ వలన యాదవులు సముద్రమునఁ గలిపిరి. ఆలోహచూర్ణము నీటిలో నుండలేదు. నీటిమీఁదఁ దేలుచుఁ దేలుచు సముద్రపు టల లచే నది కొట్టుకొనివచ్చి ప్రభాసక్షేత్రముకడకువచ్చి చేరెను. ఆ లోహచూర్ణమువలన నసంఖ్యాకములగు రెల్లుపొద లుద్భ వించెను. అవి యదువంశ వినాశముకొఱకే యేర్పడినవి. వానిని యాదవులు పెరికి చేతులలోనికిఁ బట్టుకొనునప్పటికవి వజ్రసదృశము లయ్యెను. వానిచే నెవఁడు దెబ్బ తినునో ఆతఁడు క్రిందఁబడి చచ్చుచుండెను. ఇంతవఱకును శ్రీకృష్ణ బలరాములు తటస్థభావమునఁ జూచుచుండిరి. ఇప్పుడు లక్షల కొలఁది వీరులుచచ్చి నేలపై బడుటను గాంచఁగనే వారు మధ్యకువచ్చి నిలిచి యిట్లనిరి:—'ఓయీ! మీరు చేయుచున్న దేమి? మీజ్ఞాతులనే చంపుచున్నారు'

సూతుఁడిట్లనెను:- 'మునులారా! వారి బుద్ధి యంత యును విపరీతమైనది. వారి శిరస్సులపై మృత్యువు తాండవ మాడుచుండెను. వారందఱును మృత్యుముఖమునఁ బ్రవే శించుటకు సిద్ధముగ నుండిరి. శ్రీకృష్ణబలరాములు తమ శత్రుపక్షమును వహించినారని వారనుకొనుచుండిరి. వారిని గూడ తమశత్రువులుగ భావించుచుండిరి. అట్లనుకొని అంద ఱును వారినిగూడ కొట్టుటకు బరువిడిరి. ఎవరినిఁ బుట్టించి, పోషించి, వడిలోఁ బెట్టుకొని పెంచి పెద్దవారినిగా నొనర్చి తిమో, వారలే క్రుద్ధులై మనలనుగూడ చంప నుద్యుక్తు లైనారని తెలిసికొనఁగానే శ్రీకృష్ణబలరాములకును క్రోధము కలిగెను. క్రోధము వచ్చుటేమి! వారిద్దరీశ్వరులు కదా! వారే కర్తలు, భర్తలు, సంహర్తలు. అయినను లోకము కొఱకు, బ్రాహ్మణశాపమును సఫలమొనర్చుటకై, తామును యదువంశీయుల మనునది ఋజువుచేయుటకై, వారును రెల్లు దుబ్బులను బెఱికి యుద్ధమొనర్ప సాగిరి. తమ పుత్రులను, పౌత్రులను, ప్రపౌత్రులను, బంధువులను సంహార మొన ర్చుచు సమరభూమియందు విచరించుచుండిరి. రక్షకుఁడే భక్షకుఁడైనప్పుడు వారిని రక్షింపఁ గలవారెవ రుందురు. వనములలో నగ్ని వెదురుపొద రాపిడిచే నుత్పన్నమై వనమూ నంతను దగులఁ బెట్టును. అదేవిధమున యదువంశమున విద్వేషాగ్ని ప్రజ్వలించి సమస్త యాదవ కులమును నశింపఁ

జేసెను. యదుకులమున నింకెవఁడును మిగులలేదు. కేవలము శంఖోద్ధారక తీర్థమునకుఁ బోయిన బాలకులు మాత్రము మిగిలిరి.

అందఱును మరణింపఁగనే భగవానునకు జాల యానందము కలిగెను. అతఁడిట్లనుకొనెను :- 'నేను భూభారమును హరించుటకై భూమిపై నవతరించితిని. భారతయుద్ధమును జేయించి చాలవఱకు భూభారమును హరించితిని. ఇంకను మిగిలియున్న భారము యాదవ సంహారముతోఁ బూర్తియైనది. నే నీ యాదవుల నందఱను వదలి యీ ధరాధామమును వదలిపోయి యుండినచోఁ బృథివీ భారము తగ్గెడిది కాదు. నా యంశముచే నుద్భవించిన నీ యాదవు లింకెవరిచేతను జావరు. వారు ప్రజలకు నానాక్లేశములను గలిగించెడు వారే. ఇంక నాకింకఁ బనిలేదు. ఇప్పుడు నేనును నీభూమిని విడిచిపోవలయును.' అని యాలోచించుకొని అతఁడు సముద్రము వైపునకు బయలుదేరెను.

సంకర్షణావతారుఁడగు బలరాముఁడు తన స్వామియొక్క హృద్గతభావమును గ్రహించి, భగవానుఁడీ ధరాధామమునుఁ బరిత్యాగ మొనర్చుటకు పూర్వమే అతఁడు తన శుద్ధస్వరూపమున నుండుటకు నిశ్చయించుకొనెను. అతఁడు సముద్రతీరమున నొక గుహలోఁ గూర్చుండి యుండెను. కొలఁది క్షణములలోనే అతని మానవ శరీర మంతర్ధాన

మయ్యెను. వెంటనే ఒక గొప్ప సర్పాకారమును జెందెను. భగవానుఁడా మహాకాయుఁడగు ఫణీంద్రుని దర్శించెను. ఆ సమయమున నచ్చట యింకెవరును లేరు. కొట్టుకొని వచ్చిన యాదవుల తలలును, చేతులును, మొండెములు మాత్రముండెను. పరాత్పరుఁడగు ప్రభువునకు హర్షశోకము లుండవు. అందువలన నాతనికి హర్షశోకములు రెండును లేకుండెను. ఆతఁడెప్పటి యట్ల స్వస్థుఁడుగను, శాంతుఁడు గను నుండెను.

సూతుఁ డిట్లనెను:- 'మునులారా! తన యన్న అదృశ్యుడైనాఁడని తెలిసికొని, తానును స్వధామగమన మొనర్పవలయునని ఆతఁడుగు నిశ్చయించుకొనెను. ఆతఁడు సముద్రతటమున నొక పరమ దివ్య అశ్వత్థవృక్షము క్రింద దేదీప్యముగఁ జతుర్భుజరూపమును ధరించి, తన ప్రభా కాంతులచే దశదిశల దేదీప్యమాన మొనర్చుచు, నిర్ధూ మాగ్నివలె సుశోభితుఁడై యుండెను. అశ్వత్థవృక్షము నాను కొని, ఒక కాలిమీఁద నింకొక కాలిమంచి సుఖముగఁ గూర్చుండెను. ఇప్పుడు భగవానుఁ డేవిధముగ స్వధామము నకుఁ బోవుటకు నిమిత్తములు కావించెనో, ఆపుణ్యప్రసంగ మును ముందు చెప్పఁబోవు చున్నాను.

# భగవానుని స్వధామ గమన నిమిత్తములు.

శ్లో॥ యస్యాత్మయోగ రచితం న విదుర్విరించో
రుద్రాదయోఽస్య తనయాః పతయో గిరాంయే।
త్వన్మాయయా పిహిత దృష్టయ ఏతదంజః
కిం తస్య తే వయమసద్గతయో గృణీమః॥

—శ్రీభాగ. ౧౧ స్కం. ౩౦ అ. ౩౮ శ్లో॥

వ. హరిణమను భ్రమచే భగవానుని పాదపద్మములందు బాణము గ్రుచ్చుకొనఁగానే వ్యాధుఁ డిట్లనెను :– 'స్వామీ! ఏ మీ యాత్మ యోగ ప్రపంచమును బ్రహ్మయును, అతనిపుత్రుఁడగు రుద్రాదులును దెలిసికొనఁజాలరో, వారియొక్క దృష్టియును నీ మాయచేఁ గప్పఁబడియున్నది. స్వాభావికముగఁ గ్రూరుఁడను, నీచుఁడనగు నేనెట్లు నీమాయను దెలిసికొనఁగలుగుదును?'

—శ్రీమదాంధ్ర భాగవతము.

సమస్తకార్యములకును నేదియో నిమిత్తముండును. నిమిత్తములేనిది కార్యమేమియును జరుగదు. జరుగవలసిన దేమియో జరిగితీరును. దాని కేదియో నిమిత్తముండి తీరును. అందువలననే శ్రీకృష్ణుఁ డర్జునునితో నిట్లనెను:– 'అర్జునా! నీవు కాంచు భీష్మ ద్రోణ, శల్యాది మహావీరులు బ్రదికియుందురని తలఁపకుము. నే నెప్పుడు సంకల్పించితినో అప్పుడే వారు చచ్చిరి. ఇప్పుడు కేవలము వారిని మృత్యుముఖమునఁ

బడవేయుటయే శేషించి యున్నది. దానికి నీవు కేవలము నిమిత్తమాత్రుఁడవు కమ్ము. వీరిని నీవు చంపకుండినను వారు చచ్చి తీరెదరు. వీరి మృత్యువవశ్యంభావియై యున్నది. అనాయాసముగఁ బ్రాప్తించు సుయశము నేల జారవిడిచెదవు? నీవు నిరాకరించుట వ్యర్థము. ఏలననఁగా వీరి మృత్యువునకు నిమిత్తము నీవు కాఁగలవు. ఇది యిది వఱకే నిశ్చితమై యున్నది. పుట్టుటకు ముందే మృత్యు విధాన మేర్పడును. దాని నిమిత్తమును నిర్ణయము కాఁగలదు. జ్యోతిర్విదులైనవారు ఫలాని నిమిత్తమున మరణము సంభవించునని చెప్పఁగలరు. నిందె లేనిది బొంది పోఁగూడదని మృత్యువునకు బ్రహ్మవరదానము కలదు. కావున నేదియో కారణ మేర్పడుఁను. ఆ మృత్యువు చాటున నుండియే పొంచి వేటాడును. అందువలన దాని నెవరును నిందింపరు. గుర్తింపరు. నిమిత్తము లన్నిటిని దోషముగ భావించెదరు. భగవానుఁడు భూమిపై నవతరించునపుడు, శరీరధారణ మొనర్చునపుడు సమస్త కార్యములకును నేదియో నిమిత్తమును గావించును. ఏది జరిగినను నాతని యిచ్ఛచేతనే జరుగును.

సూతుఁ డిట్లనెను:–'మునులారా! భూమి భారమణఁగినదనియును, సహింపరాని బలపరాక్రమములు కల యాదవులును జచ్చిరనియును, దనకింక నీ భూమిపై నేకార్య

మును శేషించి లేదనియును, దన కంశభూతుఁడగు బల రాముఁడును దన నరశరీరమును వీడి స్వస్వరూపమునం దున్నాఁడనియును దెలిసికొని, తానును స్వధామగమన మొనర్పవలయునని నిశ్చయించుకొనెను. తాను గన్నవారంద ఱును జచ్చిరి. ఒకచోట శిరస్సులు మొండెమునుండి వేఱై నను గొట్టుకొనుచుండెను. కొందఱకుఁ జేతులు తెగినవి. కొందఱ గ్రీవులు బయటకు వచ్చినవి. కొందఱ శరీరము తెగినను గర్జించుచుండిరి. ఈ విధముగ నుండిన మృత కళేబరములను దాటుచు, నవ్వుకొనుచు శ్యామసుందరుఁ డొక సుందర అశ్వత్థవృక్షము క్రిందకువచ్చెను. అశ్వత్థ మాతని స్వరూపమే కదా! కావున నా యశ్వత్థముయొక్క సుందర శీతల ఛాయలోనికి వచ్చి కూర్చుండెను. ఆతఁడు లీలా సంవరణ మొనర్పవలయునను దృఢ సంకల్పముతో నుండెను. ఏ విధముగ నాతఁడు శాంత, ఏకాంతమగు గారా గృహమునం దొంటరిగ నావిర్భవించెనో, అదే విధముగ నేఁడు శాంత, ఏకాంతస్థానమందు దిరోహితలీలను గూడ సంపన్న మొనర్పఁదలఁచుచున్నాఁడు. ఏలననఁగా నాతఁడ పరోక్షప్రియుఁడు. రహస్యవాద మాతని కత్యంత ప్రియ మైనది. అన్ని కార్యములను నాతఁడందఱును జూచుచుండఁగ నందఱ సమ్ముఖమున నొనర్చెను. కాని ఆవిర్భావ తిరో భావలీలల నాతఁడందఱ ముందఱ నొనర్పలేదు. జీవుల

కావిర్భావ తిరోభావముల మర్మము తెలిసియుండినచో, వారెనుబదినాలుగు లక్షల జన్మపరంపరా చక్రమునఁ బడ వలసిన పనియేమున్నది? విముక్తుఁడై యుండెడు వాఁడే. భగవానుఁ డెప్పుడును నేకరసుఁడు. కాని లీలానురూపముగ నాతఁడొకొక్కప్పుడు క్రోధ, వ్యగ్రతా, చింతా, శోకాది భావములను వ్యక్తమొనర్చుచుండును. ఈ భావములన్ని యును గృత్రిమములైన లోకవత్సాత్యములుగ దృష్టిగోచ రము లగుచుండును.

నేఁడు భగవానుని ముఖమండలము పరమ గంభీ రముగ నుండెను. దానిలో మందహాస సుఖమయ కిరణములు ప్రసరించుచుండెను. నేఁడాతఁడు దివ్య చతుర్భుజరూపమును ధరించి యుండెను. భువన మోహనమగు సరస కాంతులచే దశదిశలను బ్రకాశింపఁజేయుచుండెను. ఆతఁడు జాజ్వల్య మానమై ధూమ్రహీనమగు నగ్నివలె శోభించుచుండెను. ఆ సమయమున నాతని శోభ అనిర్వచనీయముగ నుండెను. ఆతఁడు రావిచెట్టునానుకొని యే యాసనమును లేకయే నేల మీఁదఁ గూర్చుండి యుండెను. ఆతని ముఖాంబుజశ్రీ అత్యంత గంభీరముగను, తేజఃపూర్ణముగను నుండెను. వాగ్వ్యాపారము నాపి, మౌనియై స్వస్థచిత్తముతో నుండెను. ఆతని దివ్యమంగళమయ శ్రీవిగ్రహ స్వరూపము వికసించిన నతసీ కుసుమమువలెను, దూర్వాంకురఛాయను, జలధరము

వలెను, మయూర కంఠము వలెను, నీల సహస్ర దళ కమలమువలె శ్యామ వర్ణముగ నుండెను. వక్షఃస్థలమందు శ్రీవత్సచిహ్నము సుశోభితమై యుండెను. తప్త సువర్ణము వలె నుండు రెండు వస్త్రములను ధరించుచుండెను. ఒక దానిని ధరించి, మఱియొకదానిని పైన నుత్తరీయమును వేసికొనియుండెను. ఆ వస్త్రములకు వెడల్పాటి జరీ అంచులు పనితనము చేయఁబడియుండెను. వాయువేగమున నా వస్త్రములుకదులుచుండ మెఱుఁగు దీఁగలచే ప్రకాశించు ఘన నీలమేఘమువలె నుండెను. సువర్ణ కిరీటములోనుండి వచ్చిన అలినీలాలకములు వాయుప్రసారముచేఁ గదులుచు ముఖ మార్జనమొనర్చుచున్నట్లుండెను. విశాల ఫాలమున దివ్య తిలకము శోభించుచుండెను. కర్ణములందు కమనీయ కుండలములు కదలుచుఁ గపోలముల నానుచుండెను. ఆతని నిద్దంపు చెక్కిళ్ళను మాటిమాటికానుచు వానిశోభ నినుమడించుచుండెను. ఉత్ఫుల్ల కమలములవలె నాతని దివ్య నేత్రద్వయమునుండి వెలువడు మధుమయ దృష్టులచే నచ్చటి వాతావరణమును సరసమొనరించుచుండెను. దొండపండుల వంటి మృదులాధరోష్ఠములనుండి మధుర మందహాసము వెలువడుచుండెను. గోళాకారములగు గపోలములుబ్బెత్తుగ నుండి కన్నులతో మేలమాడుచున్నట్లుండెను. మకరాకృత సువర్ణ రత్నమయ కుండలముల కాంతియును, గపోల శ్రీ

యును, నేత్రముల కాంతియును గలిసి ప్రభాసక్షేత్రమున త్రివేణీదృశ్యమును గలిగించుచున్నట్లుండెను. కంఠహారములు తళతళలాడుచుండెను. భుజముమీఁదనుండిన యజ్ఞోపవీతము శిథిలముగ నున్నట్లుండెను. విశాల భుజములందుండిన బాజుబందులు తమ గౌరవమును గదలుచు నిలువఁబెట్టుకొనుచుండెను. కరకంకణముల కాంతులు కరకమలముల కాంతులలోఁ గలిసి శోభించుచుండెను. అంగుళీయకముల కాంతులాతని కరనఖముల కాంతులలోఁ గలిసి నీలికాంతులతోనుండెను. వనమాల కౌస్తుభమణితో మేలమాడుచు వక్షఃస్థలమున కానుకొని తన స్నేహమును వ్యక్తమొనర్చుచుండెను నడుమునకు గల మొలత్రాడు తమ క్వణ క్వణ ధ్వనులచేఁ బ్రశాంతతను నప్పుడప్పుడు భంగమొనర్చుచుండెను. చరణ నూపురములు వాయువుతోఁ గలిసి, యొక అవ్యక్త స్వర తరంగమును సృష్టించుచుండెను. వనమాల వంకరగ నుండి ఆతని పాద స్పర్శను జేయఁదలఁచుచున్నట్లుండెను. అది కంఠమునుండి చరణముల వఱకంటుకొని యుండి స్పర్శసుఖ కారణమునఁ బులకించుచున్నట్లుండెను. నేఁడు భగవానునియొక్క శంఖ, చక్ర, గదా, పద్మాది దివ్యాయుధములు సజీవములై, మూర్తిమంతములై స్వామి సేవలోనుండెను. శ్యామసుందరుఁడు తన అరుణ కమల సదృశమై శోభాయమానముగనుండు తన వామచరణమును

దన కుడి మోఁకాలిమీఁదఁ బెట్టుకొని యుండెను. ఆ సమయమున శ్యామసుందరుని శోభ అకథనీయముగను, ననుపమానముగను నుండెను.

ఆ సమయమున సమీపమునఁగల సఘనవనమున వేఁటాడుటకై జరుఁడను వ్యాధుఁడు చరించుచుండెను. ఏ వటవృక్షముక్రింద శ్యామసుందరుఁడు కూర్చుండి యుండెనో, దాని కెదురుగా రమారమి అఱక్రోసు దూరమున నొక దట్టమైన వటవృక్షము కలదు. ఆ వటవృక్షము చాటున దాగిన నా వ్యాధుఁడు చంచల దృష్టులతో నలువైపులను జూచుచుండెను. అతఁడజాగ్రత్తగాఁ గూర్చుండిన నొక మృగముపైఁ దన బాణమును విడచుటకు సిద్ధముగనుండెను. అతనికి దూరమున నుండిన భగవానుని పాదము మృగము యొక్క ముఖమువలెఁ గనఁబడెను. అతని హర్షమునకు మేఱలేకుండెను. వృక్షము క్రింద మెరయుచుండు నిసుకలో మృగము కూర్చుండి నెమరువేయుచున్నట్లాతనికిఁ దోఁచెను. లక్ష్యమునుజూచి కొట్టుట అతనికిఁ బాగుగఁ దెలియును. భగవానుఁడు ముడుచుకొనిన పాదమునకు లక్ష్యమొనర్చి, అతఁడొక విషాక్త బాణమును విడిచెను. బాణము లక్ష్యమునకుఁబోయి తగిలెను. అతి సుకుమారమును, పరమ మృదులమును, యోగిజన పూజితమును, విశ్వవందితము నగు చరణారవిందమునకా బాణము తగిలెను. భగవానుని కొంత నెుప్పికలిగెను.

అంతశౌనకుఁడిట్లడిగెను:- 'సూతా! మహాభారత యుద్ధమందు మహారథులును, దిగ్విజయులగు వీరులును నిరంతరము బాణవర్షమును గురిపించినను నొప్పింపఁజాలకపోయిరే, అట్టియెడ భగవానుఁడు సాధారణుఁడగు వ్యాధుఁడు బాణముచేఁ గొట్టఁగా తన శ్రీవిగ్రహమును త్యజింపవలసి వచ్చినదే? దీని కారణమేమి?'

సూతుఁడిట్లనెను:- 'స్వామీ! ఇదంతయును భగవల్లీల. భగవానుఁడు భక్తవత్సలుఁడు కదా! ఆతఁడందఱి యొక్క మంచి, చెడ్డకోరికలనన్నిటిని నెఱవేర్చుచుండును. శూర్పణఖ కామేచ్ఛచే రామావతారమునఁ దన కడకు వచ్చెను. కృష్ణావతారమున నామె కుబ్జ కాఁగా నామె ననుగ్రహించినాఁడు. బలిచక్రవర్తి పుత్రిక పుత్రునకుఁ బాలొసఁగునట్లు పాలీయఁదలఁచెను. మఱుజన్మమున నామె పూతనయయ్యెను. భగవానుఁడామె స్తన్యమును గ్రోలి, ఆమెకు సద్గతినిఁ గలిగించెను. రామావతారమున భగవానుని చాఁకలివాఁడొకఁడు నిందించెను. వాని నీ జన్మమున వధించి, వానికి సద్గతిని గలిగించెను. ఇదే విధముగ నే భక్తుఁ డేవిధముగ భావించి భగవంతుని భజించునో, ఆతని కావిధముగనే వాని కోరికను బూర్తి కావించుచుండును. ఎవఁడైన శాపమొసఁగినచో దానినైనను సహర్షముగ స్వీకరించును.'

శౌనకుఁడిట్లడిగెను:- 'సూతా! భగవానుని చరణకమలమున బాణము వేయవలయునను భావమెవరికికలిగినది. భగవానునకు శాపము నెవఁడొసంగెను? దయతో మాకీ విషయమును జెప్పుము.'

సూతుఁ డిట్లనెను:- 'స్వామీ! దీనికొక కారణము కాదు. చాల కారణములు కలవు. వానిలోఁ గొన్ని కారణములనుగూర్చి నేను జెప్పెదను.'

## 1

గాంధారియొక్క నూర్గురు పుత్రులు చనిపోఁగాఁ గృష్ణుఁడామె నోదార్పఁ బోయెను. ఆమె పుత్రశోకమున వ్యాకులయై యుండెను. భగవానుఁ డెదుటనుండి నాఁడని భావించి ఆమెయిట్లనెను:- 'ఓ యదునందనా! నీవు సర్వసమర్థుఁడవై యుండియును మా వంశనాశము నాపక, కులసంహారమును గావింపఁజేసితివి. కావున మీ కులమును నిట్లే నాశనమగుగాక! యని నేను నీకు శాపమొసంగుచున్నాను. మా కులమంతయును బరస్పరము కొట్టుకొని యెట్లుచచ్చిరో, అట్లే మీకులమును బరస్పరము కొట్టుకొని చచ్చెదరుగాక! నీవును నిర్జనస్థానమున లీలాసంవరణ మొనర్చెదరుగాక! భగవానుఁడా శాపమును గ్రహించి, దానిని సత్యమొనర్చుటకై యీలీలను రచించెను.

## 2

ధర్మజ రాజసూయమున శ్రీకృష్ణుఁడు యజ్ఞమునకు వచ్చిన విప్రులందఱ చరణములను ప్రక్షాళన మొనర్చు పనినిఁ బెట్టుకొనెను. మునులు గానిండు, బ్రాహ్మణులు కానిండు, ఎవరు వచ్చినను భగవానుఁడు వారి పాదములను గడుగు చుండెను. ఆ సమయమున దూర్వాసుఁ డచ్చటికి వచ్చెను. భగవానుఁ డాతని పాదములను గడిగెను కాని ఒకపాదము నకు బురద యంటుకొనెను. దానినిఁ గాంచఁగనే మునికి కోపమువచ్చెను. ఆతఁడిట్లు శపించెను:- ' నాకాలి కెచ్చట బురద యంటుకొనినదో, అచ్చట నీకు బాణము తగులుగాక! ఆమూలమున నీవు శరీరమును విడిచెదవుగాక!

## 3

భగవానుని పాదములందు కమలచిహ్నము కలదు. ఒకానొక ఋషి యీ చిహ్నముపై యెప్పుడు బాణము తగులునో అప్పుడు నీవు శరీరమును త్యజించెదవని శపించెను.

## 4

రామావతారమున భగవానుఁడు చెట్టుచాటునదాగి వాలినిఁ గొట్టెను. వ్యాధుఁడు మృగమును జంపినట్లు వానిని వధించెను. దానిని మరలఁదీర్చుకొనుటకై వాలియే జరుఁడను వ్యాధుఁడుగ జన్మించెను. ఆతఁడును మృగమనుకొని భగవా

ముని పాదములకుఁ గొట్టెను. అతఁడు చచ్చునపుడు రాముని మరలఁ గొట్టవలయునను వాసన యుండెడిది. అది పూర్తి యయ్యెను.

యాదవకుల సంహారము ముసలముచే జరుగునను శాపము కలదు. ఉగ్రసేన మహారాజు దానిని జూర్ణము చూర్ణముగ నరుగఁదీయించి జలములలోఁ గలిపించెను. అది నీటిమీఁదఁ దేలునంత భస్మముగఁ జూదించెను. శుద్ధ లోహ భస్మముయొక్క లక్షణము కాటుకవలె మెత్తగనై పోవును. నీటిలో వేసిన మునుగదు. అది వచ్చివచ్చి ప్రభాసక్షేత్రము దగ్గఱకు వచ్చి తగుల్కొనెను. దాని యెరువుచే నేర్పడిన జెల్లుతో గొట్టుకొని యాదవులందఱును జచ్చిరి. ఆ ముస లము నరుగఁదీయఁగాఁ జివరకొక ములికి మిగిలెను. దాని నరుగఁదీయుటకు వీలుచిక్కలేదు. చివరకు దానిని సముద్ర మునఁ బాఱవైచిరి. దాని నొక చేఁపమ్రింగెను. దైవ వశ మున నాచేప వ్యాధుని వలలోఁ జిక్కుకొనెను. పొట్టను జీల్చగనే దానిలో ములికియుండెను. దానిని జరుడను వ్యాధుఁడు తీసికొని బాణముగ నొనర్చుకొనెను. ఆబాణము చేతనే భగవానుని పాదమునకుఁ గొట్టెను. దానిని సత్య మొనర్చుటకై భగవానుఁడీ లీలను రచించెను. ఇదిగాక యింక ననేక కారణములు కలవు. విస్తారభయమున నిప్పుడు చెప్పను.'

శౌనకుఁడిట్లనెను:—సూతా! సమస్త కార్యములకును ముందుగనే కారణములుండును. సరియే, తరువాత నేమైనది?

సూతుఁడిట్లనెను:—'స్వామీ! ఇప్పుడింకే మున్నది? జరుగవలసిన దేమో జరిగినది. జరుఁడు మృగముకొఱకై సంతోషముతోఁ బరువిడెను. అతఁడు శ్యామసుందరు నెఱుఁగును. అతఁడు ప్రభాసమున నాతని ననేకసార్లు దర్శించెను. భగవానుని పాదములకు బాణము తగులుటను గాంచి యాతఁడు నిర్ఘాంతపోయెను. ఆతఁడు భగవాను ననేక విధముల స్తుతించెను. ఆతని స్తుతికి మెచ్చి భగవానుఁడాతని నాశ్వాసించి, వానికి సద్గతి నొసంగెను. ఆ వర్ణనమును జెప్పఁబోవుచున్నాను. వినుఁడు.'

---

## వ్యాధునకు సద్గతి

శ్లో॥ మా భైర్జరే త్వముత్తిష్ఠ కామ ఏష కృతో హి మే।
యాహి త్వం మదనుజ్ఞాతః స్వర్గం సుకృతినాం పదమ్॥

—శ్రీ భాగ. ౧౧ స్కం. ౩౦ అ ౩౯ శ్లో॥

వ. ఓ జరా! నీవు భయపడకుము. లెమ్ము. జరిగిన దేమో నా యిచ్ఛచేతనే జరిగినది. ఇప్పుడు నీవు నాయాజ్ఞచే సుకృతులు పొందు స్వర్గమునకుఁ బొమ్ము.'

—శ్రీ మదాంధ్రభాగవతము.

జీవుఁడు ప్రపంచమునఁ బొట్టకొఱకు తిరుగుచుండును. సాంసారిక వస్తువులకొఱకు తీవ్రాపేక్షను జెందుచుఁ గర్మ లొనర్చుచుండును. దైవవశమున సాంసారిక వస్తువుల కొఱకన్వేషించుచుండ, వాని కేవిధముగనైన భగవత్సంబంధ మేర్పడినచో, సకామకర్మ లొనర్చుచుండ, నొకానొకప్పుడు సమస్త కామనలను బూర్తి నొనర్చు భగవంతునితో సంబంధ మేర్పడినచో వానికి జనన మరణ రూపమగు సంసారము తెగిపోవును. ఇట్టి వాఁడు పరమ పదమున కధికారి యగును. శుభాశుభ కర్మలన్నియు నెచ్చట పరిసమాప్తి యగునో, అప్పుడే ప్రభు పాదపద్మ ప్రాప్తి కలుగఁగలదు. ప్రభు దర్శనమైన తరువాతను భగవదేచ్ఛచే నేదైనవాసన మిగిలి యుండినచో, భగవానుఁడే స్వయముగ ననన్యాశ్రితుఁడగు నాభక్తుని కోరికను బూర్ణముగ నెఱవేర్చును. వాంఛా కల్పతరువగు వాసుదేవ భగవానునితో సంబంధ మేర్పడినచోఁ బాపపుణ్యము లన్నియును సమాప్తము లగును. అంతట నాతఁడు ప్రభువునకు సంబంధించిన వాఁడగును.

సూతుఁడిట్లనియెను :–'మునులారా ! తాను హరిణమని భావించి కొట్టినది భువనపావనుఁడగు భగవానుని పాదారవిందములని జరుఁడను వ్యాధుఁడు తెలసికొనఁగానే ఆతని వ్యాకులతకు మేఱలేకుండెను. భయకారణమున

నాతని శరీరము కంపించు చుండెను. ఆతఁడు గొప్ప అప రాధినని భావించుకొనుచు, నత్యంత దీనుఁడై భగవానుని శరణువేఁడ వచ్చెను. ఆతఁడు విహ్వలుఁడై భగవానుని పాదములపైఁబడెను. అత్యంత కాతర వాక్కులతో నాతఁ డిట్లు ప్రార్థించెను :- 'వాసుదేవా! నే నత్యంతనీచుఁడను. మధుసూదనా! నేను మహామూర్ఖుఁడను. నాథా! నేను దీనుఁడను, హీనుఁడను, మలిన మనస్కుఁడను, సాధన హీనుఁడను. అపరాధిని క్షమింపుఁడు. అశరణ శరణా! తెలియక నేనీ యపరాధ మొనర్చితిని. ఉత్తమశ్లోకా! నా బుద్ధి భ్రమించినది. అనఘా! సాక్షాచ్ఛ్రీహరిని నేను హరిణమనుకొంటిని. అయ్యో! ఏ చరణములందు భక్త గణము చెందనాదుల నర్పించి పరమ ప్రముదితులగుచుం దురో, ఆచరణములను నేను బాణముతోఁ గొట్టి రక్త రంజిత మొనర్చితిని. ఏ పాదములనుండి వెలువడిన అమృతము త్రిభువనముల బావన మొనర్చినదో, అట్టి పాదములను నేను దీక్ష విషాక్త బాణముచేఁ గొట్టితిని. ఏ పాదారవింద ధ్యాన మున యోగులు మోక్షమును గోరుచుందురో, అట్టి వానిని నేను గష్టపెట్టితిని. ఏ చరణములు జగద్ధితములో అట్టి వానికి నేనహితము కావించితిని. నేను నాజీవితమునఁ బుణ్యము నొనర్పలేదు. వనములలో నే మృగములు స్వచ్ఛందములై విహరించుచు, నెవ్వరికిని నే హానియును

జేయక, తమకు దామే పెరుగు నట్టి గడ్డిని దిని తిరుగు చుండు వనమృగములను నాపొట్టకొఱకు తీక్షణములగు బాణములతోఁ గొట్టి పాప మొనర్చు చుండువాఁడను. నేఁడు నాపాపము పరకాష్ఠ నందుకొనినది. పరబ్రహ్మ పరమాత్మను బశువని భావించి పీడించితిని. ప్రభూ! నాఘోర పాపమునకు శిక్ష నొసంగుము. వెంటనే నాశిరస్సును దెగఁ గొట్టుము. అట్లొనర్చి నావలన ముందు జన్మములం దైనను నపరాధము జరుగకుండు నట్లొనరింపుము. మహాపురుషుల కపరాధ మొనర్చు నాబోటివారికి నరకములం దైనను స్థానము లభింపదు.

హా! అనాథనాథా! ఏమి చెప్పుదును? ఏ శబ్దములతో నాయీ ఘోరపాపమునకుఁ బ్రాయశ్చిత్తమును బ్రకటించుకొందును. ప్రభూ! ప్రభూ! మిమ్ములను బొందుట బ్రహ్మాది గొప్ప దేవతలకును, శంకరాది యోగేశ్వరేశ్వరులకును, సనకాది బ్రహ్మపుత్రులకును నత్యంత కఠిన మైనపుడు సామాన్య ప్రాణుల విషయము చెప్పనేల? ఇంక మీ విషయమునఁ జెప్పవలసిన దేమున్నది? సమస్త విద్యాపారంగతులును, ఏ పండితుల యొక్క వాక్యములు గొప్ప గొప్ప వాద వివాదములందు బ్రమాణముగ నెంచఁబడునో, అట్టి పండితులును నొక్కొక్కప్పుడు మాయలోఁ బడిపోవుచుందురు. ఏలననఁగా మీ మోహినీమాయ ప్రాణుల

దృష్టినిఁ గప్పివేయును. ఇంతటి గొప్ప తపస్సులును, తేజస్వు లును, ఋషులును, మునులును గూడ నీ మాయ మోహింపఁ జేయుచుండ, నింక నాబోటి పాపులను గూర్చి చెప్పనేల ? మా బుద్ధి స్వాభావికముగఁ బాపములందే ప్రవృత్తినిఁ జెందుచుండును. నిరంతరము పాపములనే చేయుచుందుము. భక్తవత్సలా ! నేను వ్యాధుఁడను. ప్రాణులను హింసించుట నావృత్తి, దాన, ధర్మ, పుణ్య, పరోపకారాది సత్కార్య ములనే నెఱుఁగనైన నెఱుఁగను. ప్రభూ! నేను జేసిన నాయీ యపరాధమునకు దగిన శిక్షను విధింపుఁడు.'

సూతుఁడిట్లనెను:- 'మునులారా! జరావ్యాధుఁడు మిక్కిలి దీనుఁడై ప్రభుపాదపద్మములమీఁదఁబడి, తాను జేసిన పాపమునకు బశ్చాత్తాపమును జెందుచు, మాటి మాటి కిని దన్ను శిక్షింపుఁడని ప్రార్థించుచుండెను. అప్పుడు మంద హాస మొనర్చుచు మాధవుఁ డిట్లనెను :- 'ఓరీ ! జరా! నీ వేల యింతగా భయభీతుఁడగుచున్నావు? ఇంతగా విహ్వ లుఁడవు కానేల ?'

జరుఁడేడ్చుచు నిట్లనెను:- 'స్వామీ! నేను మీ పాద ములను బాణముతోఁ గొట్టితిని. గాయ మొనర్చితిని.'

నవ్వుచు శ్యామసుందరుఁ డిట్లనెను :- 'ఓరీ! నేను కాలకాలుఁడను. నన్నెవరు చంపఁగలరురా. అన్నిటికిని నాధారమును నేనే. అట్టియెడ నాకెవరా ఘాతమును గలి

గింపఁగలరు ? నా వైపునకుఁ దలయెత్తి చూచుటకైనను నీకు సాహసము కలదా ? ఇప్పు డేది జరిగినను నా యిచ్ఛ ననుసరించియే జరిగినది. నే నట్లు చేయించితిని. నిన్ను నిమిత్తముగఁ జేసికొంటిని. అందువలన నేను నీచే నిట్లు చేయించితిని. ప్రపంచమున నేమి జరిగినను నా యిచ్ఛచేతనే జరుగుచున్నది. నా యిచ్ఛచేతనే వాయువు వీచుచున్నది. నా యిచ్ఛచేతనే సూర్యచంద్రు లుదయించి అస్తమించుచున్నారు. నా యిచ్ఛచేతనే దిన రాత్రులును, జననమరణములును, సుఖదుఃఖములును, పుణ్యాపాపములును, కీర్త్యపకీర్తులును, మంచి చెడ్డలును, జరుగుచున్నవి. నీ వహంకారముతోఁ జేసియుండినచో, నీవు దాని ఫలమనుభవింపవలసి వచ్చెడిదే, నీవు నా యిచ్ఛను బాలించితివి. నేను నిన్నుఁ గృపఁ జూచి నీచే నిట్టి కఠిన కార్యమును జేయించితిని. ఇప్పుడు నా యిచ్ఛచేఁ బాపు లెన్నటికిని దర్శింపఁజాలని పుణ్యలోకమునకుఁ బొమ్ము. అచ్చటికి పుణ్యాత్ములు మాత్రమే పోఁగలరు. ఆ పుణ్యలోకమున నీవు యథేష్టముగ భోగము లనుభవించి, చివరకు నన్నుఁ బొందఁగలవు. ఇదిగో, నిన్నుఁ గొనిపోవుటకై దివ్యవిమానము వచ్చుచున్నది.'

సూతుఁడిట్లనెను :- 'మునులారా ! భగవానుఁ డిట్లనుచుండఁగనే కోటి సూర్యప్రభాభాసమానమగు నొక దివ్యవిమాన మచ్చటికి వచ్చెను. అది దివ్య సువర్ణముతోఁ జేయఁ

బడెను. దానిలో మణిమాణిక్యములు పొదగఁబడియుండెను. దానికి శ్వేతహంసలుంతెను. చతుర్భుజులగు విష్ణుపార్షదులు దానిలో నుండిరి. దివ్యాప్సరసలు నృత్యమొనర్చు చుండిరి. గంధర్వులు దివ్యగాన మొనర్చుచుండిరి. ఆ యద్భుత విమానమును గాంచి జరుఁడు నిర్ఘాంతపోయెను. చూచు చుండఁగనే ఆతని శరీరమును దివ్యమయ్యెను. ఆతఁడు స్వేచ్ఛా శరీరధారియగు కృష్ణునకు నమస్కరించి, విధ్యుక్త ముగఁ బూజించి, ముమ్మారు ప్రదక్షిణించి మాటి మాటికిని జరణములకు నమస్కరించి, విమాన మెక్కి పుణ్యలోక మునకుఁ బోయెను,

శౌనకుఁడిట్లనెను:- 'సూతా! జరుఁడు పుణ్యలోకము నకుఁ బోగానే, పుణ్యశ్లోకుఁడగు వాసుదేవుఁ డేమి యొన ర్చెను. ఆ విషయమును వినఁ గుతూహల మగుచున్నది. కావున నా ప్రసంగమును గూర్చి వినిపింపవలయును.'

సూతుఁ డిట్లనెను :- 'మునులారా ! జరుఁడు వెడలి పోఁగానే భగవానుని సారథియగు దారుకుఁడు కృష్ణునన్వే షించుకొనుచు, నాతని కడకు వచ్చెను. ఇప్పుడు దారుకు నకును, దామోదరునకును జరిగిన సంవాదమును గూర్చి మీకుఁ జెప్పెదను. సావధానులరై వినుఁడు.'

---

# దారుక - వాసుదేవులు

శ్లో॥ తం తత్ర తిగ్మద్యుభిరాయుధైర్వృతమ్ ।
అశ్వత్థ మూలే కృత కేతనం పతిమ్ ।
స్నేహప్లుతాత్మా నిపపాత పాదయో
రథాదవప్లుత్య సబాష్పలోచనః॥

— శ్రీ భాగ. ౧౧ స్కం. ౩ అ. ౪౨ శ్లో

వ. రాజా! పాదచారియై సారథి వచ్చి అశ్వత్థమూలమున నాసీనుఁడై; తీవ్ర తేజోమయుఁడగు కృష్ణుఁ డాయుధములతో నుండుటను గాంచెను. ఆతనిఁ గాంచఁగనే ఆతఁడు రథమునుండి దుమికి, ప్రేమాతురుఁడై ప్రభు పాదపద్మములందు బడెను. ఆసమయమున నాతని కన్నులు బాష్పమయములై యుండెను.

—శ్రీమదాంధ్ర భాగవతము.

భగవంతుఁ డవతరించునపుడు ముందుగాఁ దన యస్త్రాయుధవాహనాదులను బంపును. భగవానుఁడు వెడలునపుడు ప్రప్రథమమునఁ దన యాయుధములకు శలవొసంగి పంపి పిదపఁ దాను బోవును. భగవానుఁడు లేకుండిన నాతని యస్త్రాయుధవాహనాదుల వలనఁ బ్రయోజన మేమున్నది? భగవంతుని వస్తువులను భగవానుఁడే యుపయోగింపవలయును. ఈరాకపోఁకలు లీలగా జరుగును. సర్వవ్యాపకుఁడును, సర్వాత్ముఁడును, సర్వాంతరాత్మయునగు సర్వేశ్వరుని

యందు రాకపోకలేమున్నవి. ఆతఁడు సదా ఏకరసమున నేకభావమున నుండును.

సూతుఁడిట్లనెను :- 'మునులారా! జరావ్యాధునకు జనార్దనుఁడు సద్గతి నొసఁగి తాను స్వధామమునకు బోవ నుద్యుక్తుడై యుండెను. ఈ యశ్వత్థ వృక్షము క్రిందఁ గూర్చుండియే, ఆతఁడు మైత్రేయునకు భాగవతోపదేశమును గావించెను. ఉద్ధవుఁడును భగవానుని వెనువెనుకనే ప్రభాస క్షేత్రమునకు వచ్చెను. చరణ పాదుకలను దీసికొన్నను నాతనికి భగవద్వియోగము సహింపరానిదై యుండెను. భగవానుఁడిద్దరకును సంతిమోపదేశము నొసంగెను. ఇంక నాతనికి దారుకు నోదార్చుట మిగిలియుండెను. కాని దారుకుఁడచ్చట లేఁడు. యాదవులందఱును బరస్పరము పోరాడుకొని చచ్చిరి. అందఱ రథములును ముక్కలు ముక్కలయ్యెను. గుఱ్ఱములు చచ్చెను. కాని భగవానుని రథముదివ్యమైనది. అదియును భగవానునివలెనే నిత్యమును, జిన్మయమైనది. దారుకుఁడు దానినిఁదీసికొని తిరుగుచుండెను. యాదవులందఱును జచ్చుటనుగాంచి ఆతఁడు మిక్కిలి దుఃఖించెను. ఇప్పుడాతఁడు తన స్వామియగు శ్రీకృష్ణ భగవానుని వెదుకుచుండెను. భగవానుఁడును స్వధామ గమనమొనర్చెనేమోయని ఆతనికి సందేహము కలిగెను. ఆతఁడు భగవానుని శరీరమును సమరాంగణమున వెదుక

నారంభించెను. అతఁడు మరల నిట్లనుకొనెను:-'భగవానుఁడీ విధముగఁ బ్రాకృతులవలెఁ దన శ్రీ విగ్రహమును త్యజింపఁడు. అతఁడు నా కంతిమ దర్శన మొసంగక తన లీలా సంవరణమును గావింపఁడు. అతఁడిచ్చట నెచ్చటనో యుండి యుండవలయును'. అని యిట్లనుకొనుచు సారథి రథమును ద్రిప్పుచుఁ దిరుగుచుండెను. ఇంతలోనాతనికి భూమిమీఁద భగవానుని ధ్వజ వజ్రాంకుశాదులతోఁ గూడిన చరణ చిహ్నములు కనఁబడెను. ఆ చరణ చిహ్నములను గాంచఁగనే ఆతని యానందమునకు మేఱలేకుండెను. భగవానుఁడప్పుడే అచ్చటినుండి వెడలిపోయినట్లాతనికిఁ దోఁచెను. ఇప్పుడాతనికొక యాధారము లభించెను. ఆ చరణ చిహ్నములననుసరించి ఆతఁడు సముద్ర తటమునకు వచ్చెను. దూరమున రావిచెట్టు నానుకొని కూర్చుండిన భగవానుఁడాతనికిఁ గన్పట్టెను. ఆతని దివ్యాయుధములగు శంఖ, చక్ర, గదా, పద్మములు సశరీరులై ఆతని యెదుట నిలుచుండెను. భగవానుఁడు పరమ శాంత ముద్రతో నుండెను. దూరమున నుండియే ఆతఁడు స్వామినిఁగాంచి, రథము మీఁదనుండి క్రిందకు దుమికి గబగబ పోయి వాసుదేవుని పాదములపైఁ బడెను. ఆ సమయమున నా సూతుని స్థితి అకథనీయముగ నుండెను. ప్రేమాధిక్యమున నాతని శరీరమంతయు గగుర్పొడిచి రోమములు నిక్కబొడిచెను, నేత్ర

ములనుండి అవిరళముగ నశ్రుధారలు ప్రవహించుచుండెను. తన యశ్రువులచే భగవానుని చరణారవిందములను ప్రక్షాళనమొనర్చుచు గద్గద వాక్కులతో నిట్లనెను :- 'స్వామీ! నీవు నన్ను వీడి యెచ్చటికి వెడలితిరి. నీవు లేకుండిన నాకీ ప్రపంచమంతయును శూన్యముగఁ దోఁచుచున్నది. ప్రభూ! నీవే నా నయనములకుఁ బ్రకాశము. నీ ద్వారముననే నేను జూడఁగలుగుచున్నాను. రాత్రులందు జంద్రుఁడస్తమించిన ఘోరాంధకారము వ్యాపించినట్లు నీవు లేకుండిన నా కన్నులయెదుట ఘోరాంధకారము వ్యాపించియున్నది. దృష్టి నశించినది. నా కేమియును దోఁచుటలేదు. నాథా! మీరీ ధరాధామమును వీడఁదలంచితిరా? ప్రభూ! మీరీ పృథివిని శ్రీహీనముగ నొనర్పఁదలఁచితిరా? అశరణశరణా! నన్నుఁ బరిత్యజింపకుఁడు. నన్నును మీ వెంటఁ గొనిపొండు.'

సూతుఁడిట్లనెను:-'మునులారా! దారుకుఁడు ప్రభువు పాదములమీఁదఁబడి యిట్లు ప్రార్థించుచుండఁగనే, గరుడధ్వజ విరాజితమును, శైబ్య, సుగ్రీవ, మేఘపుష్ప, వలాహకాదిదివ్యాశ్వములచేఁ బూన్పఁబడినదియునగు నా భగవానుని రథమాకాశమునకెగిరి అదృశ్యమయ్యెను. దానితోఁ గూడి భగవానుని ఆయుధములును నదృశ్యములయ్యెను. దీనినిఁ గాంచి సారథి పరమ విస్మితుఁడై, అటు నిటు జూడ

సాగెను. ఆతఁడత్యంతాశ్చర్య చకితుఁడగుటను గాం
పరమ ప్రేమతో శ్యామసుందరుఁడిట్లనెను :- 'దారుకా
నీవింతగా దుఃఖింప నేల? జరగనున్నదాని నెవరాపఁగలరు!

దారుకుఁడిట్లనెను :- 'ప్రభూ సమస్తమును జేయు
వాఁడవును జేయించువాఁడవును నీవే. నీ యాజ్ఞ లేక ఒక్క
ఆకైనను గదలఁ జాలదు. నాకేమి ఆజ్ఞ?'

భగవానుఁడిట్లనెను :-'దారుకా ! నీవాలస్యము
చేయక యిచ్చటినుండి ద్వారకాపురమునకుఁ బొమ్ము.'

ఏడ్చుచు దారుకుఁడిట్లనెను:- 'కృపాసింధూ ! పాడు
పడిన నా ద్వారకకు బోయి యిప్పుడు నేనేమి చేయుదును
నాథా ! మీరులేని ద్వారక నన్నుఁ గఱవవచ్చును. అచ్చట
నే నెట్లుండఁగలను అచ్చట నాకేమి పనియున్నది ?'

భగవానుఁడిట్లనెను:-'నీకు లేకపోవుగాక; నాకచ్చట
నొక పనియున్నది. నీవు పోయి ద్వారకలో నా సందేశమును
జెప్పుము,

దారుకుఁడిట్లడిగెను:-'స్వామీ ! అచ్చట సందేశమెవ
రికి జెప్పుదును? స్త్రీలు శంఖోద్ధారక తీర్థమునకుఁబోయిరి.
రక్షక భటులలో వృద్ధులెవ్వరైన నుందురేమో ?'

భగవానుఁడిట్లనెను:-'అచ్చట ఎవరుండినను నిట్లు
చెప్పవలయును. ఇఁక ద్వారక నిలువదు. నేను సముద్రము
నుండి శతయోజన విస్తీర్ణముగు భూమి నడిగితిని. ఇప్పుడు

నేను ద్వారకాపురిని వదలి యుంటిని. నేను సముద్రునితో నేనున్నంతవఱకే పురి నిట్లుంచుము. నేను పోయిన తరువాత దీనిని ముంచివేయు మంటిని. ఇప్పుడు నేను విడచిన యదు పురిని సముద్రుఁడు ముంచివేయును. కేవలము నాభవనము మాత్రము గుప్తరూపమున నెల్లప్పుడునుండఁగలదు. దానిలో నేనెవరికిని గనఁబడకయే నేనచ్చట నిత్యనివాస మొనరింతును. కావున నిప్పుడచ్చట ఎవరును నుండరాదు.'

దారుకుఁడేడ్చుచు నిట్లనెను:–'ప్రభూ ! సేవక ధర్మము చాల కఠినమైనది. సేవకునకు ప్రాణమును విడుచుటకును స్వతంత్రము లేదు. మీయాజ్ఞ కావున నేనిప్పుడు పోయి, తీరవలసినదే. అచ్చటికి పోయి నేనేమని చెప్పవలయును ?'

భగవానుఁడిట్లనెను:–'నీవచ్చటకు బోయి మనబంధు బాంధవులెట్లు పరస్పరము పోరాడుకొని యెట్లు చచ్చిరో, ఆ వృత్తాంతమును జెప్పుము. వీరి పారస్పరిక కలహమును, ఒకరొకరు పోరాడుకొనుటయు, యదువంశ మంతయును నాశమగుటయును వరుసగాఁ జెప్పవలయును. బలరాముని పరమగతిని గూర్చియుఁ జెప్పవలయును. ఇప్పుడు నాస్థితిని నీవు కాంచుచుంటివి కదా ! దానినిఁ గూర్చియుఁ జెప్ప వలయును.'

దారుకుఁడిట్లుడిగెను :–'ద్వారకలో నుండు వారును, శంఖోద్ధారకమున నుండువారును నెచ్చట నుండవలయును?'

భగవానుఁడిట్లనెను :-'మిగిలిన యాదవు లీదేశమున నుండరాదు. అర్జునుని నేను బుద్ధిపూర్వకముగ ద్వారకలో విడిచి వచ్చితిని. ఇప్పుడు నాతల్లి దండ్రులును నచ్చటనే యున్నారు. కొందఱు స్త్రీలను శంఖోద్ధారకమునకుఁ జేర్చిరి. నీ వందఱితో నిట్లు చెప్పవలయును—వారందఱును దమ తమ వస్తుసామగ్రులను దీసికొని అర్జునుని వెంట హస్తినా పురమునకుఁ బోవలయును. మా తల్లిదండ్రులను గూడ నచ్చఁజెప్పి హస్తినాపురమునకుఁ బంపివేయ వలయును. వారు నావియోగమును గాంచి జీవింపరు. అయినను నేను జెప్పినట్లు సమస్తమును వారికిఁ జెప్పవలయును.'

ఏడ్చుచు దారుకుఁడిట్లడిగెను :-'ప్రభూ! అందఱికిను సందేశ మొసంగిన తరువాత నేనేమి చేయవలయును? ఎచ్చట నివసింతును?'

భగవానుఁడు గంభీరముగ నిట్లనెను :-'దారుకా! నాయనా! నీవు నేను జెప్పిన భాగవత ధర్మముల నాచరించుచు, జ్ఞాన నిష్ఠుడవై స్వచ్ఛందముగఁ దిరుగుచుండుము. ప్రపంచము నందు వైరాగ్యమును జెంది నన్ను భజించుచుండుము. ఈ ప్రపంచము నంతను మాయా విలాసమని భావించి మాయాపతినగు నన్ను ధ్యానించుము. ఇట్లు చేసినచో నీవు దుస్తరమగు నామాయను సహజముగ దాటఁ గలవు. నాయనా! అధీరుఁడవు కాకుము. ధీరులే నా మాయను దాఁటఁగలరు.'

సూతుఁడిట్లనెను:- 'మునులారా! భగవానుని యీ యాజ్ఞను వినఁగానే దారకుని హృదయ బ్రద్దలగుచున్నట్లుండెను. ఆతఁడు బాలకునివలె కృష్ణుని పాదముల మీఁదబడి ముక్తకంఠముతో నేడ్వనారంభించెను. ఆతడు మాటిమాటికిని భగవానుని పాదారవిందములపైఁ బడి ప్రణామ మొనరించుచుఁ బ్రదక్షిణ మొనర్చుచు, మరల నధీరుఁడై క్రిందఁబడుచు మరల లేచి ప్రణామ ప్రదక్షిణము లొనర్చుచుండెను. ఈవిధముగ ననేకసార్లు ప్రణామ ప్రదక్షిణము లొనర్చుచు నత్యంత కష్టముతోఁ జింతా మనస్కుఁడై ద్వారకకుఁ బోయెను.'

శౌనకుఁడిట్లడిగెను:- 'సూతా! దారుకుఁడు పోయిన తరువాత భగవానుఁడేమి యొనర్చెను?'

ఖిన్నమనస్కుఁడై సూతుఁడిట్లనెను:- 'స్వామీ! ఇంక నేమిచేయుట కేమికలదు? భగవానుఁ డిప్పుడు చేయఁదగినదేదైన నుండిన నది తనలీలనుపసంహరించి స్వధామమునకుఁ బోవుటయే. ఇంక నచ్చట ఎవరునులేరు. కావున భగవానుఁడు స్వధామమునకు బోవ సిద్ధమగుచుండెను. ఇంతలో భగవానుని పరమధామ యాత్రను దర్శింపవచ్చిన బ్రహ్మాది దేవతలెట్లాతని స్తుతించినదనియు మీకు వర్ణించి చెప్పెదను. సావధానులరై వినుఁడు'.

---

# శ్యామసుందరుని స్వధామ గమనము

శ్లో॥ మర్త్యేన యో గురుసుతం యమలోకనీతమ్
త్వాం చానయచ్ఛరణదః పరమాస్త్రదగ్ధమ్।
జిగ్యేఽన్తకాన్తకమపీశమసావనీశః
కిం స్వావనే స్వరనయన్మృగయుం సదేహమ్॥

శ్రీభాగ. ౧౧స్కం. ౩౧అ. ౧౨శ్లో॥

వ. రాజా! ఏ భగవానుఁడు తన గురుపుత్రుని యమలోకము నుండి యీ మానవ శరీరముతోఁ దీసికొని వచ్చెను. నిన్నును శరణాగతరక్షకుఁడగు భగవానుఁడు బ్రహ్మాస్త్రముచే దగ్ధమైనను గర్భమునుండి బ్రదికించి తెచ్చెనో, ఎవఁడు కాలకాలుఁడగు శివునిగూడ జయించినవాఁడు తన పాదమును బాణముతోఁ గొట్టిన వ్యాధుని సశరీరముగ స్వర్గమునకు బంపినాఁడు. అట్టి సర్వసమర్థుఁడగు భగవానుఁడు తన్నుఁదాను రక్షించుకొనజాలక పోయెనా!'

— శ్రీమదాంధ్ర భాగవతము.

భగవానుఁడు లీల నొనర్చినను సాంగోపాంగముగ నొనర్చును. అతని లీలలలోఁ జాలభాగము అతి మానుషములుగనో, అమానుష కార్యములుగనో కనుపించినను, ఆతని కార్యములవలన లోకులు సాధారణముగ భగవానుఁ డనుకొని నప్పటికిని, సాధారణముగ నాతఁడు లోకవల్లీలనే యొనర్చును. అజుఁడయ్యును జన్మించును. దుఃఖరహితుఁ డయ్యును దుఃఖితునివలె విలాపమొనర్చును. అజరామరుఁ

డయ్యును మర్త్యధర్మముల ననుకరించును. జీవులయొక్క కఠిన హృదయములందు కరుణాస్రవంతినిఁ బ్రవహింపఁ జేయుటకే భగవానునియొక్క యీలీల లేర్పడినవి. భక్తగణ మీలీలను స్మరించి, తమ హృదయములందలి కల్మషములను కడిగివేయుదురు. కృతకృత్యులయ్యెదరు.

సూతుఁడిట్లనెను:—'మునులారా భగవంతునియాజ్ఞచే దారుకుఁడు ద్వారకకు పోయెను. భగవానుఁడు స్వధామ గమనమొనర్పుటకు నిశ్చయించుకొనెను. భగవానుఁడు స్వధామ గమన మహాయాత్రను దర్శింపవలయునని దేవ గణము తమ తమ విమానములందు గూర్చుండి అచ్చటకు వచ్చిరి. బ్రహ్మను ముందుంచుకొని భవాని పతియగు శంకరుఁడును, ఇంద్రాదిదేవతలును, సమస్తప్రజాపతులును, ఋషులును, మునులును, పితృదేవతలును, సిద్ధ, గంధర్వ, విద్యాధర, నాగ, చారణ, యక్ష, రాక్షస, కిన్నర, అప్సర, ద్విజగణాదులును, బరమోత్సాహముతో నచ్చటికే వచ్చిరి. అందఱును బంక్తిబద్ధులైనిలిచి, భగవానుని గుణగణములను గానముచేయ నారంభించిరి. ఆతని ననేక స్తోత్రములతో స్తుతించిరి. ఆ సమయమున నాకాశమంతటను విమానములే గోచరించు చుండెను. మధురాతి మధుర స్వరములతో దేవతలు దుందుభులను బ్రయోగించుచుండిరి. అప్సరసలు తమ నూపుర ఝుంకారములచే నాకాశమండలమునంతను

ముఖరితమొనర్చుచు నృత్యమొనర్చుచుండిరి. గంధర్వులు తమ సుస్వరయుక్తములగు కంఠములతో భగవానుని గుణములను గానమొనరించుచుండిరి. చేతులందు పుష్పాంజులను గ్రహించి దేవతలు మంత్రములను బఠించుచు స్వర్గమందలి పారిజాతములను భగవానునిపై వర్షింపుచుండిరి.

భగవానుఁడు బ్రహ్మను, అచ్చటికివచ్చిన దేవతలను మందహాస వదనారవిందుఁడై కాంచి, కమల సదృశములగు నయనములను మూసికొనెను. ఆతఁడాత్మసంస్థుఁడై స్వధామ గమనమున కుపక్రమించుచుండెను. ఆతని దివ్య తనువు ధారణ ధ్యానములకు మంగళమయమై యుండెను. లోకములో నన్నిటికంటెను నధిక సుందరముగ నుండెను. దానిని యోగధారణాగ్నిచే నంతర్హితమొనర్చి ప్రభువు స్వధామమునఁ బ్రవేశించెను. స్వర్గమున దుందుభులు మ్రోగుచుండెను. దేవతలు నిరంతరము పారిజాత పుష్పములను వర్షించుచుండిరి. జయజయ నమోనమశ్శబ్దములు సర్వత్ర మారుమ్రోగుచుండెను.

భగవానుని దివ్య లీలామయ విగ్రహ మంతర్హితమయ్యెను. శ్రీ సంపన్నమగు నీ భూమండలమభాగ్యమయ్యెను. దీనికి యొక్క శ్రీ నష్టమయ్యెను. భగవానుఁడు పోఁగానే కలిపురుషుఁడు వ్యాపింప నారంభించెను. అందువలన సత్యము తన ఛాయను వీడిపోయెను. ప్రజలలోనుండి

ధైర్యమును నుండుట మంచిది కాదనుకొనెను. అధర్మ ప్రాబల్యము వలనను, దాని కాలము వచ్చెఁదనుకొని ధర్మమును వెడలిపోయెను. ఈ భూమి శ్రీవిహీనమయ్యెను. భగవానుఁడంతర్హితుఁడు కాఁగానే ఆతని వెంట లోకము నుండి సత్య, ధర్మ, ధైర్య, కీర్తి, శ్రీలు పరిత్యజించిరి. దేహమందలి సమస్త అంగ ప్రత్యంగములు తమకు దా నేర్పడును. కేవలము ప్రాణము వెడలిపోనే నది శ్రీ హీనముగను, జీవనహీనముగనునగును. అట్లే భగవానుఁడు స్వధామమునకు జేరఁగనే భూమియొక్క సమస్త గుణములు నశించెను.

భగవానుఁడు స్వధామమునకు బోవునపుడు బ్రహ్మాది దేవతలు భగవానునియొక్క స్వధామ గమనమును బాగుగాఁ జూడవచ్చుననుకొనిరి. కాని అవిజ్ఞాతగతులగు వారు భగవానుని గతి నెఱుఁగఁజాలక పోయిరి. ఆతఁడు స్వధామమునఁ బ్రవేశించుట నెవరును జూడఁజాలకపోయిరి'

శౌనకుఁడిట్లడిగెను :- 'సూతా! బ్రహ్మ సర్వజ్ఞుఁడు కదా! ఆతఁడేల భగవద్గతిని దెలిసికొనఁజాలకపోయినాఁడు?'

సూతుఁడిట్లనెను:-'స్వామీ! బ్రహ్మ మన అందఱి కంటెను సర్వజ్ఞుఁడే. కాని భగవానుని యొక్కగతి నెవరును నెఱుఁగఁజాలరు. కేవల మాతఁడే తెలిసికొనవలయును. అయ్యా! ఇది అందఱకును దెలిసిన విషయమే. మెఱుపొక

మేఘమునుండి యింకొక మేఘము లోనికిఁ బోవును. కాని అది యెప్పుడొక మేఘమునుండి యింకొక మేఘము లోనికిఁ బోవునో యెవరికిని దెలియదు. అదేవిధముగ భగవానుఁడు స్వధామమునఁ బ్రవేశించినాఁడు. కాని యాతనిగతి నెవరును దెలిసికొనఁజాలక పోయిరి. భగవానుని యొక్క యిట్టి ఖ్యత, ఆశ్చర్యజనక గతినిఁగాంచి, అందఱును నత్యం శ్చర్య జనితులైరి. అందఱును నాతని గుణగణములను గూర్చి భూరి ప్రశంసలొనర్చుచు, నాతని పుణ్యప్రసంగములను గానమొనర్చుచుఁ దమ తమ లోకములకుఁ బోయిరి.'

శౌనకుఁ డిట్లనెను :- 'సూతా! భగవానుఁడీ లీల నత్యంత దుఃఖదమైనదిగ నొనర్చినాఁడు. మనము కర్మాధీనులము. కావున శరీరమును ద్యజింపవలసిన దే. భగవానుని శరీరము కర్మాధీనమైనది కాదు. అది అప్రాకృత దివ్య చిన్మయశరీరము. లోకాభిరామమగు నిట్టి శరీరము నంతర్హిత మొనర్చుట కేమి ఆవశ్యకత కలదు?'

అంత సూతుఁ డిట్లనెను :- 'స్వామీ! రంగస్థలము మీఁదకు వచ్చి నటకుఁడు యుద్ధమొనర్చును. క్షత విక్షితుఁడగును, చివరకు చచ్చిపోవును. కాని లోపలికిఁ బోయి చూచినచో, వాని శరీరమున నొక్కగాయమైనను నుండదు. ఆతఁడు చావను లేదు. నాటకమాడి లోపలికి బోయి నవ్వుచుండును. తన యుత్తమాభినయమునకు ప్రమోదితుఁడగు

చుండును. ఇదే విధముగ భగవానుఁడు జన్మించుటయును, అంతర్హితుఁడగుటయును నాటకాభినయసదృశమే కాఁగలదు. అజన్మునకు జన్మయెచ్చటిది? అజరామరణునకు మరణ మెక్కడిది? కాని లోకవల్లీల యొనర్చుటకై అట్లు చేయుచుండును. అనేక విధములగు సుఖదుఃఖలీలల నొనర్చుచుండును. ఆతనికి సుఖాంత దుఃఖాంతములు లేవు. తనకు దానే. ఆతఁడు ప్రపంచమును సాలీడు తనకు దానే గూటి నల్లుకొని, నట్లల్లుకొని ఇచ్ఛానుసారముగఁ గొంతకాల మందు క్రీడించి, మరల కాదనుకొనఁగనే క్రీడ నుపసంహరించుచు క్షీరసాగరమందు శేషశాయియై శయనించి, నిద్రించును. లక్ష్మీదేవి ఆతని చరణముల నొత్తుచుండును. చల్లని పిల్లతెమ్మెరలు వీచుచుండును. భగవాను నే సంఘటనయును విచలిత మొనర్పఁడు. తననుండి యుద్భవించిన నీ జగత్తును దనలోనే లీనమొనర్చుకొని తన మహిమలో నిలిచి యుండును. మీ రెట్లు ప్రశ్నించితిరో మా గురువగు శుకమహర్షిని, రాజర్షియగు బరీక్షిన్మహారాజు ప్రశ్నించెను.

రాజిట్లడిగెను:–'స్వామీ! భగవానుఁడు తన శరీరము నేల అంతర్హిత మొనర్చుకొనినాఁడు. ఆతఁడు దాని నంతర్హిత మొనర్చుకొనవలసిన అవసర మేమున్నది?'

అంత నవ్వుచు శుకమహర్షి యిట్లనెను:– 'రాజా! భగవంతుఁడు తన శరీరము నంతర్హిత మొనర్చుకొనుటకు

వివశుఁడు కాలేదు. ఆతనికి వశతా వివశత్వము లేమున్నవి! చూడుము. తన గురువగు సాందీపుని పుత్రుఁ డెన్నో సంవత్సరముల క్రింద సముద్రమున మునిఁగి చనిపోయెను. ఆతఁడు యమలోకమునకుఁ బోయి వానిని యథాప్రకారముగఁ దీసికొని వచ్చెను. ఇట్టి పనిని సాధారణ వ్యక్తి చేయఁగలిగియుండునేమో నీవే ఆలోచింపుము. ఎన్నియో దినముల క్రిందట మరణించిన వ్యక్తిని మరల సశరీరముగఁ దెచ్చుట అసంభవమే కాఁగలదు. కాని భగవానుఁడు సంభవాసంభవముల కతీతుఁడు. ద్వారకానగరమున నొక బ్రాహ్మణుని పదుగురు పుత్రులు చనిపోఁగా, మహాకాలపురమునకుఁబోయి భూఁమాభగవానునినుండి యాపదుగురను వారి వయోనుసారముగఁదెచ్చి యిచ్చెను. ఇతరుల సంగతి నట్లుంచుఁడు. నీవు గర్భమున నున్నప్పుడు, అశ్వత్థామ కురుకుల నాశనమొనరింప వలయునని అమోఘమగు బ్రహ్మాస్త్రమును బ్రయోగింపఁగా, నీ వొకవిధముగ మాడి భస్మమువలెనైతివి. కాని శ్యామసుందరుఁడు గర్భమునఁ బ్రవేశించి, తన కౌమోదకీ గదచే నిన్ను రక్షించి, నిన్ను సకుశలముగ గర్భమునుండి బయటకుఁ దెచ్చినాఁడు. అంత్యకాలమున నాతని చరణకమలములకు వ్యాధుఁడు బాణముతోఁ గొట్టఁగా, నట్టి క్రూరుఁడును, పాపియునగు నపరాధియొక్క అపరాధమును క్షమించి సదేహముగ స్వర్గమునకుఁ బంపియుండెను. అట్టి

కానికి దన శరీరమును నిలుపుకొను టేమంతటి కష్టము. ఆతఁ డనుకొని యుండినచోఁ దన శరీరము నట్లే యుంచుకొనెడు వాఁడే. ఆతనికి గర్తవ్యాకర్తవ్యములును, సంభవాసంభవములును, సాధ్యాసాధ్యములును లేవు. ఆతఁడు జగదుత్పత్తి, స్థితి, ప్రళయముల కేకైక అనన్యకారణము. సర్వశక్తిమంతుఁడు. సర్వసమర్థుఁడు. ఆతఁడనుకొని యుండినచోఁ దన శరీరము నట్లే యుంచుకొనెడు వాఁడే. కాని దానివలనఁ బ్రయోజనము లేదని ఆతఁ డనుకొనెను. తాను తన శరీరమును బ్రకటరూపముగ శాశ్వతముగ నుంచుకొనిచో నాత్మజ్ఞానులును, సామర్థము కలవారును నిదే విధముగఁ బ్రయత్నించెదరని తలఁచెను. వారును శరీరమును శాశ్వతముగ నిలుపుకొని మర్త్యలోక సుఖముల ననుభవించు చుండినచో వారు దివ్యగతి నుపేక్షించెదరు. ఈ మర్త్యలోక సుఖములలో నేదియో విశేషము లేకుండినచో భగవానుఁడేల దీనిని శాశ్వతముగ నిలుపుకొనునని భావించెదరు. వారికి నశ్వర శరీరమునం దాసక్తి లేకుండవలయునని భగవానుఁడును దన భువనమోహన దివ్య తనువును దిరోహితమొనర్చుకొనెను. కారణమందఱును నీ నశ్వరమగు శరీరమునందు మమతను వీడవలయుననియే.

రాజా! ఇది ప్రభువుయొక్క పరమపద ప్రయాణ పరమపావన కథ. దీనినిఁ బ్రాతఃకాలమున నత్యంత శ్రద్ధా

భక్తులతో నిత్యనియమమున నెవఁడు పారాయణ మొన ర్చునో, లేక వినునో, వారికిని జివరకీసర్వోత్తమగతి ప్రాప్తిం చును. అట్టివారికి ప్రభువుయొక్క పరమధామములభించును.'

సూతుఁడిట్లనెను:— 'మునులారా! ఏవిధముగ మా గురుదేవుఁడగు శుకుఁడు పరీక్షిన్మహారాజునకు భగవానుని పరమపద ప్రయాణకథను జెప్పెనో, దానిని మీకు నేను జెప్పితిని. ఇప్పుడింక మీరేమి వినఁగోరుచున్నారు?'

శౌనకుఁడిట్లనెను:— 'సూతా! భగవానుఁడు స్వధా మమునకు వేంచేసెను. ఇప్పుడు ద్వారకకుబోయి దారుకుఁడు భగవానునియొక్క బంధుబాంధవులగు యాదవుల కేమి చెప్పెనో, వారందఱ వినాశనమునువిని యేమి చేసినదియు వినవలయునని మాకు గుతూహలముగ నున్నది. కృపతో నీపుణ్యప్రసంగమును నీవు మాకు జెప్పవలయును.'

సూతుఁడిట్లనెను:— మునులారా! మంచిది. ఇప్పు డింక నీ కథలో మిగిలిన యంశమునుగూర్చి మీకు జెప్పెదను మీరందఱును దీనిని సావధానముగ శ్రవణ మొనర్పుఁడు.'

---

# యదువంశ వినాశోప సంహారము

శ్లో॥ ఇత్థం హరేర్భగవతో రుచిరావతార
వీర్యాణి బాలచరితాని చ శంతమాని।
అన్యత్ర చేహ చ శ్రుతాని గృణన్మనుష్యో
భక్తిం పరాం పరమహంసగతౌ లభేత॥

శ్రీభాగ.౧౧స్కం. ౩౧అ. ౨౮శ్లో॥

వ. రాజా! ఈవిధముగ శ్రీహరియొక్క పరమకల్యాణ కారియగు చరిత్రమును, రుచిరావతార పరాక్రమము లనుగూర్చి యీ గ్రంథములోఁ జెప్పఁబడినవి కానిండు, ఇతర గ్రంథములలోఁ జెప్పబడినవి కానిండు వానిని విని యెవరు గానమొనర్చెదరో, వారికి పరమహంసలకైకైక గతియగు వాసుదేవునియందు పరాభక్తి కలుగును.

—శ్రీ మదాంధ్ర మహాభాగవతము.

పతియే ప్రాణముగాఁగల పతివ్రతలకు పతియే సర్వస్వము. శరీరము లేక ఛాయయుండనట్లు పతిలేక పతివ్రతయును శరీరమును నిలువుకొనదు. పతి యీలోకమున నుండినచోఁ బతివ్రత పతివెంట నుండును. ఆతఁడు పరలోకగతుఁడైనచో నామెయును నాతనికొంగు పట్టుకొని వెనువెంటనే పోవును. తన నాథునికొఱకు చేయుకార్యములందు దేనియందును విసుగు జనింపదు. తల్లి పుత్రునికొఱ కెన్నియో కష్టములను సంతోషముగ సహించును. తనకత్యంతప్రియుఁడైనవాఁడు వచ్చినచో నాతనికల్పసేవ లన్నిటినిఁ జేయును. దానిలోనే సుఖమునుబొందును. కోమలాంగలై, అసూర్యంపశ్యలై, ఎండకును వాడిపోవు కోమలాంగులు పతిప్రాణలై ప్రేమలో మునిఁగి, ఆనందముగఁ బ్రజ్వలితాగ్ని యందు సంతోషముగ శరీరము భస్మమొనరించు కొందురు. ప్రేమ పథమతి దుస్తరమైనది. ప్రేమికొఱకేమిచేసినను నానందము కలుగును.

సూతుఁడిట్లనెను:- 'మునులారా! భగవానుఁడు స్వధామమునకు జేరెను. ఆతని మహాయాత్రను జూడ వచ్చిన దేవతలందఱును దమతమ లోకములకుఁ బోయిరి. ఇచ్చట భగవదాజ్ఞనుబొంది దారుకుఁడు ద్వారకాపురమునకు వచ్చెను. దేవకీ వసుదేవులును, శ్రీకృష్ణుని యితర తల్లులును నింకను ద్వారకలోనే ఉండిరి. ఉగ్రసేన మహారాజును నింకను ద్వారకయందే యుండెను. దారుకుఁడు సుధర్మ సభలోనికిఁబోయి పెద్దగ కేకవైచి క్రిందఁబడి బిగ్గఱగ నేడువ నారంభించెను. దీనినిఁ గాంచి వృద్ధులగు యాదవులందఱును మిక్కిలి వ్యాకులతను జెందెను. ఏదియో అశుభ వృత్తాంతము కలదని అందఱును ననుమానించిరి. అందఱును లేచిపోయి, దారుకుని లేవఁదీసి ధైర్యమును జెప్పుచు నిట్లనిరి:-'దారుకా! నీవింతగా నధీరుఁడ వగుచున్నావేల? ఏమి సమాచారము? మన బంధు బాంధవులు కుశలముగ నున్నారా?'

ఏడ్చుచు దారుకుఁడిట్లనెను:-'ఏమి కుశలము? కుశలము ప్రసుతము పృథివికే లేదు. యదువంశజు లందఱును బరస్పరము పోరాడుకొని మరణించిరి. బలరాముఁడును బరమగతిని జెందినాఁడు. శ్యామసుందరుఁడును నేను వచ్చునపుడు స్వధామమునకు బోవుటకుద్యమించినాఁడు. ఆతఁడును లీలాసంవరణ మొనరించియుండును.'

ఇట్లు పలికి ఆతఁడు మరల మూర్ఛితుఁడై వసుదేవుని పాదములపైఁబడి, తన యశ్రువులతో నాతని చరణములను దడిపివైచెను.

ఈ సమాచారమును వినఁగానే యాదవులందఱును రోదనము చేయసాగిరి. అందఱి చిత్తము లత్యంత ఉద్విగ్నము లయ్యెను. వారందఱును శోకకాతరులయి మూర్ఛితులైరి. అందఱును నధీరులై కన్నుల నీటిని గార్చుచుండిరి. రెండు చేతులతో శిరస్సులను బాదుకొను చుండిరి. నీటి నుండి బయటపడిన చేఁపలు తట తటఁ గొట్టుకొనినట్లు వారందఱును గొట్టుకొనుచుండిరి.

ఇప్పుడు వారికేమియును దోచకుండెను. కూర్చుండిన వారు కూర్చుండినట్లు ప్రభాసము వైపునకు బరువిడిరి. ఈ విషయము శంఖోద్ధారక తీర్థమునకు బోయిన వారికిని దెలుపఁబడెను. అల్పకాలముననే అందఱును నేడ్చుచు, మొత్తుకొనుచు, బ్రభాసక్షేత్రమునకుఁ జేరుకొనిరి. అచ్చట కోట్లకొలఁదిగ మృతకళేబరములు పడియుండెను. అచ్చటి దృశ్యమత్యంత భీభత్సముగ నుండెను. శ్రీకృష్ణుఁ డిహలోక లీలాసంవరణ మొనర్చిన నశ్వత్థవృక్షము కడకు చేరఁగనే వసుదేవ దేవకులును, రోహిణీ మొదలగు పత్నులును ఘోరముగ రోదనముచేయ నారంభించిరి. వారి పుత్రులు కనఁబడక పోఁగానే వారి హృదయములు బ్రద్ధలుకాఁ

